

ప్రియ ఘుమఘుమలు మీకోసం
అద్భుతం... ఇది అమోఘం... ఔనండీ - ఈ ప్రియ పచ్చళ్లు మీ కోసమే ! మేలైన దినుసులు,
నోరూరించే మధురిమల సమ్మేళనం - ప్రియ ఏదైనా... ఏ వంటకమైనా ఏ భోజనమైనా -
అల్పాహారమైనా - అతిథి సత్కారమైనా... 'ప్రియ' జోడించండి... మరచిపోలేని అనుభూతిని పొందండి!
ప్రియ - ఇప్పుడు మీ కెంతో ఇష్టమైన 15 వేర్వేరు రుచుల్లో
MANGO PICKLE
IN OIL
priya
priya
ఊరగాయలు
ఉషోదయా ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాదు- 500 482.
Sista's-UEL-272/92 TEL.B.
Tomato
Green Tamarind
Bitter Gourd
Mixed Vegetable
Lime
Ginger
Mango
Green Chilli
Sweet Ginger
Amla
Vadu Mango
Garlic
Gongura
Red Chilli

# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొనీ ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున, మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలో పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడు జాగ్రత్తపడటం మంచిది.

--- కూపన్ ---

డిసెంబర్ చతుర నవల మంచివాడు

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# విచిత్ర ప్రపంచం

## ఆదినుంచీ తప్పని పాత్రికేయ హింస

పత్రికలమీద, జర్నలిస్టులమీద ప్రభుత్వాలు దాడిచేస్తున్న సంఘటనలు ఇటీవల లెక్కకు మిక్కిలిగా పెరిగిపోతున్నాయి. ఈ రుగ్మత ఈనాటిది కాదు. భారతదేశంలో తొలిపత్రిక ప్రారంభమైన నాటినుంచే ఉంది. ''బెంగాల్ గెజిట్ ఆఫ్ కలకత్తా, జనరల్ అడ్వర్‌టైజర్'' పేరుతో కలకత్తాలో 1780 జనవరి 29న మొదలైన ఆ పత్రిక అవినీతిపరులైన అధికారుల్ని, పాలకుల్ని విమర్శిస్తూ వారి గుట్టుమట్లన్నింటినీ బజార్లో పెట్టింది. ఇంకా సంఘంలో పెద్దమనుమలుగా చెలామణి అవుతున్న నట ప్రముఖుల్ని వ్యాపార ప్రముఖుల్నీ బజారుకీడ్చి వారి అవినీతి భాగోతాల్ని ఎండగట్టింది. ఎంతటి ఉన్నతస్థానంలో ఉన్నవారినైనాసరే ఆ పత్రిక ఉపేక్షించలేదు. నాటి గవర్నర్ జనరల్ వారన్‌హేస్టింగ్స్, ప్రధాన న్యాయమూర్తి ఎలిజా ఇంపేల చెడు నడతల్ని కూడా ఎత్తిచూపుతూ విమర్శించిందా పత్రిక. ఆ రకంగా పాలకపక్షంవారి ఆగ్రహానికి గురైందా పత్రిక.




అవినీతిపాలిటి కొరడాదెబ్బలా గణుతికెక్కిన ఆ పత్రిక సంస్థాపకుడు జేమ్స్ అగస్టస్ హిక్కీ ఐరిష్‌దేశస్థుడు. అతడే సంపాదకుడుగా, పాత్రికేయుడుగా, ముద్రాపకుడుగా వ్యవహరించాడు. ఒక్కమాటలో చెప్పాలంటే ఆ పత్రికకు సంబంధించిన ప్రతి పనీ అతనే చూసుకునేవాడు. ఎంతోమంది యూరోపియన్లలాగే భారతదేశానికి వ్యాపారార్థం వచ్చాడు హిక్కీ. అయితే అతనేవ్యాపారమూ చేయలేకపోయాడు. దేశంలో అడుగడుగునా పేరుకుపోయిన అవినీతి, ఆశ్రితపక్షపాతమూ అతనికి పిచ్చికోపం తెప్పించేవి. అందుకే ఎక్కడబడితే అక్కడ ఎవర్నిబడితే వార్ని విమర్శిస్తూ 'పిచ్చి హిక్కీ' అనే పేరు తెచ్చుకున్నాడు. ఇండియాకు వచ్చేముందే బ్రిటన్‌లో కొద్దిగా ప్రింటింగ్ పనులు నేర్చుకొని ఉన్నందున తన అభిరుచికి దగ్గరగా ఉంటుందని పత్రికను ప్రారంభించాడు. అయితే పత్రికారంగంలో విపరీతమైన నష్టాల్నే అతను చవిచూశాడు. కారణం అతను 'ఒన్‌మేన్ ఆర్మీ'లా ప్రభుత్వంతోనూ, ప్రముఖులతోనూ ఢీకొనడమే! ఫలితంగా అతనిపై ఎన్నోసార్లు దాడులు జరిగాయి. కక్షసాధింపు చర్యగా ప్రభుత్వం అతన్ని ఏడాదిపాటు జైల్లో కూర్చోపెట్టింది. అతడి పేపర్, ప్రెస్ పరులస్వాధీనమైపోయాయి. ఏమైతేనేం నడిచింది అతికొద్దికాలమే అయినా హిక్కీగారి పత్రిక ప్రభుత్వానికి పక్కలోబల్లెంలాగే వ్యవహరించింది.

## బాల కళాస్రష్ట

కేవలం ఏడేళ్లన్నా నిండని పసిప్రాయంలోనే 20,000 పైగా పెయింటింగ్స్, డ్రాయింగ్స్ వేసి ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచెత్తాడు చిన్నారి గ్లిండ్. కేరళలోని దేవర గ్రామానికి

చెందిన జోసెఫ్-చిన్నమ్మ దంపతులకు గారా బు బిడ్డగా జన్మించిన ఈ బుడుతడు నెలల వయస్సులోనే చేతిలో ఏది ఉంటే దానితో నేలమీద గీయడం మొదలెట్టాడు. అవి పిచ్చి గీతల్లా కాక అత్యంత సహజంగా, జీవకళ ఉట్టిపడే చిత్రాల్లా ఉండడం చూసి అంతా ముక్కున వేలేసుకున్నారు. చేతిలో చాక్‌పీసో, పెన్సిలో ఉంటేచాలు యావత్ప్రపంచాన్ని మర్చిపోయేవాడతను. తదేకదీక్షతో ఒకటి తర్వాత ఒకటి వందలాది చిత్రాలు గీసిపడేసే వాడు. మరోరకంగా చెప్పాలంటే నిద్రపోయే సమయంలోతప్ప మిగిలిన కాలమంతా చిత్రర చనతోనే గడిపేసేవాడు. అతని ఉత్సాహాన్ని గమనించి, రాత్రి అతను పడుకునేముందు అతని గదిలో తెల్లకాగితాలు, రంగు పెన్సిళ్లు ఉంచేవారతని తల్లిదండ్రులు. మెలకువ వచ్చినప్పుడల్లా చిత్రాలు గీసే గ్లిండ్ నగటున రోజుకు 200 పైగా చిత్రాలు గీసేవాడట. కొన్ని కొన్ని సందర్భాల్లో అతని పేద తల్లిదండ్రులు అతనికి కావల్సినంత సామాగ్రిని సమకూర్చ లేక తల్లడిల్లిపోయేవారు.



గ్లిండ్ చిత్రించిన ప్రతి చిత్రంలోనూ జీవ కళ ఉట్టిపడేది. పిల్లలకు పాలిస్తున్న పెద్ద పులి బొమ్మ వేస్తే, పెద్దపులి కళ్లలో మాతృవాత్స ల్యం, పిల్లల కళ్లల్లో ఆనందం, తృప్తి కొట్టవచ్చి నట్లు కనబడేవి. ఓసారి చిత్రలేఖనం పోటీలు జరుగుతున్న సందర్భంలో సుజాత అనే ఓ ప్రసిద్ధ చిత్రకళా విమర్శకురాలు గ్లిండ్‌ని చూ సింది. ప్రపంచాన్ని మరచి, తన్మయత్వంతో, తదేకదీక్షతో తనపనితాను చేసుకుపోతున్నాడ తను. అతని చేతిలోని వేగంగా కదులుతున్న పెన్సిలు, దాని మొననుండి జాలువారుతున్న అద్భుత కళాప్రవాహం ఆమెని విభ్రమంలో ముంచెత్తాయి. వెంటనే ఆమె - "ఇప్పుడే నేనొక జన్మసిద్ధ కళాస్రష్టను సందర్శించాను..." అంటూ సగర్వంగా చెప్పింది.

అయితేనేం? "అద్భుతాలు చేసేవారంద రూ అల్పాయుష్కులే" అన్నట్లు కేవలం 80 నెలలకే మృత్యువాత పడ్డాడు గ్లిండ్. పుట్టుక తోనే సంక్రమించిన భయంకరమైన మూత్ర పిండాల వ్యాధి ఎలాంటి మందులకూ లొంగ కుండా అతన్ని దారుణంగా బలితీసుకొంది. గ్లిండ్ తదనంతరం అతని కళాఖండాల్ని మైక్రోఫిల్ముల రూపాలలో భద్రపరచి భావితరా లకి అందించాలని అభిప్రాయపడ్డారు కొంద రు. కానీ ఆ ప్రయత్నాలేవీ ఇంతవరకూ జరగ లేదు. కాకపోతే యునిసెఫ్‌వారు మాత్రం కొన్ని పెయింటింగ్స్ కొనుగోలు చేశారని తెలుస్తోంది.

అతి పిన్నవయసులో అద్భుతాలు సృ ష్టించిన ఇటువంటి బాలమేధావులు ఏ వెయ్యే ళ్లకో ఒక్కరుమాత్రమే పుడతారు. అటువంటి కళాకారుడు మనదేశంలో పుట్టినందుకు మనం గర్వపడాలి. గ్లిండ్ 1984 ఏప్రిల్ 14న మర ణించాడు.

## కుంటి పైలట్

ఓ బుల్లి జెట్‌విమానాన్ని సొంతంగాతయారు చేసుకొని ఆకాశంలో షికార్లు కొట్టాలని ఫిలిప్ స్కాట్ చిన్నతనంనుంచీ కలలు కంటుండేవా డు. సంపన్నులకే ఓ పట్టాన సాధ్యపడని ఆ 'ఖరీదైనకల'ని టాక్సీడ్రైవర్‌గా పనిచేసే ఫిలిప్ నిజం చేసేస్తాడని ఎవరు మాత్రం ఊహించగలరు? అదీగాక పన్నెండేళ్లక్రితం జరిగిన ఓ యాక్సిడెంట్ కారణంగా అతని శేషజీవితం వీల్‌ఛెయిర్‌కే అంటుకుపోయింది. అయినా ఫిలిప్ నిరుత్సాహపడలేదు. కవర్లు తయారుచేయడంవంటి కూర్పుని చేసేపను లు ఏవేవో చేస్తూ కొద్దికొద్దిగా డబ్బు కూడబెట్టసా గాడు. ఆ రకంగా తిండీతిప్పలు మాని రోజుకు 20 గంటలు కష్టపడి అచిరకాలంలోనే 37

లక్షలు రూపాయలవరకూ పోగుచేశాడతను.

ఆ తర్వాత సూసాన్ అనే తన ప్రియురాలి సాయంతో ఓ బుల్లివిమానాన్ని రూపొందించాడు ఫిలిప్. ఒకేఒక్క సీటున్న ఆ విమానాన్ని అధిరోహించి గాలిలో పదివదిహేను నిమిషాలు ఎగిరాడతను. అయితే అంగవైకల్యం కారణంగా ప్రభుత్వంగానీ, ఫ్లయింగ్‌క్లబ్బులుగానీ అతనికి ఫ్లయింగ్ లైసెన్సు ఇవ్వడానికి అంగీకరించలేదు.




ఆ పరిస్థితులలో 1988 సెప్టెంబర్ 7న జరిగిన ఓ 'ఫ్లయింగ్‌రేస్'లో పాల్గొని రెండవ స్థానం సాధించాడు ఫిలిప్. మొదట ఆ పోటీకి కూడా నిర్వాహకులు అతన్ని అంగీకరించలేదు. పోలీసులు అభ్యంతరం చెబుతున్నా వినక మొండిగా అందులో పాల్గొని అందరి అంచనాల్ని తలక్రిందులు చేశాడతను. అతని సామర్థ్యం తెలిశాక ప్రభుత్వం అతనికి లైసెన్సు మంజూరు చేయడమేగాక ఓ ఫ్లయింగ్ స్కూల్లో శిక్షణనిచ్చే ఉపాధ్యాయునిగా ఉద్యోగం ఇచ్చింది. ఇప్పటికీ ఫిలిఫ్ అన్ని పనులూ వీల్‌ఛైయిర్‌మీదే కూర్చుని చేయించుకుంటున్నాడన్న విషయం మనం మర్చిపోకూడదు.

## విజయం వెనుక...

ప్రఖ్యాత పాప్‌సింగర్ మాడొన్నా అంటే ఈనాడు ప్రపంచం మొత్తానికి తెల్సు. అద్భుతమైన ఆటతో అసాధారణమైన పాటతో ఆమె వెండితెర తారాసందోహాన్ని సైతం త్రోసిరాజని ప్రేక్షక శ్రోతల హృదయాలలో తనకో సుస్థిరస్థానాన్ని ఏర్పరచుకోగలిగింది. సుమారు పదేళ్లక్రితంవరకూ ఎవ్వరికీ తెలియని మాడొన్నా ఈనాడు ఇలా అగ్రస్థానానికి చేరుకుందంటే అందుక్కారణం దానివెనుకనున్న అచంచలమైన దీక్ష, అవిశ్రాంత కృషే అని చెప్పాలి.

1958 ఆగస్టు 16న ఓ మధ్యతరగతి కుటుంబంలో అమెరికాలోని రోచెస్టర్‌లో జన్మించింది మాడోన్నా. ఆరేళ్లవయసులో తల్లి కాన్సర్‌తో మరణించడమూ, తండ్రి వేరే అమ్మాయిని పెళ్ళాడ్డం జరగడంతో ఇంచుమించు అనాథలాగే ఆమె జీవితాన్ని కొనసాగించింది. ఆదిలో పాప్‌సింగర్ అవడంకన్నా స్టేజీయాక్టర్‌గా రాణించాలనీ, డిస్కోడాన్సర్‌గా పేరుతెచ్చుకోవాలని ఆమె అభిలషించేది. అందుకే స్కూలు గ్రౌండ్‌లోనూ, క్లాస్‌రూమ్ టేబుళ్ళ మీద ఎప్పుడు ఖాళీ ఉంటే అప్పుడు తనకు తోచినరీతిలో డాన్సులు చేసేది. అదేసమయంలో 'పియానో' వాయించడం అభ్యసించింది. అంతలో గ్రాడ్యుయేషన్ పూర్తిచేసుకొని తన ఆశయసాఫల్యంకోసం న్యూయార్క్‌కు చేరుకుందామె. అక్కడ కడుపు నింపుకోవడంకోసం కొన్ని బ్లూఫిల్ములను పోలిన సిన్మాల



లోనూ నటించింది. 'ప్లేబోయ్', 'పెంట్ హౌస్'వంటి పత్రికలకు సెక్స్‌పోజులు ఇచ్చింది. అలా సంపాదించిన కొద్దిపాటి డబ్బును పెట్టుబడిగా పెట్టి 'బ్రేక్‌ఫాస్ట్ మ్యూజిక్ క్లబ్' అనేది స్థాపించి ఓ చిన్న ట్రూప్‌తో ప్రదర్శనలివ్వడం మొదలెట్టింది. ఈ విషయంలో ఆమె బోయ్‌ఫ్రెండ్ క్లారీ ఆమెకు ఎంతో సహకరించాడు. అలా క్రమేణా అంచెలవారీగా ఎదిగి ఆమె నేడున్నస్థానానికి చేరుకుంది. ఇలా చేరుకోవడంవెనుక ఆమె అనుభవించిన కష్టాలు,, ఎదుర్కొన్న అవమానాలు ఇన్నీ అన్నీ కాదు. అయితేనేం? పట్టుదలతో వాటన్నింటినీ అధిగమించి విజయాన్ని సాధించి ఈనాడు ప్రపంచాన్నే ఒక ఊపు ఊపేస్తోందామె.

## బుల్లి టైపిస్టులు

**కేవలం ఆరేళ్ళ వయస్సులోనే నిముషానికి 70 మాటల వేగంతో టైపుచేసి గిన్నిస్ బుక్‌లోకి ఎక్కింది అల్కా. మహారాష్ట్రలోని 'వని' అనే చిన్న పట్టణంలో టైప్ ఇన్‌స్టిట్యూట్ నడువుతున్న మధుకర్ ఆమె తండ్రి. పసితనంలో అల్కా తండ్రి ఒడిలో కూర్చొని టైప్ మిషన్** కీబోర్డుని చూస్తూ అడపా దడపా దానిపైన వ్రేళ్ళాడించేది. "హుష్! మిషన్ పాడైపోతుంది... చేతులు తియ్!" అంటూ తండ్రి ఆమెను గద్దించలేదు. సరిగదా ఇంకా ప్రోత్సహించాడు. ఆ ప్రోత్సాహ ఫలితమే ఆమె గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్సులోకి ఎక్కడం.




రెండవ తరగతి చదువుతున్న అల్కాకి వచ్చిన ఇంగ్లీష్ అంతంతమాత్రమే అయినా లెటర్స్‌ని, స్టేట్‌మెంట్స్‌నీ ఉన్నది ఉన్నట్లుగా తప్పులు లేకుండా టైప్ చేయడం అభ్యసించింది. నిబంధనల కారణంగా, ఆమె అద్భుతమైన స్పీడ్‌తో టైప్ చేస్తున్నప్పటికీ లోయర్, హయ్యర్ పరీక్షలకి ప్రభుత్వం అనుమతించడంలేదు. అయినా ఆమె తండ్రి, అతని మిత్రులు ఏర్పాటు చేసిన ఓ టైపింగ్ ప్రదర్శనలో అల్కా తన సత్తా నిరూపించుకొంది. ప్రదర్శనకు హాజరైన పత్రికా విలేకరులు, ఇతరత్రా పెద్దలు ఆమె నైపుణ్యాన్ని గుర్తించి వరివరి విధాలుగా ఆమెను అభినందించారు. ఆ విషయాన్ని గిన్నిస్ బుక్‌కి చేరేలా వారు కృషిచేశారు.

అల్కా కథ ఇలా ఉంటే - కాన్పూర్‌కు చెందిన ఎనిమిదేళ్ళ నితిన్ ఓ ప్రముఖ లాయర్‌వద్ద 'టైపిస్టు'గా ఉద్యోగం కూడా వెలగబెడ్తున్నాడు. ఐదేళ్ల వయసులోనే అన్నతోపాటు టైపు నేర్చుకుంటానని మారాం చేసి మరీ ఇన్‌స్టిట్యూట్‌లో చేరాడు నితిన్. ఇన్‌స్టిట్యూట్ ప్రిన్స్‌పాల్ శ్రీమతి క్రిష్ణ కూడా ఆ పసివాడ్ని నిరుత్సాహపరచడం ఇష్టంలేక కొద్దిగా నేర్పింది. "నాల్రోజులయ్యాక విసుగుపుట్టి వాడే మానేస్తాడులే" అనుకుందామె. కానీ ఆమె అంచనాల్ని తారుమారు చేసి నిముషానికి 70 మాటల స్పీడ్‌తో టైప్ చేసే స్థితికి చేరుకున్నాడు నితిన్. ఈ విషయం తెల్సి జయప్రకాష్ అనే లాయర్ అతన్ని పిలిపించి సరదాగా అతని ప్రతిభని పరీక్షించాడు. లాయర్‌గారి కోర్టు కాగితాలూ, కాన్ఫిడెన్షియల్ పత్రాలూ ఒక్క తప్పు కూడా పోకుండా టైప్ చేసి 'శభాష్' అన్పించుకున్నాడు నితిన్. ఆపైన తన కుటుంబ ఆర్థిక పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకొని నెలజీతంమీద ఆ లాయర్ వద్దే టైపిస్టుగా కుదిరిపోయాడతను. ప్రస్తుతం పసితనంలోనే కుటుంబ భారాన్ని వహిస్తూ నలుగురి మెప్పు పొందుతున్నాడు నితిన్.



# ఈ ప్రకటన మీ సహోద్యోగికి చూపండి

## ఓ అదనపు ఆదాయము

పోస్టాఫీసు నెలసరి ఆదాయ పథకము మీ జీతం పెరగటానికి ఒక అద్వితీయమైన అవకాశము కల్పిస్తుంది. మీ డబ్బు అంచెలంచెలుగా పెరుగుతూ సురక్షితంగా, భద్రంగా ఉంటుంది. ఇది ప్రజల కొరకు ప్రభుత్వం ఏర్పరచిన ఒక చక్కని సులువైన పథకం.

సంపాదించండి పొదుపు చేసి వృద్ధి చెందండి.

ప్రత్యేకాంశాలు :

- నెలనెలా 14% సాధారణ వడ్డీ చెల్లించబడును.
- పరిపక్వత చెందిన తరువాత 10% అదనపు రాబడి.
- తరుణం రాకముందె ఉపసంహరించుకొనవచ్చు.
- 5000 నుండి 2 లక్షల దాకా ఒక వ్యక్తి పేరు మీద కాని, లేక 4 లక్షలు సమిష్టిగా కాని డిపాజిట్లు చేసుకొనవచ్చు.
- ఆదాయపు పన్ను చట్టం సెక్షను 80L క్రింద సంపాదించిన వడ్డీ పన్ను మినహాయించబడును.

## పొదుపు చేసుకునే మార్గము వారికి చూపండి

| పెట్టుబడి రూ | నెలసరి ఆదాయము రూ | పరిపక్వతకు (6 సం) తర్వాత బోనసు రూ | మొత్తం సొమ్ము చెల్లింపు రూ |
|---|---|---|---|
| 10,000 | 116.70 | 1,000 | 19,402.00 |
| 20,000 | 233.40 | 2,000 | 38,804.00 |
| 30,000 | 350.10 | 0,000 | 58,206.00 |

ఇతర వివరాలకు:
మీ దగ్గరలో ఉన్న పోస్టాఫీసులో కాని, కలెక్టరు కార్యాలయంలోని తహసిల్దారునికాని, జాతీయ పొదుపు సంస్థ జిల్లా పొదుపు అధికారిని కాని, ఇతర అధికారిక ఏజెంట్లను కాని సంప్రదించండి.

కమీషనరు
చిన్న మొత్తాల పొదుపు
5వ అంతస్తు, ఇన్సూరెన్స్ బిల్డింగు, తిలక్‌రోడ్, అబిడ్స్,
హైదరాబాదు-500 001.
టెలిఫోను నెంబర్లు-232939/234412

పేరు ..............................
..............................
చిరునామా ..............................
..............................
..............................
పిన్ కోడ్ ..............................

మీ భద్రతే మా లక్ష్యం

MIS FRONTLINE





అక్టోబర్ 'చతుర'లో ప్రచురించిన కాశీవిశ్వనాథ్‌గారి సమగ్ర నవల 'బంగారులేడి'పై పాఠకులనుండి అందిన సమీక్షలలో ఉత్తమంగా భావించిన ఆరింటిని ఎన్నిక చేసి అందజేస్తున్నాం

## అబద్ధాల ఉచ్చుల్లో...

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

**అ**క్టోబరు నెల చతుర నవలలో మనిషి అబద్ధాలు ఎంతబాగా ఆడగలడో, ఒక అబద్ధానికి పది అబద్ధాలు సృష్టించి మొదటి అబద్ధాన్ని నిజం చేయాలని చూడడంలో ఎంత తాపత్రయపడతాడో అద్దం పట్టినట్టు చూపించారు రచయిత. ఎంత సంపాదించినా తృప్తిలేని ఈ నవీన యుగంలో కార్లు తదితర సౌకర్యాల్ని సొంతం చేసుకోడం కోసం ఎన్ని పాపాలు, మోసాలు చేస్తారో బాగా చెప్పారు. రాంబాబు అమలల అసంతృప్తి బతుకులు, ఒకరికంటే ఒకరు ఘనులన్నట్టుగా భార్య ఆడిన అబద్ధాలకు రూపు దిద్దిన భర్తగా రాంబాబు పాత్ర చాలా సహజంగా ఉంది. రాంబాబుకు మనసులో తను చేస్తున్న పనులు తప్పని తెలిసినా భార్య మీదుండే వ్యామోహం ఆమెకు వెనకాల ఆస్తి ఉన్నదేమోననే ఆశ అతని చేత ఈ అపసవ్యమైన పనులు చేయించాయని చెప్పవచ్చు. భార్యా భర్తల్లో ఏ ఒక్కరికైనా చక్కటి ఆలోచనా జ్ఞానం, తృప్తి అన్నది లేకపోతే ఆ సంసారం ఎంతకు దిగజారుతుందనేది చాలా స్పష్టంగా చిత్రీకరించారు. అయితే ఏవిధమైన పత్రమూ హామీ లేకుండానే ఒక ఉద్యోగస్తునికి అన్ని విలువయిన సామానులు అద్దెకు ఇవ్వడం అనేది కొంచెం అపసవ్యంగా అనిపించింది. ఫాల్స్ ప్రిస్టేజ్ ఎంత హానికరమో ఈ నవలద్వారా చెప్పారు. ఆఫీసర్ రామారావు ఆఫీసులో ఉద్యోగస్థులందరికీ చిక్కు ప్రశ్నలు వేసి వాళ్ళ మేధస్సుకు పదును పెట్టడం, ఒక స్నేహితుడిలా వారి కష్టసుఖాలు కనుక్కుంటూ సలహాలు ఇవ్వడం వారికి అవసరమయిన లోన్లు యిప్పించడం వంటివి చేసి ఒక చక్కటి ఆఫీసరుగా అతని పాత్ర చిత్రణ చేశారు.

మొత్తం మీద అబద్ధాల ఉచ్చులో చిక్కుకుని బయటికి రాలేక బయటికి చెప్పలేక అమల, రాంబాబులు పడినబాధ, ఆ అబద్ధాలకు మూల కారకులయిన చలపతి, అచ్యుతా

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్:
జగ్‌మోహన్

నందలాంటి తండ్రుల తాపత్రయం ఈ నవల చదివినవారి మనసుల్లో ఆలోచన రేపుతుంది. తృప్తికి, అబద్ధాలకి అంతెక్కడ? ఈ రెండింటినీ ముడి వేస్తేనే కాశీవిశ్వనాథ్‌గారి నవల 'బంగారులేడి'

-శ్రీమతి బి.కాంతారావు
మెద్రాస

## తప్పుమీద తప్పు

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

1992 అక్టోబరు 'చతుర' నవల 'బంగారులేడి'లో వంచనచేసి బాగుపడిన వారున్నారేమో గాని, ఆత్మవంచనకు దిగి సుఖపడే వాళ్ళెవరూ వుండరన్న సత్యాన్ని ప్రాతిపదికగా చేసుకుని అమల, రాంబాబు పాత్రలద్వారా బాగా నిరూపించారు.

ఒక తప్పును కప్పిపుచ్చుకోవడానికి మరొక తప్పు, దానిని కప్పి పుచ్చుకోవడానికి ఇంకొక తప్పు యిలా వారిద్దరి ప్రయాణం తప్పుల మయం అయింది. వారిద్దరూ కూడా ఒకరినొకరు మభ్యపెట్టుకుంటూ బతకడంద్వారా ఆత్మ వంచనకు పాల్పడడం, ఎండమావి కోసం పరుగులు తీయడం జరిగింది. మనుమల బలహీనతలకు యిది పరాకాష్ట. ఇలాంటి రుగ్మతలకు లోనైన వారి జీవితాలు చివరికి ఎంత హాస్యాస్పదంగా దయనీయంగా తయారవుతాయో వీరిద్దరినీ చూసి తెలుసుకోవచ్చును.

బంగారులేడి వుండటం అన్నది ఎంత కాల్పనికమో అసంబద్ధమైన జీవిత గమనాలు గతులు తప్పడం, నిలకడ లేకుండా పోవడం కూడా అంతే హేతుబద్ధం అని ఈ నవల నిరూపించింది.

చాలా చోట్ల పాత్రల లోనూ, సందర్భాలలోనూ, సంభాషణలలోనూ నాటకీయత చోటు చేసుకోవడం ఒక చిన్నలోపం. అయితే కథాగమనం వేగంగా సాగడం, సంఘటనల పరంపర, ఉత్కంఠ వీటి మూలంగా యీ లోపం పెద్దగా తోచదు. ఇందులో ఎక్కడైనా ఏదైనా సంఘటన యింత సులువుగానూ, కాకతాళీయంగానూ జరుగుతుందా అని సందేహం కలిగిన చోట, యిలా కూడా జరుగుతుంది, జరగవచ్చును సుమా అనిపింప చేయడం రచనలోని ప్రత్యేకత.

మొత్తం మీద ఇదొక మంచి నవల.

-వి.కామేశ్వరరావు
పెద్దాపురం

## ఆడంబరాలు

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

కాశీవిశ్వనాథ్‌గారి 'చతుర' నవల 'బంగారులేడి' అర్థవంతంగా ఉండి చివరవరకూ చదివించింది. కొందరు స్త్రీలు యితరులను చూసి ఎలా మిథ్యాడంబరాల కొరకు పరుగులు తీస్తున్నారో కన్నులకు కట్టినట్లుగా అభివర్ణించారు.

ప్రస్తుత కాలంలో యువత నిరుద్యోగం వలన పడే పాట్లూ, బతకడానికి కొందరు చేసే ప్రయత్నాల్నీ ప్రజలలోని మూఢనమ్మకాల్ని వాడుకుని తమ వాక్చాతుర్యంతో మోసం చేసి సంపాదించిన సొమ్ముతో పొట్టలు నింపుకునే వారినీ చక్కగా వర్ణించారు. చలపతిలా ఎంతో మంది తండ్రులు బాధ్యతారహితంగా కుటుంబాన్ని పట్టించుకోకుండా భార్యాబిడ్డలు సంపాదించే డబ్బుతో జల్సాలు చేసుకొంటున్నారు. డబ్బు విషయంలో తృప్తి, కీర్తి విషయంలో అసంతృప్తీ వున్ననాడే మనిషి సుఖపడి గొప్పవాడౌతాడనీ, జీవితంలో గొప్పవారు కావాలంటే తమకంటే గొప్పవారితో పోల్చుకోవాలనీ, అలాగే సుఖపడాలంటే తనకంటే తక్కువ స్థితిలో ఉన్నవారితో పోల్చుకోవాలనే అమూల్యమైన సలహాలను రామారావు పాత్రద్వారా చెప్పించారు.

ఫాల్స్ ప్రిస్టేజి ప్రదర్శించడం, గొప్పలకోసం అప్పులు చేయడం వలన కలిగే కష్టనష్టాలతో లోభికి ఖర్చెక్కువన్నే కాకుండా పులిని చూసి నక్క వాతలు పెట్టుకొన్నట్లు అనే సామెతలను ఋజువు చేసిందీ రచన. హారిక కంటే తాను తక్కువ ఉండకూడదన్న తపనతో అలనాడు బంగారులేడి కొరకు రాముడిని సీత పరుగులు తీయించినట్లు ఈ కథలోని అమల రాంబాబును పడలాని పాట్లు పడేట్లు చేసింది. తమ పరిస్థితి గుర్తెరిగి ఉండీ, భార్య ఆడంబరాల

కొరకు ప్రాకులాడుతోందని గ్రహించి కూడా, ఆమెను సరిదిద్దుకోలేక తనూ అదే ప్రలోభానికి బానిసై అబద్ధాలమాలను అల్లుకుంటూ వెళ్ళిన రాంబాబు, చివరకు విడాకుల నాటకం ఆడాలని కూడా భార్యతో ఒప్పించి యిద్దరూ కల్సి అందర్నీ మోసగించాలనే ప్రయత్నంతో దొరికిపోయారు.

ఆఫీసులో కొత్తరకమైన ఇంటర్వ్యూ పద్ధతులూ, ఆఫీస్ స్టాఫ్‌ను ఎంకరేజ్ చేసే క్విజ్ పోటీలు తమాషాగా ఉన్నాయి. ఆఫీసర్లు అందరూ రామారావులా తన దగ్గర పనిచేసే వాళ్ళ గురించి అంత శ్రద్ధ తీసుకుంటే బాగుండును. మొత్తం మీద నవలను మొదటినుండీ చివరి వరకు చదివించగలిగారు కాశీవిశ్వనాథ్‌గారు.

**జి.మనోజమ్మ**
నెల్లూరు

## మధ్యతరగతి గాలిమేడలు

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

రామాయణ కథలో బంగారులేడి కారణంగా సీతారాములకు సంభవించిన కష్టాలను ప్రాతిపదికగా తీసుకొని, సమకాలీన జీవితానికి దాన్ని అన్వయించి మధ్యతరగతి వారెదుర్కొనే సమస్యల్ని అతి సహజంగా చిత్రించిన నవల 'బంగారులేడి'. హాస్యరసంతో మొదలయి చివరికి సందేశాత్మకంగా ముగించిన తీరు బాగుంది. నవలలో అన్ని పాత్రలు సహజంగానే అనిపించినా ఒక్క హారిక పాత్ర మాత్రం పని పిల్ల స్థాయినుండి అత్యున్నతస్థాయికి ఎదగడం సహజంగా అనిపించలేదు. అయినా అమల , రాంబాబుల హృదయాల్లో ఆటుపోటులను సృష్టించడానికి ఆ పాత్ర బాగా పనికి వచ్చింది. అసలు కథాంశాన్ని మలుపు తిప్పే 'బంగారులేడి' హారికయే. పోతే ఉదాత్తమైన, ఉన్నతమయిన పాత్ర రామారావుది. రాంబాబు, అమలలకు అయనిచ్చిన ప్రబోధాత్మక సందేశం ఉత్కృష్టమయినది. తనకంటే ఉన్నతస్థాయి వారి విషయంలోనూ, అలాగే తక్కువ స్థాయివారిని గురించీ ఎలాంటి అభిప్రాయం ఉండాలన్న ఇంగితం గురించి చెప్పిన మాటలు ఆచరణీయం. ఆ అవగాహన లేకపోతే ఎలాంటి కష్టాలు ఎదురవుతాయో, పర్యవసానం ఎలా ఉంటుందో ఆ తర్వాత జరిగిన సంఘటనలు తెలుపుతాయి. ఉద్యోగం చేస్తున్నవారు చీటీలు నడపడంలాంటి సైడ్ బిజినెస్‌లు మామూలయిపోయిందీ రోజుల్లో. 'పులిని చూసి నక్క వాతలు పెట్టుకోవటం' లాంటిదే ఇదీనూ. చివరికి రామారావు, హారికలు ఒక్కోచిక్కుముడీ విప్పడం సినిమాటిక్‌గా అనిపించినా మొత్తానికి బడాయికి పోయి చిక్కుల్లోపడే మధ్యతరగతివారికి ఈ నవల ఓ హెచ్చరిక.

**-యం.రవీంద్రనాథ్**
నిజామాబాదు

## బంగారంలాంటి...

*(రూ.25/- బహుమతి పొందిన సమీక్ష)*

'హాస్యాన్నందిస్తూనే ఆలోచింపచేసే కాశీవిశ్వనాథ్ నవల 'బంగారులేడి' ఈ నెల చతుర సమర్పణ' అన్నారుగానీ 'హాస్యాన్నందిస్తూనే ఆలోచింపచేసే కాశీవిశ్వనాథ్ 'అద్భుత' నవల' అనటం కరెక్ట్.

ప్రపంచంలోని పురుషులంతా మోసగాళ్ళే లాంటి పుచ్చు డైలాగులుగానీ నవల్లోని కేరక్టర్లన్నీ ఒక చోట చేరి బావురుమనడంగానీ, అసాధారణ ధీరత్వంతో ముందుకు సాగిన స్త్రీ చివరికి ఎక్కడికి చేరిందో అర్థం కాకపోవడంగానీ, అత్తాకోడళ్ళ కొత్తకొత్త సమస్యలలాంటివిగానీ యిందులోలేవు. కానీ జీవితం వుంది. గట్టిగా చెప్పాలంటే మనిషి పతనానికి దారితీసే వాటిలో మొదటిదైన ఆత్మవంచన చివరికి ఎలాంటి వికృత ఫలితాన్నిస్తుందో స్పష్టంగా చెప్పిందీ నవల. వంచన చేసి బాగుపడిన వారున్నారేమోగాని, ఆత్మవంచనకి దిగి సుఖపడేవారుండరనే ఒక్క వాక్యం చాలు ఈ నవల ఎలాంటిదో చెప్పడానికి. అలాగే అమ్మాయిల పెళ్ళితో ముడిపెట్టి ఆవాల అప్పారావు చేత చెప్పించిన మాటలు కళ్ళెంట నీళ్ళు తెప్పించాయి. అదీ విషాదమంటే! అతన్తోనే జ్యోతిష్యం గురించి చెప్పించిన మాటలు అక్షర సత్యాలు. రైడింగ్‌లో పోలీసులకు దొరికిపోయి కూడా తనని విడిపించిన రాంబాబుని

భీష్ముడికన్నా తక్కువ చేసి తనని రాజరాజన రేంద్రుడికన్నా గొప్పవాడిగా చెప్పుకుని మాట్లాడిన చలపతిని మంత్రసాన్ని పిలవడానికైనా రిక్షా ఛార్జీ వడ్డీతో సహా వసూలు చేయాలనుకున్న అప్పల్నర్సయ్యతో పోలిస్తే వున్నతుడిగానే కనబడతాడు, ఏమీలేని స్నేహితుణ్ణి వియ్యంకుణ్ణి చేసుకోవడంద్వారా. అలాగే రామారావు రాముడిని పరశురాముడితో కంపేర్ చేసి చెప్పడం, బంగారులేడి కిచ్చిన వివరణ, చివర్లో తన పాత్ర అసహజత్వానికి తనే వివరణ నివ్వడం బావున్నాయి. అయితే మన తెలుగు పాఠకులు రాంబాబు సంసారంలోకి కష్టాలని సప్లై చేస్తున్నదెవరో యిట్టే కనిపెట్టేస్తారు. కేవలం రాంబాబు తెలివితేటల వల్ల ఉద్యోగం సంపాదించడం, రాంబాబు ఆస్తి మీదే ఆశపెట్టుకోవడంద్వారా అమలకి విలువ లేకపోయింది. గండర గండడు లాంటి రామారావ్‌నే మింగుడు పడని ప్రశ్నల్తో బోల్తా కొట్టించిన రాంబాబు, చీటీ ప్రోనోట్లు నాలిక గీసుకోవడానికి పనికొస్తాయని వంద రూపాయలిచ్చి మరీ లాయర్ చేత చెప్పించుకోవడం చూస్తే ప్రతిమగాడి అవజయం వెనుకా ఒక స్త్రీ వుంటుందనేది నిజమేననిపిస్తుంది. ఏదేమైనా 'వేమన పద్యమంత భావ గర్భితంగానూ, సుమతీశతకంలోని పద్యమంత నీతి బోధించేదిగానూ' వున్న ఈ నవల చదివి అమలలాంటి వారెవరైనా మారితే రచయిత శ్రమకి ఫలితం దక్కినట్టే.

-వేపూరి శివసుబ్రహ్మణ్యం
హైదరాబాద్

## ఔచిత్యానికి దగ్గరగా...

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

'**త**నకున్న దానితో తృప్తి పొందనివాడు, కావాలని కోరుకున్న దానితో కూడా ఎన్నడూ తృప్తి పొందలేడు' అంటాడు గ్రీకు తత్త్వవేత్త సోక్రటీస్.

అదే విషయాన్ని మన పోతన కూడా భాగవతంలో బలిచక్రవర్తి ద్వారా శుక్రాచార్యునికి వినిపిస్తాడు. 'వ్యాప్తిం బొందక వగవక, ప్రాప్తం బగు లేశమైన పదివేలనుచున్, తృప్తిం జెందని మనుజుడు, సప్తద్వీపములనేని జక్కంబడునే?' అని.

నిజమే మరి. మనిషికి ఆశ ఉండాలి. లేకపోతే బతకలేడు. కాని ఆ ఆశ దురాశ కాకూడదు. ఉన్నదానితో ఎవరికైతే తృప్తి కలగదో, వారు కోరుకున్న వన్నీ లభిస్తున్నా అప్పటికీ వాడికి తృప్తి కలుగదు. దాంతో సుఖం కొంచెం కొంచెంగా దూరమై, మనశ్శాంతి కరువౌతుంది చివరకు. అలాంటి అసంతృప్తి పరులకు ఆటోమాటిక్‌గా ప్రకృతే ఒకనాటికి మంచి గుణపాఠం నేర్పుతుంది.

ఈ థీమ్ మీద నడిచిన ఈ నెల చతుర నవల 'బంగారులేడి' ఏవరేజ్‌గా ఉంది. కథా వస్తువులో కొత్తదనం లేకపోవడమే అందుకు కారణం అనుకుంటాను.

అయితే కథకు మూలమయిన సూత్రం రచయిత బాగా ఎనలైజ్ చేసి చూపించారు. అది-

'రాముడికి కష్టాలు ఆరంభమైంది అడవులకు వెళ్ళినప్పట్నించీ కాదు. జంగిల్‌లో కూడ జాలీగానే గడిపేశాడట. అసలైన ట్రబుల్స్ ఎప్పట్నించీ అంటే సీత బంగారులేడిని కోరినప్పట్నించీ' అంటూ రాజా సీతారాందాసు పాత్రద్వారా రామాయణానికి ఆయువుపట్టు మీద ఎనాలిసిస్ చేసి చూపించడం, రచయితను అభినందించదగిన విషయం.

కథలోని పాత్రలన్నీ ఔచిత్యానికి దగ్గరగా నడిచాయి. అర్థాంతరన్యాసంగా రచయిత చెప్పిన విషయాలు సర్వత్రా వర్తిస్తాయి. ఉదా: 'మనదేశంలో విజ్ఞానం, విజ్ఞానమే, దైవభక్తి దైవభక్తే విడివిడిగా బతుకుతున్నాయి. అందుకే ఇలాంటిదేశంలో జ్యోతిష్యం బతుకుతుంది',

'ప్రాణాలు తియ్యడానికి రౌడీలు వెంబడించినపుడు కుంటివాడు కూడా ఒలింపిక్ ఛాంపియన్ కంటే జోరుగా పరుగెడుతాడు' లాంటివి.

ఫాల్స్‌ప్రిస్టేజ్‌కు పోయి, జీవితాల్ని నరకం చేసుకునే కుటుంబాలకు ఈ బంగారులేడి ఓ కనువిప్పు అవుతుందని ఆశిద్దాం.

-శ్రీమతి బందరు దేవీదుర్గాప్రసాద్
కవిటి

సంపుటి : 15 సంచిక : 11 డిసెంబర్ : 1992

# చతుర

"చూడండీ! నాకు తెలిసిన ఒకే ఒక్క సంబంధంవుంది. లక్షలకు లక్షల ఆస్తి. ఒక్కడే కొడుకు, ఏ వ్యసనాలూ లేని కుర్రాడు. కనీసం వక్కపలుకు కూడా కొరకడు" అన్నాడు పెళ్ళిళ్ళ పేరయ్య.

"మరింకేమండీ ఆ సంబంధమే ఖాయం చెయ్యండి మా అమ్మాయికి" అన్నాడు పిల్లతండ్రి.

"అబ్బెబ్బే! మీరు నాకు బాగా తెలిసినవారు. చూస్తూ చూస్తూ ఆ సంబంధాన్ని కుదిర్చి అమ్మాయి గొంతు కొయ్యడం నాకిష్టం లేదు స్మీ..." అంటూ లెంపలేసుకున్నాడు పేరయ్య.

ఎందుకు?

అల్లరిచిల్లరి ఆకతాయిలుగా పిల్లలు మారుతున్న ఈ కాలంలో ఓ బుద్ధిమంతుడు పెళ్ళిళ్ళ పోటీలో నిలబడ లేకపోవడానికి కారణం ఏమిటి?

హాస్యాన్ని చిలకరిస్తూనే ఆలోచనలకు తావిచ్చే కె.ఎమ్. కోకిల రాసిన 'మంచివాడు' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

# మంచివాడు

—కె.ఎమ్. కోకిల

''ఆ అబ్బాయికేమండీ? లక్షణమైన కుర్రాడు. ఎవరైనాసరే ఎగిరిగంతేసి మరీ చేస్కోవాల్సిన సంబంధం. అలాంటిది మీరెందుక్కాదంటున్నారో నాకు బొత్తిగా అర్థం కావట్లేదు'' అన్నాడు లోకేశ్వరరావు మాధవరావుకేసి అదోలా చూస్తూ.

''నిజమేననుకోండీ... కానీ...'' అంటూ నీళ్ళు నమిలాడు మాధవరావు.

''ఊఁ కానీ?'' అంటూ కళ్ళెగరేశాడు లోకేశ్వరరావు.

''ఆ అబ్బాయి గురించి నేను ఎంక్వయిరీ చేశాను...''

''ఊఁ చేస్తే?'' అంటూ కళ్ళజోడుకీ కనుబొమలకీ మధ్యనున్న ఖాళీగుండా ఓరగా చూశాడు లోకేశ్వరరావు.

''ఆ అబ్బాయి అడపాదడపా స్నేహితుల్తో కలిసి మందు కొడుతుంటాడని తెలిసింది...''

మాధవరావు ఇలా మాట పూర్తిచేశాడో లేదో గొప్ప జోకేదో విన్నవాడిలా ఘొల్లున నవ్వేడు లోకేశ్వరరావు. ఆ నవ్వడంలో ఆయనకు పొలమారింది. అయినాసరే నవ్వటం అంతటితో ఆపేయలేదాయన. ఓ చేత్తో మాడుమీద చరుచుకుంటూ మరోచేత్తో పొట్టపట్టుకుంటూ మళ్ళీ ఘొల్లుమన్నాడు.

మాధవరావు బిత్తరపోతూ చూశాడాయన వైపు. ఆయనెందుకలా నవ్వుతున్నాడో, తానన్నదాన్లో అంతగా నవ్వాల్సిందేముందో ఈయనకు బొత్తిగా అర్థంకాలేదు.

ఈయనకే కాదు. తలుపుపక్కన నిలబడి వీళ్ళ సంభాషణ ఆలకిస్తోన్న జోగాంబక్కూడా అర్థం కాలేదా విషయం.

జోగాంబ మాధవరావు భార్య.

అలా ఆ దంపతులిద్దర్నీ కొద్దిక్షణాలపాటు కన్ఫ్యూజన్లో పడేసిన లోకేశ్వరరావు ఒకింత సేపటితర్వాత నవ్వటం ఆపి మాధవరావుకేసి బాధగా చూస్తూ అన్నాడు. ''ఎంత అమాయకులండీ మీరు?''

''మీరేమంటున్నారో నా కర్థం కావట్లేదు...'' నిజంగానే అర్థంకాక బిక్కముఖం పెట్టాడు మాధవరావు.

''లేకపోతే ఏవిటండీ?'' అంటూ మరోమారు నవ్వబోయి ఆపేసి ''భలేవారే మొత్తానికి మీరు. నేనింకా ఏవిటో అనుకుని హడిలిపోయానంటే నమ్మండి... ఇంత చిన్న విషయానికా మీరు తటపటాయిస్తోంది? మందు కొట్టడం ఈ రోజుల్లో చాలా సింపుల్ విషయం అండీ బాబూ! ఏడో తరగతిలో కాలెట్టగానే సిగరెట్టూ, టెన్త్‌క్లాస్‌లో కాలెట్టగానే మందుగ్లాసూ పట్టుకోని కుర్రాడెవడండీ ఈ కాలంలో? ఏదో ఎంజాయ్‌మెంట్ కోసం అకేషనల్‌గా ఓ చుక్కేసినంత మాత్రానికే తాగుబోతుకింద జమకట్టేస్తే ఎలా?'' అంటూ పూర్తిచేశాడు లోకేశ్వరరావు.

'ఏడ్చినట్టే వుంది నీ సపోర్టు' అని మనసులో అనుకున్నా పైకి మాత్రం మొహమాటానికి ఓ వెర్రినవ్వు నవ్వి... ''నిజమేననుకోండి... కానీ నాకున్నది ఒక్కగానొక్క కూతురు. ఇవ్వాళ సరదాకోసం చేసుకున్న అలవాట్లే రేప్పొద్దున్న వ్యసనాలుగా మారవన్న నమ్మకం ఏవుంది? దుర్వ్యసనాలు ఎలాంటి మనిషినైనా అధఃపాతాళానికి తొక్కేస్తాయి. అందువల్ల ఒకింత ఆలస్యమయినాసరే మా అమ్మాయికి అన్నివిధాలా బుద్ధిమంతుడైన అబ్బాయిని చూడాలన్నది నా కోరిక...'' అన్నాడు మాధవరావు చేతులు నలుపుకుంటూ.

ఆ కోరికేదో కోరరాని కోరికైనట్టు కాస్త గుర్రుగానే చూశాడు లోకేశ్వరరావు. కానైతే పైకి తేలిపోలేదు.

''అంటే మీకు సకలసద్గుణ సంపన్నుడైన అల్లుడు కావాలన్నమాట?!''

లోకేశ్వరరావు వాడింది మరీ పెద్ద సమాసం కావడంవల్ల అందులో రవంత వ్యంగ్యం దాగి వుందని తెలుస్తూనే వున్నా... కాంప్రమైజ్ అయిపోయి 'అవు'నన్నట్టు నిలువుగా తలాడించాడు మాధవరావు.

''మరైతే ఈ ముక్క నాతో ముందే చెప్పుండొచ్చుగా? ఇప్పటికిది మూడో సంబంధం మీరిలా తిరగ్గొట్టడం...'' కంఠంలో నిష్ఠూరాన్ని మేళవిస్తూ అన్నాడు లోకేశ్వరరావు.

''నేను మొదటే చెప్పానుకదండీ, కుర్రాడు బుద్ధిమంతుడై వుండాలని? నా తప్పేముందీ?'' అన్నట్టు చూశాడు మాధవరావు.

''బుద్ధిమంతుడంటే ఈ రోజుల్లో మితిమీరిన వ్యసనాలు లేని వాళ్ళంతా బుద్ధిమంతులే మరి! మీరు మరీ మడిగట్టుక్కూర్చున్న కుర్రా

ణ్ణి కోరుకుంటున్నారని నాకేం తెలుసు? తెలి నుంచే అలాంటివాణ్ణే వెదికుండేవాణ్ణి. అఫ్ కోర్స్ ఈ రోజుల్లో అలాంటివాళ్ళు దొరకడం కష్టమే అనుకోండి. బట్ నాకు తెలిసిన ఓ కుర్రాడున్నాడు. కానీ...'' అంటూ నాన్చాడు లోకేశ్వరరావు.

చేతిలో పొడుంకాయా, నెత్తిన పిలక, భుజానికి సంచీ వగైరా వగైరాలతో చూడగానే పెళ్లిళ్ల పేరయ్య అని తెలిసిపోయేలా వుండడుగాని, నిజానికి లోకేశ్వరరావు పెళ్లిళ్ల పేరయ్యే!

ఏదో ప్రభుత్వాఫీసులో గుమాస్తాగిరీ వెలిగించి హెడ్‌గుమాస్తాగా రిటైరైన అనంతరం మొదట్లో ఏదో ఉబుసుపోకకన్నట్టు ఈ వ్యాపకాన్ని చేపట్టి ఇపుడారంగంలో సిద్ధహస్తుడైపోయాడాయన. పెళ్ళిళ్ళు కుదర్చడం ద్వారా వచ్చే ఆదాయంతో పోలిస్తే ఆయనకొస్తూన్న పెన్షన్ ఓ లెక్కలోకి రాదు. ఏ కులంవారికైనా, ఏ వర్గంవారికైనా అమ్మాయికిగానీ, అబ్బాయికిగానీ, వారివారి అభిరుచులమేరకు తగిన సంబంధాన్ని కుదర్చడంలో ఆయనకాయనే సాటిగా పేరు తెచ్చుకోవడంవల్ల- ఆ పేరుతోపాటు తన ఆదాయాన్ని కూడా ఇబ్బడి ముబ్బడి చేసుకోగలిగాడాయన.

ఆయన నాన్చుడికి కారణం తెలుసుకోగోర్తున్నవాడిలా కుర్చీలోంచి ఒకింత ముందుకొంగి- ''ఊఁ... చెప్పండి'' అన్నాడు మాధవరావు.

కుడిచేతి చూపుడు మరియు బొటనవేళ్ళతో కణతలు రుద్దుకుంటూ ఓ నిట్టూర్పులాంటిది విడిచి... ఆ మీదట అన్నాడు లోకేశ్వరరావు- ''ఆ కుర్రాడి పేరు దయాసాగర్. ఎమ్మే గోల్డ్‌మెడలిస్ట్. మీకు మీ అమ్మాయెలాగో అతని అమ్మానాన్నలకు అతనూ అలాగే. అంటే ఒకేఒక్క కొడుకన్నమాట. ఆస్తిపాస్తుల విషయానికొస్తే అందులోనూ అగ్రగణ్యుడే. చెత్తరాయుడి పేరు మీరు వినేవుంటారు బహుశా. చిన్నతనంలో చెత్తకుండీల్లోంచి స్వయంగా చెత్త ఏరుకోవడంతో ప్రారంభించి, కాలం కలిసి రావడంతో అందులోనే పైకొచ్చి, ఇప్పుడు భారీ ఎత్తున స్క్రాప్ వ్యాపారం చేస్తున్నాడాయన. చిత్తుకాగితాలూ, పాత ఇనపసామాన్లూ, సీసాపెంకులూ, విరిగిపోయిన ప్లాస్టిక్‌సామాన్లూ ఇవీ అవి అనేంలేదు సకల చెత్తనీకొని హోల్‌సేల్‌గా అమ్ముతుంటాడు. చేసేది చెత్తవ్యాపారం గనక చెత్తరాయుడిగా పేరు వడిపోయాడన్నమాటే గానీ, లక్షలు... లక్షలు మూలుగుతున్నాయ్ ఆయన దగ్గర. అలాంటి వ్యక్తికి ఒక్కగానొక్క సంతానం ఈ దయాసాగర్ అనే కుర్రాడు. మీరు కోరుకున్నట్టుగానే అతనికి ఒక్క దుర్వ్యసనం కూడా లేదు. కనీసం వక్కపలుక్కూడా కొరకడు...''

లోకేశ్వరరావు చెప్పుకొచ్చిన విధానం తాయిలాన్ని చూపించి చిన్నపిల్లాణ్ని ఊరిస్తున్నట్టుగా అనిపించింది మాధవరావుకి.

''మరైతే ఇహనేవండీ? అన్నీ బాగానే వున్నాయికదా? కొంపదీసి కుర్రాడి ఆరోగ్యంగాని మంచిదికాదా? అవిటితనం గట్రా ఏవన్నా వున్నాయా?'' అంటూ సందేహాన్ని వ్యక్తం చేశాడు.

''శివ శివా'' అంటూ చెవులెండూ మూసుకున్నాడు లోకేశ్వరరావు. ''ఎంతమాట?! కుర్రాడు నవమన్మధుడండీ బాబూ. అనారోగ్యం అలాంటివాడి దగ్గరికి వెళ్ళడానిక్కూడా సాహసించదు. అంత చక్కగా, అంత దృఢంగా, అంత హాండ్సమ్‌గా వుంటాడు. హీ మాన్, అదేదో అంటారు చూడండీ... అలాగన్నమాట!''

''అలాగైతే మరి సందేహం దేనికండీ? మాట్లాడేయొచ్చుగా ఆ అబ్బాయిని మా అమ్మాయికి?''

లోకేశ్వరరావు సమాధానంకోసం లోపల్నుంచి జోగాంబ చెవులు రిక్కించింది. ఇంత మంచి సంబంధం గురించి చెప్తూ ఆయనెందుకలా నానుస్తున్నట్టు?

కొద్దిక్షణాల తర్వాత లోకేశ్వరరావు పొడిగా దగ్గి అన్నాడు- ''మీరు నాకు బాగా తెలిసినవారు. అదీగాక మీ అమ్మాయి ముచ్చటైన పిల్ల. కుందనపు బొమ్మ. చూస్తూ చూస్తూ ఆ సంబంధాన్ని సజెస్ట్ చేసి మీ అమ్మాయి గొంతుకోయడం నాకు సుతరామూ ఇష్టంలేదు''

ఆ మాటల్లో సిన్సియారిటీ లోపించిందేమోనని వెదికాడు మాధవరావు. లేదు... సిన్సియర్‌గానే చెబుతున్నట్టనిపించింది.

దాంతో ఏంమాట్లాడాలో తోచని కన్ఫ్యూజ

న్‌లో పడిపోయాడు.

అవతల జోగాంబ పరిస్థితి కూడా ఇంచు మించు ఇలాగే వుంది. ఇదేవిటీయన ఇలా అంటున్నాడు? అన్నీ బాగానే వున్నప్పుడు ఆ అబ్బాయికిచ్చి చేస్తే అమ్మాయి గొంతు కోయడం ఎలా అవుతుంది?

ఓ అరనిమిషం నిశ్శబ్దం తర్వాత మాధవ రావు గొంతు విప్పాడు. "మీ ఉద్దేశం నా కర్థం కావడంలేదు..."

మాధవరావే అడిగాడు మళ్ళీ ఆ వెంటనే. "కొంపదీసి జాతకరీత్యా ఆ అబ్బాయికి భార్యా వియోగంగాని వుందా?"

"అన్నన్నా..." అంటూ నాలుక కరుచుకు న్నాడు లోకేశ్వరరావు. "మరీ అంత డేంజరస్ కేసయితే అసలా టాపిక్కే లేపకపోదును కదా?"

"మరి?"

"ఆ కుర్రాడు మరీ మంచివాడు.. వ్యసనా లంటూ ఏవీ లేకపోయినా, నిజానికి మంచిత నమే అతని విషయంలో ఓ దుర్వ్యసనమని చెప్పాలి. అవధులులేని మంచితనంవల్ల సర్వే సర్వత్రా అతనో అప్రయోజకుడిగాపేరుపడిపో యాడు."

"అంతే?" అన్నట్టుగా చూశాడు మాధవ రావ్.

"మంచితనం దుర్వ్యసనమెలా అవు తుందబ్బా?" అనుకుంది లోపలున్న జోగాంబ.

లోకేశ్వరరావ్ చిరుదరహాసం చేస్తూ అన్నా డు, "అతన్ని గురించిపూర్తిగా చెప్పాలంటే ఎంత టైమైనా సరిపోదు. కాబట్టి మచ్చుక్కొన్ని ఉదాహరణలు చెబుతాను. దాన్నిబట్టి అతను మీకు తగిన అల్లుడా కాదా అన్నది మీరే నిర్ణయించుకోండి..."

ఇదేదో చాలా ఇంట్రస్టింగ్‌గా ఉన్నట్టుందే అనిపించింది మాధవరావుకి. సరే కానివ్వండి అన్నట్టు చూశాడు లోకేశ్వరరావుకేసి.

అవతలి గదిలోని జోగాంబక్కూడా అదేవిధ మైన కుతూహలం కలగడంతో అంతవరకూ నిలబడి వున్నదల్లా అక్కడే కూలబడి ఓ చెవినిటుకేసి పారేసిందామె.

లోకేశ్వరరరావు చెప్పడం ప్రారంభించాడు.

★ ★ ★

రైలు వేగంగా దూసుకుపోతోంది.

కిక్కిరిసివున్న ఓ కంపార్ట్‌మెంట్‌లో కిటికీ పక్కగా వున్న ఓ సింగిల్ సీట్లో కంఫర్టబుల్‌గా కూర్చుని... న్యూస్‌పేపర్ చదూకుంటున్నాడు దయాసాగర్.

అతని కాళ్ళ దగ్గర ఓ బ్రీఫ్‌కేస్. ఒళ్ళో ఓ జనరల్‌నాలెడ్జ్ పుస్తకం.

"సార్..."

రిక్వెస్టింగ్‌గా వినిపించిన పిలుపుకి పేప ర్లోంచి తలపైకి లేపాడు దయాసాగర్.

పక్కనే బీదముఖం వేస్కుని ఓ స్థూలకా యుడు. శరీరం గున్న ఏనుగుతో పోల్చదగ్గ దిగా వున్నా, వయసు మరీ ఎక్కువేంకాదు. బహుశా ముప్పైలోపే వుండొచ్చు.

దయాసాగర్ తనవైపు చూడగానే బీదమొ హాన్ని మరింత బీదగా పెట్టి... "కొంచెం అలా సర్దుకుంటారా?" అంటూ ఆశగా చూశాడా బోండాం.

అలాంటి సందర్భంలో దయాసాగర్ స్థా నంలో వేరే ఎవరున్నా రవంత ఇబ్బందిగానో, ఒకింత కరుగ్గానో చూడడం సహజం. ఎందు కంటే చోటడుగుతున్నది సామాన్యమైన శాల్తీ కాదాయె.

కానీ దయాసాగర్ మాత్రం అలా చూళ్ళేదు. పైపెచ్చు జాలిగా చూశాడు- 'పాపం... ఇంత భారీ శరీరాన్ని మోస్తూ ఎంతసేపని నిల్చోగల డు?' అని లోలోన అనుకుంటూ.

"థాంక్స్"

దయాసాగర్ పక్కకు జరిగి చోటివ్వడంతో ఫార్మల్‌గా కృతజ్ఞత వెల్లడించి ఆ చోటునాక్ర మించాడు ఆ స్థూలకాయుడు.

దాంతో అంతవరకూ కంఫర్టబుల్‌గా కూర్చు న్న దయాసాగర్ ఇరుక్కుంటూ కూర్చోవాల్సొ చ్చింది. అయినా ఆ ఇన్‌కన్వీనియన్స్ తా లూకు అప్రసన్నతేదీ అతని ముఖంలో తాండ వించలేదు. పైగా ఆదోరకం తృప్తి.

మొదట్నుంచీ అతని నైజం అంతే. ఎవరే దడిగినా కాదనలేక పోవడం... ఎదుటివ్యక్తికి ఏ సహాయం చేయాల్సివచ్చినా వెనకాముందూ ఆలోచించకుండా ఆ అవసరమేదో తనకే వచ్చిన ట్టుగా ఎంచి చేసేయడం అతనికలవాటు.

తనకుమాలిన ధర్మం మొదటికే మోసమన్న ఆర్యోక్తిలోని ఔచిత్యాన్ని అతనేనాడూ గుర్తించడు.

ఎవరైనా గుర్తు చేయబోయినా సరే- "దాన్దేముందీ? 'పరోపకార పుణ్యాయః, పాపాయః పరపీడనమ్' అనికూడా అన్నారు ఆర్యులు. చేయగలిగుండి కూడా ఎదుటి వ్యక్తికి సాయం చేయకపోతే ఇహ మనిషికీ మృగానికీ తేడా ఏముంటుందీ" అంటూ తన ధోరణిలో తాను వితండవాదానికి దిగుతాడే తప్ప, అవతల వ్యక్తి చెప్పేది వినిపించుకోడు.

అతనికీ బుద్ధి మధ్యలో వచ్చింది కాదు. చిన్నప్పట్నుంచీ అతనంతే.

"కాస్త ఆ పేపరిస్తారా? ఓసారి తిరగేసిచ్చేస్తాను..." దయాసాగర్ చదువుతూ వున్నాడని గమనించి కూడా అడిగాడు బోండాం.

పేపరు తనదేగా? తానైతే ఎప్పుడైనా చదువుకోవచ్చు. ఎదుటివ్యక్తి నోరు తెరిచి అడుగుతున్నాడు పాపం... పోన్లే ఇచ్చేద్దాం అనుకుని కిమ్మనకుండా తన చేతిలోని పేపర్ని అతగాడికందించాడు దయాసాగర్.

దాంతో దయాసాగర్ మెతకదనం బోండాంకి అర్థమైపోయింది.

దాన్నలుసుగా తీసుకుని ఓ అయిదునిమిషాల తర్వాత మరో బాణం వేసి చూశాడు.

"ఇఫ్ యూ డోంట్‌మైండ్ మీరు కాస్త ఇవతలికొస్తారా? నేను అలా కిటికీ పక్కన కూర్చుంటాను. మరేంలేదు... నాకు పాన్ నవిలే అలవాటుంది..."

దయాసాగర్ అలాగే అన్నట్టు బుద్ధిగా తలాడించి లేచి నిలబడి కిటికీ పక్క ప్లేస్‌ని అతనికొదిలి, అతను మిగిల్చిన కొద్దిపాటి చోటులో తాను సర్దుక్కూర్చున్నాడు.

ఇదంతా గమనిస్తోన్న ఓ పెద్దమనిషి 'వీడెవడో అమాయకపు ముండాకొడుకులా వున్నాడే' అనుకున్నాడు మనసులో.

నిజానికి అది వచ్చి నిజమే అయినా దయాసాగర్ దృష్టిలో మాత్రం తనది అమాయకత్వం కాదు.

'పాపం అతగాడికి పాన్ నవిలే అలవాటుంటే అతను మాత్రం ఏం చేస్తాడు? కిటికీ పక్కనైతే ఉమ్మి బైటికి వేయడానికి అనుకూలంగా వుంటుంది కాబట్టి అడిగాడు. ఎదుట వ్యక్తికి ఆపాటి సాయంచేస్తే తప్పేముందీ?' ఇదీ అతని ఆలోచనా విధానం. అది లోపభూయిష్టమైనదని అతను చచ్చినా ఒప్పుకోడు.

మరికాసేపు గడిచేసరికి బోండాం పేపరు మడిచి దయాసాగర్ కిచ్చేసి, కిటికీ కమ్ములకు తలవాల్చి కునికిపాట్లు పడడం ప్రారంభించాడు. అంతేకాదు నిద్దట్లో తనకు తెలియకుండానే ఇవతలికి జరిగినట్టుగా జరిగి- పాపం దయాసాగర్‌కి ఒంటిపిర్రమీద మాత్రమే కూర్చోగలగడానికిచోటు మిగిల్చాడు.

దయాసాగర్‌కి బాగా ఇబ్బందికరంగా అనిపించింది. గాని... బోండాంని సర్దుకుని కూర్చోమని చెబుదామా అంటే అతగాడు మంచి నిద్రలో వున్నాడాయె! నిద్రలో వున్నవాణ్ణి లేపడం పాపంకదా? అందుకుని... అతన్నే కంఫర్టబుల్‌గానిద్రపోనిద్దాం లెమ్మనుకునితానే లేచి నిలబడిపోయాడు.

అతనిలా లేవగానే బోండాం నిద్దట్లోనే పూర్తిగా సీటంతా ఆక్రమించుకుని హాయిగా కూర్చున్నాడు.

అతనిది ఉత్తుత్తి నిద్ర కాకపోతే అదెలా సాధ్యం?

ఈ ఆలోచన దయాసాగర్‌కి తట్టలేదు. ఎందుకంటే అతనెప్పుడూ అలా ఆలోచించడు. ఇదంతా చూస్తోన్న ఒకరిద్దరు ప్రయాణీకులకి 'అరబ్ అండ్ ది కేమెల్' కథ గుర్తొచ్చినా దయాసాగర్‌కి గుర్తు రాకపోవడానికి కారణం కూడా అదే!

అదే కంపార్ట్‌మెంట్‌లో లావెట్రీకి ఆనుకుని నిల్చున్న ఓ సాధువులాంటి బిచ్చగాడు ఆరిపోయిన బీడీని చెవి వెనక పెట్టుకుంటూ నిలబడివున్న దయాసాగర్‌కేసి విస్మయంగా చూశాడు.

అతనికి చదువురాదు కాబట్టి 'అరబ్ అండ్ ది కేమెల్' కథైతే గుర్తుకు రాలేదుగాని... 'ఈడెక్కడి ఎర్రోడ్రా బాబూ' అని మాత్రం అనిపించింది.

ఎందుకంటే మొదట్నుంచీ వాడూ గమనిస్తూనే వున్నాడు. దయాసాగర్ ఉత్తవాజమ్మలా తన సీటుని కోల్పోయిన వైనాన్ని.

వాడు నిలబడినచోట లావెట్రీలోంచి వస్తో

న్న దుర్గంధం భరింపరానిదిగా వుంది.

ఎలాగూ వెర్రోడిలా కనిపిస్తున్నాడు. కాబట్టి దయాసాగర్‌ని ఇటురమ్మని తానటుపోతేనో? అన్న ఆలోచన మెదిలింది వాడి మనసులో.

"బాబూ..." అంటూ దీనంగా పిల్చాడు దగ్గర్లోనే వున్న దయాసాగర్‌ని.

వాడు భిక్షం అడుగుతున్నాడు గావల్నను కుని దయాసాగర్ చొక్కా జేబులోంచి ఓ పావలా బిళ్ళని బైటికితీశాడు.

పిలిచింది భిక్షంకోసం కాకపోయినా ఇస్తున్న పుడెందుక్కాదనాల్లే అని ముందుగా ఆ పావ లానందుకుని... ఆ తర్వాత తన కోరికను వెల్లడించాడు బిచ్చగాడు.

"తలుపు లేకపోవడంవల్ల ఈడ సలిగాలీ స్తాంది బాబూ... ముసిలోణ్ని తట్టుకోలేకపోతు న్నాను... తవరు కాత్త ఈడికొత్తే నేనాడ నిలబడ తాను..."

'పాపం' అనుకున్నాడు దయాసాగర్.

ఫలితంగా అతను స్థానభ్రంశం చెందాడు.

దయసాగర్ స్థానంలోకొచ్చి నిలబడ్డ బిచ్చ గాడు దుర్గంధం బాధ తప్పినందుకు 'అమ్మ య్య' అనుకున్నాడు. నిజానికి వాడికో చెంపనె రిసిన మాట నిజమేగాని... చూడగానే 'పాపం మునలాళ్ళే' అని జాలి పడాల్సినంత వయసు మాత్రం లేదు.

అప్పుడు నమయం రాత్రి పదిన్నర.

పాపం దయాసాగర్ తెల్లవార్లూ... తన గమ్యం చేరేవరకూ అదేస్థానంలో నిలబడి టాయ్‌లెట్‌నుండి వస్తోన్న దుర్గంధాన్ని భరి స్తూ ప్రయాణం చేయాల్సివచ్చింది.

దటీజ్ దయాసాగర్!

★ ★ ★

గమ్యం చేరి ట్రెయిన్‌దిగి నిద్రలేమివల్ల ఎర్రబారిన కళ్ళతో ఇంటర్వ్యూ జరుగుతోన్న ఆఫీసుకు చేరుకున్న దయాసాగర్... అక్కడికొ చ్చిన అభ్యర్థుల్లో ఒకడిగా తిరిగి తారసిల్లిన 'బోండాం'ని చూసి ఆశ్చర్యపోయాడు.

"హలో..." అన్నాడు పలకరింపుగా నవ్వు తూ.

"హలో మీరా? వాటెనర్‌ప్రయిజ్?!! మీరూ ఇంటర్వ్యూకేనా?"

"ఆఁ..."

"రండి... ఇలా కూర్చోండి..." అంటూ బెంచీలో తన పక్కచోటు చూపించి..." రాత్రి నిద్రముంచుకొచ్చెయ్యడంవల్ల మనం మాట్లా డుకోలేకపోయాం. నా పేరు వీరాంజనేయులు. బియ్యే ఫస్ట్‌క్లాస్. ఊరు చేబ్రోలు. పోతే, ఇంట ర్వ్యూ కొచ్చాను కాబట్టి నిరుద్యోగినని వేరే చెప్పనవసరంలేదుకదా? ఊఁ ఇక మీ గురించి చెప్పండి..." అన్నాడు బోండాం.

దయాసాగర్ ఆ పక్కనే కూర్చున్నాడు.

"మిమ్మల్ని మళ్ళీ ఇలా కలునుకు న్నందుకు నాకు చాలా నంతోషంగా ఉంది. అయామ్ దయాసాగర్. ఎమ్మే గోల్డ్‌మెడ లిస్ట్‌ని, చేయాలీ అనుకుంటే మా నాన్నగారి బిజినెస్ ఎలాగూ వుందనుకోండి... కానీ ఇంత చదువూ చదివినందుకు జాబ్ చేస్తేనే బావుంటుంది కదానిపించి దీనికి అప్లయ్ చేశాను..." తననితాను పరిచయం చే స్కుంటూ చెప్పాడు దయాసాగర్.

దయాసాగర్ నోటివెంబడి 'ఎమ్మే గోల్డ్‌మెడ లిస్ట్‌ని' అనే మాట బైటికి రాగానే గుండెలో పెద్ద బండేదో పడ్డట్టుగా అనిపించింది వీరాంజనేయులు, ఉరఫ్ బోండాంకి.

ఎందుకంటే ప్రస్తుతం జరుగుతున్న ఇంట ర్వ్యూ ఏదో ప్రభుత్వోద్యోగానిక్కాదు. పేరెన్నికగ న్న ఓ ప్రైవేట్ నంస్థలో ఆఫీస్ ఎగ్జిక్యూటివ్ పోస్ట్‌కి. ఇక్కడ లంచాలూ, రికమండేషన్లూ పనిచేయవు. సెలక్షన్ కేవలం మెరిట్ మీదే ఆధారపడి వుంటుంది.

అందుచేత దయాసాగర్ ఇంటర్వ్యూలో సె లక్టై తీర్తాడనిపించింది వీరాంజనేయులికి.

ఎమ్మే గోల్డ్‌మెడలిస్ట్‌నంటున్నాడూ అంటే అపారమైన తెలివితేటలున్నట్టే గదా?

ఒకరకంగా అక్కడున్న మిగతా క్యాండిడే ట్స్ అంతా తనకు రైవల్సే అయినా... ఎందుకో దయాసాగర్ ఒక్కడే తనకు నియరెస్ట్ రైవలే మోననిపించింది వీరాంజనేయులికి.

అక్కడున్న అందర్నీ కాకపోయినా అప్పటికే చాలామందిని వారివారి క్వాలిఫికేషన్స్ గు రించి అడిగి తెలునుకుని వున్నాడు వీరాంజనే యులు. అతనెంక్వయిరీ చేసిన వాళ్ళందరూ

గ్రాడ్యుయేట్లే.

అలాంటిది దయాసాగర్ పోస్ట్‌గ్రాడ్యుయేట్- అందునా గోల్డ్‌మెడలిస్ట్ కావడం... జీర్ణించుకోలేని పదార్థాన్నేదో మింగుతున్నట్టుగా అనిపించింది వీరాంజనేయులికి.

'శనిలా దాపురించాడు...' అనుకున్నాడు కసిగా మనసులో.

అంతలో అతనికి దయాసాగర్ మెతకదనం గురించి గుర్తొచ్చింది.

ప్రయత్నించి చూస్తే రాత్రి సీటుని త్యాగం చేసినట్టే ఇపుడీ ఉద్యోగాన్ని కూడా త్యాగం చేయకపోతాడా అనిపించిందో క్షణం.

కానీ అంతలోనే మరీ అంత పిచ్చిసన్నాసయ్యుండళ్ళే అని కూడా అనిపించింది.

ఓ పది పన్నెండు క్షణాలు ఊగిసలాట తర్వాత... ప్రయత్నించి చూడ్డానికే నిశ్చయించుకున్నాడు వీరాంజనేయులు. దాంతో అతనా వెంటనే దయాసాగర్‌ని అక్కడున్న గుంపుకి ఎడంగా నడిపించుకెళ్ళి... నెమ్మదిగా వదిలాడో బాణం...

"కంగ్రాచ్యులేషన్స్!"

"దేనికీ?" అయోమయంగా చూశాడు దయాసాగర్.

"ఈ జాబ్ మీకు రావడం గ్యారంటీ. ఎందుకంటే ఇక్కడున్న అందరికన్నా మీ క్వాలిఫికేషనే ఎక్కువ. అందుకని ముందుగానే అభినందిస్తున్నాను..."

"భలే వారే, ఇంటర్వ్యూలో నా పెర్ఫామెన్స్ బావుండాలి కదా?"

"అదేం లేదండీ! ఈ ఇంటర్వ్యూ కేవలం నామినలే. అకడెమిక్ క్వాలిఫికేషన్‌కే ఎక్కువ ప్రిఫరెన్స్ ఇస్తారని తెలిసింది. సో యు ఆర్ ష్యూర్ టు విన్ దిస్ రేస్. అందుకే నేనిక వెళ్ళిపోవాలనుకుంటున్నాను..."

"అరె... అదేవిటీ?" నొచ్చుకోలుగా అన్నాడు దయాసాగర్.

"ఎలాగూ ఈ ఉద్యోగం రాదని తెలిసి ఇంకా దేనికండీ ఓ గంటో రెండుగంటలో వేస్ట్ చేయడం? ఈసారి ఇంటికెళ్ళి ఎలాగూ ఇంక మా పేరెంట్స్‌కి నా మొహం చూపించలేను. అష్టకష్టాలూ పడి, కడుపు గట్టుకు మరీ నన్ను చదివించారు వాళ్ళు. నేనేదో ఉద్ధరిస్తానని నామీద ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. కానీ ఎన్ని ప్రయత్నాలు చేస్తున్నా నాకేమీ జాబ్ రావటంలేదు. మీరు రానంతవరకూ ఇక్కడున్న వాళ్ళలో ఫస్ట్‌క్లాస్ గ్రాడ్యుయేట్‌ని నేనొక్కడ్నే కాబట్టి ఈ జాబ్ నాకు రావడం గ్యారంటీ అనుకున్నాను. బట్ మీరొచ్చేశారుగా..." అంటూ నిట్టూర్చి- "ఇలాగంటున్నానని నేనేదో మీ మీద ఈర్ష్య పడుతున్నానని అనుకోబాకండి. ఎవరి అదృష్టం వారిది. ఎట్టొచ్చీ నా రాతే బాగోలేదు" అని ముగించి రాని కన్నీటిని కర్చీఫ్‌తో అద్దుకున్నాడు వీరాంజనేయులు.

"మీకు జాబ్ అంత అవసరమా?" దయాసాగర్ ప్రశ్నే చెబుతోంది అతనెంత అమాయకుడో.

దాన్తో మరికాస్త రెచ్చిపోయాడు వీరాంజనేయులు.

అందులోనూ అతనికి నాటకానుభవం జాస్తి.

"అవసరమా అని నెమ్మదిగా అంటున్నారా? టు టెల్ యూ ది ట్రూత్... ఈ జాబ్ నాకు రాకపోతే గనక నేను సూసైడ్ చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. అడ్డగాడిదలా ఇలా ఎదిగాక్కూడా ఇంకా తల్లిదండ్రుల రెక్కల కష్టం తింటూ ఇంకా ఎన్నాళ్ళీ పాడు బ్రతుకు?" అంటూ విరక్తిగా నవ్వి శూన్యంలోకి చూశాడు.

'వ్వాట్?!' అదిరిపడ్డాడు దయాసాగర్.

మరి కాసేపట్లో ఆత్మహత్య చేస్కోబోతూ కూడా ఈ మనిషి ఎంత నిబ్బరంగా మాట్లాడ్తున్నాడు?

"అయితే మీరిపుడు వెళ్తానన్నది మీ ఇంటిక్కాదా?"

"కాదు... ఏ రైలు పట్టాల మీదో తలపెట్టడానికి" ముఖంలోకి చావుకళని తెచ్చిపెట్టుకుంటూ స్థిరంగా పలికాడు వీరాంజనేయులు.

అయ్యో పాపం అనిపించింది దయాసాగర్‌కి.

వీరాంజనేయులు చెప్పినదాన్లో 'అడ్డగాడిదలా ఇలా ఎదగడం' అనేది తప్ప, మిగతాదంతా అబద్ధమేనని అతనూహించలేకపోయాడు.

అందరూ తనలాగే వుంటారని భావించే రకం అతను. అతని ఊహలెప్పుడూ స్ట్రెయిట్ గానే సాగుతాయి గనక, దేన్ని గురించీ వక్రంగా ఆలోచించలేడు.

అతనొక్కడికే కాదు; అతిమంచితనం గల వాళ్ళంతా ఇంచుమించు అంతే.

ఎదుటి వ్యక్తిని మరీ గుడ్డిగా నమ్మేయడం వాళ్ళకే సాధ్యమౌతుంది.

అందుకే సాధారణంగా మంచివాళ్ళే ఎక్కువగా మోసగింపబడుతూంటారు. మోసగింపబడే ప్రతివాడూ అమాయకుడే అనుకుంటే- అమాయకత్వానికీ, మంచితనానికీ అవినాభావ సంబంధం ఉన్నట్టే లెక్క.

"నేనీ ఇంటర్వ్యూ నుండి గనక తప్పుకుంటే ఈ జాబ్ మీకే వస్తుందన్న నమ్మకం మీకుందా?"

దయాసాగర్ అలా అడిగేసరికి వీరాంజనేయులు కళ్ళు మెరిశాయి.

'పడింది పిట్ట' అనుకున్నాడు మనసులో.

"నైన్‌టీనైన్ పర్సెంట్ నాకే రావడానికి అవకాశం వుంది..."

"అలాగైతే నేనిప్పుడే ఈ ఇంటర్వ్యూ నుండి వెళ్ళిపోతాను. బట్ మీరు నాకో ప్రామిస్ చేయాలి..."

'ఎంత వెర్రి వెంగలప్పవిరా' అని మనసులో అనుకుని... "నా కోసం మీరింత త్యాగం చేయడం..." అంటూ మాట పూర్తిచేయలేని వాడిలా ఆగిపోయాడు వీరాంజనేయులు.

"నాకు జాబ్ లేకపోయినా ఫర్వాలేదు. కానీ మీ పొజిషన్ అదికాదుగా? యు ఆర్ ఇన్ ఎ హార్డ్ నీడ్. కాబట్టి దీన్ని నేను త్యాగంగా భావించడం లేదు. జస్ట్ చిన్న సహాయం అనుకోండి, అంతే. అయితే ఒక్క మాట. ఒకవేళ ఇంకే కారణం చేతైనా ఈ జాబ్ మీకు రాకపోయినా సరే మీరు మాత్రం కృంగిపోకూడదు. ఆత్మహత్య అనే ఆలోచన్ని తిరిగి మీ మనసులోకి రానివ్వకూడదు. అలాగని నాకు ప్రామిస్ చేయండి. నేను ఈక్షణమే ఇక్కడి నుంచి వెళ్ళిపోతాను..."

దయాసాగర్ తన కుడిచేతిని ముందుకు చాపగా బిడియాన్ని నటిస్తూ ఆ చేతిలో తన చేయి వేశాడు వీరాంజనేయులు.

"విష్ యూ గుడ్‌లక్" అంటూ ఆ చేతిని ఓ ఊపు ఊపి... ఆ తర్వాత నిజంగానే తానిచ్చిన మాటను నిలబెట్టుకుంటూ ఇంటర్వ్యూకి అటెండ్ కాకుండానే అక్కడి నుంచి వెళ్ళిపోయాడు దయాసాగర్.

అతను వెళ్ళిన దిక్కు చిద్విలాసంగా చూస్తూ వీరాంజనేయులు తన మనసులో అనుకున్నాడు...

'ఉత్త పిచ్చి సన్నాసి!'



"ఛీ! నీకీ జన్మలో బుద్ధి రాదురా! నువ్వీ జీవితంలో బాగుపడవ్. ఇంత అప్రయోజకుడివి ఈ సమాజంలో ఎలా బ్రతుకుతావురా?" అంటూ కొడుక్కేసి కోపంగా చూశాడు రాయుడు.

"నేను చేసిందాన్లో తప్పేముందీ? అవతల ఆ వ్యక్తికి ఆ ఉద్యోగం చాలా అవసరం కాబట్టి మానవతా దృక్పథంతో చిన్న సాయం చేశానంతే?" తన్నుతాను సమర్థించుకుంటూ అన్నాడు దయాసాగర్.

"మానవత్వమా గోంగూరా? నువ్ చేసినదాన్ని సాయం అంటారట్రా? వెర్రి బాగులతనం అంటారు. ఎవడికో అవసరం అని బంగారంలాంటి అవకాశాన్ని కాలదన్నుకుంటారా ఎవరైనా?" - నా కడుపున చెడ బుట్టేవు కదురా అని పైకైతే అనలేదుగాని రాయుడు దయాసాగర్‌కేసి చూసిన చూపు మాత్రం అలాగే వుంది.

'ఎరక్కపోయి నిజం చెప్పేను' అనుకుంటూ తలదించుకున్నాడు దయాసాగర్. తన జస్టిఫికేషన్ ప్రకారం తను చేసింది తప్పు

కాదన్న నమ్మకం అతనిలో వున్నా తండ్రితో అనవసరంగా ఘర్షణ దేనికిలే అని మిన్న కుండిపోయాడు.

కన్నకొడుకు ఓవర్ మంచితనం అనే పైత్యాన్ని తలకెక్కించుకుని చూస్తూండగానే చెడిపోతుంటే ఏ తండ్రి మాత్రం సహించగలడు?

అందుకే ఆ విషయాన్ని అంతటితో వదిలేయకుండా "నువ్ మారవురా ఇంక... నువ్ బాగుపడవురా ఇంక" అంటూ మొదలెట్టి తిట్ల దండకం ప్రారంభించాడు రాయుడు.

వాకిట్లో చెత్త బస్తాలు అరుగుమీదికి చేరుస్తూ ఓ చెవితో ఇదంతా ఆలకిస్తోన్న ఆ ఇంటి నౌకరు సాంబడు 'ఏంటో ఈ చినబాబుదంతా పిచ్చి... అన్నీ ఇలాంటి పన్లే చేస్తాడు' అనుకున్నాడు జాలిగా.

చినబాబుకి సపోర్టింగ్‌గా ఓ ముక్క మాట్లాడి పెద్దయ్యగారి తిట్లప్రవాహానికి ఆనకట్ట వేద్దామా అనిపించిందిగాని... పెద్దయ్యగారి కోపం తన మీదకు మళ్ళుతుందేమో నన్న భయంకొద్దీ ఆ పని చేయలేకపోయాడు.

ఓ నౌకరుగా అతను చేయలేకపోయిన సాహసాన్ని దయాసాగర్‌నికన్న తల్లిగా అఖిలాండేశ్వరి చేసింది. "ఏంటండీ ఇందాకట్నుంచి చూస్తున్నాను... ఎందుకు వాడ్నలా నతాయిస్తారు? పోతే పోయింది వెధవ ఉద్యోగం అయినా ఉద్యోగం చేయాల్సిన ఖర్మ వాడికేం పట్టిందండీ?" అంది వంటింట్లోంచి విసురుగా హాల్లోకొస్తూ-

రాయుడు గుర్రుగా చూశాడు భార్యకేసి.

"ఆవు నీ వత్తాను. అసలు నీ వల్లే వీడిలా తయారయ్యాడు. చిన్నప్పుడు వాడెవడిదో చొక్కా చిరిగిపోయిందని అడిగితే వీడి కొత్త చొక్కా వాడికిచ్చేసి ఉత్తొంటితో బడినుంచి తిరిగొచ్చినవుడే చావబాదుంటే ఈనాడిలా తయారయ్యే వాడా? నీ బంగారు కొండది మంచి మనసు, జాలిగుండె అని దీర్ఘాలు తీస్తూ వాణ్ణి చంకనేసుకున్నావు. వీణ్ణి మధ్యాన్నం చిరుతిండి కొనుక్కోమనిచ్చిన డబ్బులు రోజూ వాడికి వీడికి దానం చేసొస్తున్నప్పుడైనా మందలించావా? నిన్ననాలనలు..."

భర్త కోపం తన మీదకి డైవర్టైనప్పటికీ జంకలేదు అఖిలాండేశ్వరి.

భర్తకి పెద్దగా అణిగిమణిగి వుండే రకమేం కాదామె. ముఖ్యంగా కొడుకు విషయంలో భర్తతో ఎంతటి ఘర్షణకైనా వెనుదీయదు. కొడుకుమీద ఈగ వాలితే తన గుండెలమీద ఏనుగెక్కినట్టు బాధ పడిపోతుంది.

అవును మరి... ఒక్కగా నొక్క నలుసాయె!

"వాడికిపుడేం తక్కువైందని వాడేదో చెడిపోయినట్టుగా మాట్లాడ్తారు? ఉద్యోగం చేసి ఒకరి మోచేతికింద నీళ్ళు తాగాల్సిన అవసరం వాడికేంటీ?" అంది పైటచెంగును నడుంచుట్టూ ఓ తిప్పు తిప్పి బొడ్లో దోపుకుంటూ.

దయాసాగర్ నిబ్బరంగా చూశాడు తండ్రికేసి.

అమ్మరంగంలోకి దిగింది కాబట్టి ఇహ తనకేం ఫర్వాలేదన్న ధీమా.

"అదే నేనూ చెప్తుంటే నీ సుపుత్రుడికి తలకెక్కితేగా? నాతోపాటు చెత్త వ్యాపారం చేస్తే ఈ దొరగార్ని కూడా చెత్త దయాసాగర్ అంటారంట. అది వీరికి నామోషీ అంట. అందుకని చేయడంట. హుఁ... అన్నీ చేతకాని కబుర్లే. అసలా మొహానికి వ్యాపార దక్షత వుండేడిస్తేగా?" తల్లీకొడుకులకేసి తిరస్కారంగా చూస్తూ కోపంగా అన్నాడు రాయుడు.

"అవునండీ చేయడు. అయితే ఏంటంటారు? వాడన్నది మాత్రం నిజం కాదా ఏంటి? మింగలేకా కక్కలేకా బాధపడుతున్నానే గాని... అందరూ చెత్తరాయుడిగారి పెళ్ళాం అంటుంటే నా మట్టుకు నాకే ప్రాణం చితికిపోతోంది. అలాంటిది ఎమ్మే చదివినవాడు- వాడికుండదా ఆ పాటి?"

భార్యని మింగేసేలా చూశాడు రాయుడు.

అతనికి దైవభక్తి ఒకింత జాస్తి. అలాంటిది... తన ఎదురుగా ఎవరైనా దైవదూషణ చేసినా సహించగలుగుతాడు గాని... తన వ్యాపారాన్ని కించపరిస్తే మాత్రం సహించలేడాయన. 'చెత్త' సాక్షాత్తూ శ్రీమహాలక్ష్మి స్వరూపమని ఆయన ప్రగాఢ విశ్వాసం. అచ్చొచ్చిన వ్యాపారం గదా మరి!

సహజంగానే భార్య మాటలకి రెచ్చిపోయాడు రాయుడు. "ఎట్టెట్టా? నీకు... చెత్త రాయు

డి పెళ్ళాం అనిపించుకోవడం నామోషీగా వుంటోందా? నువ్ పెట్టుకున్న నగలూ, కట్టుకు న్న పట్టు చీరా, వుంటున్న ఈ బంగళా ఇవన్నీ ఎక్కణ్ణించొచ్చాయే? ఆ చెత్తమ్మడం వల్లే. నీ సుపుత్రుడు ఎమ్మే చదివింది ఏ డబ్బుతో అనుకుంటున్నావే? ఆచెత్తమ్మగా వచ్చిన డబ్బు తోనే... అయినా తెలుగులో అయితే నేను చేసేది చెత్త వ్యాపారమని చెత్తగా అంటారు గాని, ఇంగ్లీష్‌లో నేను హోల్‌సేల్ స్క్రాప్ మర్చంట్‌నే... ఆఁ... ఈ డిస్ట్రిక్ట్ మొత్తానికి నన్ను మించిన స్క్రాప్ మర్చంట్ లేడని పేరు తెచ్చుకున్నాను. అలాంటిది నా వ్యాపారాన్ని ఇన్సల్ట్ చేసి మాట్లాడ్తావా?''

"ఓయబ్బో మీరు చెత్తమ్మకపోతే గడవదా ఏంటి? మా పుట్టింటోళ్ళిచ్చిన అయిదెకరాల మావిడితోట మీదొస్తున్న ఆదాయం లేదా ఏంటి?'' చేతులు తిప్పుతూ దీర్ఘాలు తీసింది అఖిలాండేశ్వరి.

రాయుడి ప్రతిస్పందన కూడా 'ఓయబ్బో'తోనే స్టార్టయ్యింది. "ఓయబ్బో వచ్చి ఒళ్ళో పడిపోతున్నాయ్ లక్షలు లక్షలు. నగానికి నగం దిగమింగి మీ అన్నయ్య ఏడాదికో పదివేలు చేత బెడుతున్నాడు. దాంతోనే గడిచిపోతోందా సంసారమంతా? అయినా అందులో నగం నువ్ నొక్కేసి నీ బ్యాంకెకవుంట్లో కుక్కేస్తూనే వున్నావుగా?''

"అదేంటలా మాట్లాడ్తారు? నేనేవన్నా నా స్వార్థంకొద్దీ దాచుకుంటున్నానా? మన కుటుంబానికే ఏదయినా అవసరానికి పనికొస్తాయి కదాని వెనకేస్తున్నాను. అదీ తప్పేనా?'' విసురుగానే అన్నా తెలివిగా విషయాన్ని దారి మళ్ళించబోయింది అఖిలాండేశ్వరి.

కానీ రాయుడు మళ్ళా మొదటికే లాక్కొచ్చాడు. "అది నరే. ముందు నీ సుపుత్రుడి విషయం తేల్చు...''

"తేల్చడానికే వుందీ? వాడికి నచ్చిన మరేదైనా వ్యాపారం చేస్కుంటాడంతే!''

"నాతో జాయినయ్యాడా నరే... అంతే తప్ప వేరే వ్యాపారం మాటెత్తితే నేను పైసా కూడా విదల్చను... పెట్టుబడి లేకుండా ఏం వ్యాపారం వెలిగిస్తాడు?''

"నరే... మీరంతదాకా వస్తే మా పుట్టింటోళ్ళిచ్చిన అయిదెకరాల మామిడితోట ఎలాగూ ఉండనే వుంది. దాన్ని తెగనమ్మేసైనా వాడికి పెట్టుబడి నేనిస్తాను. ఆఁ...'' అంటూ తీవి ఒలకబోసింది అఖిలాండేశ్వరి.

ఆవిడ నోటివెంబడి మావిడతోట ప్రస్థావన ఎప్పుడొచ్చినా 'మా పుట్టింటోళ్ళిచ్చిన అయిదెకరాల మావిడితోట' అనే వస్తుంది తప్ప మరోవిధంగా రాదు.

అవసరమైతే దాన్ని తెగనమ్మేసి కొడుకు చేతిలో పోస్తాననడం కూడా ఆమె తరుచుగా అంటూండే మాటే.

దయాసాగర్ స్కూటర్ కావాలని అడిగినపుడొకసారి... బియ్యేతో చదువు ముగించేయమంటే, కాదు నేనింకా పైకి చదువుతానని పట్టుబట్టినపుడొకసారి... దయాసాగరే ఫ్రెండ్స్‌తో కల్సి సర్దాగా నార్తిండియా టూర్ వెళ్తానని అడిగితే, ఎందుకురా వృధాగా అంత డబ్బు వేస్ట్ చేయడం అని రాయుడు వారించినపుడొకసారి...

ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే.

ఇలా చెప్పుకుంటూ పోతే ఇంకా చాలా వున్నాయి. ఆమె తన పుట్టింటోళ్ళిచ్చిన అయిదెకరాల మావిడితోటని అమ్మేసైనా నరే కొడుకు ముచ్చట తీరుస్తానన్న సందర్భాలు.

అందుకే రాయుడికి చిర్రెత్తుకొచ్చిందీసారి.

"ఆ పనేదో నిజంగానే చేసి పుణ్యం గట్టుకోవే. ఊఁ అంటే మా పుట్టింటోళ్ళిచ్చిన అయిదెకరాల మావిడితోట... ఆఁ అంటే మా పుట్టింటోళ్ళిచ్చిన అయిదెకరాల మావిడితోట! అంటూ మొదలెడ్తావు. మన పెళ్ళయినప్పట్నుంచి వినలేక చస్తున్నానీ పాట! నిజంగానే అమ్మిపారెయ్... దరిద్రం ఒదిలిపోతుంది...'' అన్నాడు కోపంగా. అంతే...

"రాఁ... మా పుట్టింటోళ్ళిచ్చిన అయిదెకరాల మావిడితోటని దరిద్రం అంటారా?'' అంటూ ఒంటికాలిమీద లేచింది అఖిలాండేశ్వరి. "మీ చెత్త వ్యాపారాన్ని దరిద్రం అంటే మీరొప్పుకుంటారా? ఊరుకుంటారా? అలాంటప్పుడు మా పుట్టింటోళ్ళిచ్చిన అయిదెకరాల మావిడితోటని దరిద్రం అంటే నేను మాత్రం ఎందుకొప్పుకుంటాను? ఎందుకూరుకుంటాను?'' అంటూ లాజిక్కులోకి దిగింది.

అసలే చిర్రుమీదున్నాడేమో, ''ఊరుకోక పోతే ఏం చేస్తావే? ఉరేసుకుంటావా?'' అన్నాడు రాయుడు అసహనంగా.

దాంతో-

ఆ భార్యా భర్తల మధ్య మాటామాటా పెరిగి, అది చిన్నసైజు జగడానికి దారితీసింది.

సదరు జగడం కంటిన్యూ అవుతూండగానే ''పోస్ట్'' అంటూ వచ్చాడు పోస్ట్‌మాన్.

వచ్చి...

దయాసాగర్ చేతికందించాడో కార్డు.

పోస్ట్‌మేన్ ఇలా వెనుదిరగ్గానే దయాసాగర్ ఆ కార్డులోని విషయాన్ని చదివి దాన్ని ఫర్రుమని చించేశాడు.

''ఏంట్రా అది?'' అడిగాడు రాయుడు, భార్యతో జగడానికి కామాపెట్టి.

''ఇంకో ఉద్యోగానికి ఇంటర్వ్యూకి పిలుపు'' సిన్సియర్‌గా చెప్పాడు దయాసాగర్.

''మరైతే చింపేశావేం? ఏం... పోయేకాలవొచ్చింది?'' గుడ్లురిమి చూశాడు రాయుడు.

'ఉరుముకో ఉరుముకో నీ ఇష్టం. నాకేం భయం? పక్కన అమ్మొందిగా?!' అనుకున్న దయాసాగర్, నిబ్బరంగా నిలబడి స్థిరంగా పలికాడు.



"నేనింక ఉద్యోగాల జోలికి వెళ్ళదల్చుకోలేదు. నిన్నటి అనుభవంతో నాకు బాగా తెలిసొచ్చింది. ఈ దేశంలో ఎంతోమంది నిరుద్యోగులు ఉద్యోగంకోసం అలమటించిపోతూ వున్నారు. ఉద్యోగం దొరక్కపోతే ఆత్మహత్య తప్ప వేరే మార్గం లేనంత దుర్భరమైన పరిస్థితిలో కూడా వున్నారు కొంతమంది. అలాంటప్పుడు వ్యాపారం చేసుకోగలిగిన స్తోమతుండి కూడా నాలాంటి వాళ్ళు ఉద్యోగాలకి ఎగబడ్డం నిజంగా అవసరంలో వున్నవాళ్ళకి అన్యాయమూ ద్రోహమూ చేసినట్టే అవుతుంది. అందుకే నేనీ డెసిషన్ తీసుకున్నాను. అమ్మ చెప్పినట్టు, నీ వ్యాపారంలో పాలువంచుకోకుండా వేరే వ్యాపారం ఏదైనా సొంతంగా చేస్కుంటాను, దట్సాల్"

రాయుడు కొడుక్కేసి తీక్షణంగా ఒక్కచూపు చూసి రయ్‌రయ్‌న అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

నిజానికి వెళ్ళాల్సినవాడు కాదు. కానీ తన బీపీ పెరిగిపోతున్నట్టు మెదళ్ళో ఏదో ఇండికేషన్‌లాంటిది కలిగి... అలాంటప్పుడు తానింకా అక్కడే వుండి, ఆ తల్లీ తనయులతో వాదన పెంచుకుంటే తనకి గుండెదడా, ఆయాసమూ వచ్చే ప్రమాదముంది గనక...

ఆ ప్రమాదాన్ని తప్పించుకోడానికి, ఒకపక్క కోపం ఉబుక్కొస్తున్నాసరే అతిబలవంతాన్ని కంట్రోల్ చేసుకుని వెళ్ళిపోయాడు.

★ ★ ★

ఆ మర్నాడు...

దయాసాగర్ వాళ్ళ తోటలో అటూ ఇటూ తిరుగుతూ తానేం వ్యాపారం ప్రారంభించాలా అని సీరియస్‌గా ఆలోచిస్తుండగా-

"ఏంటి చినబాబుగారూ ఆలోచిస్తున్నారు?" అంటూ వచ్చాడు సాంబడు.

సాంబడు మరీ మొరటు మనిషేంకాడు. చిన్నప్పుడు ఏడోతరగతివరకూ చదువు వెలిగించి కూడా వున్నాడేమో, వాడి మాటతీరూ అదీ ఒకింత కుదురుగానే వుంటుంది.

"అబ్బే ఏంలేదు..." అనేశాడు దయాసాగర్ పొడిగా.

"ఏమీ లేకపోవడమేంటి చినబాబూ! ఇందాకట్నుంచీ చూస్తున్నాను. దేన్ని గురించో నంజుడు గుంజుడవుతూ ఒకటేపనిగా తిరుగుతున్నారు. నిన్న పెద్దయ్యగారు కేక వేశారనా?" వదిలిపెట్టకుండా రెట్టించి అడిగాడు సాంబడు.

"పెద్దయ్యగారికది మామూలేగా. దాన్ని గురించి కాదు..."

"మరి?" అన్నట్టు చూశాడు సాంబడు.

"ఏదైనా వ్యాపారం చేయాలని అనిపిస్తోందిరా! ఏ వ్యాపారం బావుంటుందా అని ఆలోచిస్తున్నాను..."

"బట్టలషాపు పెట్టండి చినబాబుగారూ!" తనగ్గాక అంత గొప్ప ఐడియా తట్టిందన్నట్టు ముఖంపెట్టా అన్నాడు సాంబడు. "మనిషికి కూడూ గూడూ తర్వాత ముఖ్యంగా కావాల్సింది గుడ్డేకదా! అందువల్ల బేరాలూ బాగుంటాయి. లాభాలు బాగుంటాయి. కాబట్టి నా మాటినండి. ఇంకేం ఆలోచించబోకండి. మీరు ఊఁ అంటే నేను మీకు సాయంచేస్తూ మీ దగ్గిరే వుండిపోతాను. ఆ చెత్తమూటలు లారీలకెత్తీ ఎత్తీ నా భుజాలు కదుములు పట్టేశాయి చినబాబూ! నాక్కూడా ఈ వనంటే రోత పుడుతోంది..."

పెద్దయ్యగారు బయటికెళ్ళారుకదా అన్న ధీమాతో చేస్తున్న పనిని మధ్యలో ఆపేసి చినబాబుతో హస్కేసుకున్నాడు సాంబడు.

రాయుడుగారు మధ్యలో ఎందుకో మనసు మార్చుకుని తిరిగొచ్చేశాడనీ, ఇప్పుడు సరిగ్గా తన వెనకే వున్నాడనీ వాడికేం తెలుసు?

"ఏం కూశావురా? చెత్తబస్తాలు ఎత్తడం నీకు రోతగా వుందా?" రాయుడి కంఠం కంచులా ఖంగున మోగింది. దాంతోపాటే సాంబడి వీపుమీద ఓ చరుపు పడింది.

అంతే! పైప్రాణాలు పైనేపోయాయి సాంబడికి.

"లేదయ్యగారూ... ఊర్కే... ఊర్కే అన్నాను..." తడబడిపోతూ ఏడుపుముఖం పెట్టాడు ఏవనాలో తోచక.

"నోర్మూయ్ రాస్కెల్. పోన్లేకదాని నీకు పనిచ్చి రెండుపూటలా ఇంత తిండి పెడుతుంటే అచ్చొచ్చిన నా చెత్తవ్యాపారాన్నే ఎగతాళి చేస్తావా? నేను గనక నిన్ను పన్లోంచి తీసేస్తే

నువ్వు చెత్తబస్తాలు ఎత్తడానిక్కాదుగదా, అయ్యా బాబూ అని అడుక్కోడానికి క్కూడా పనికిరావురా! ఆఁ...'' ఆగ్రహంతో ఊగిపోతూ అరిచాడు రాయుడు. ''ఫో... పో ఇక్కణ్ణించి. వెళ్ళి నీ పని చూసుకో....''

పెద్దయ్యగారు తనని అంతటితో వదిలేసినందుకు బ్రతుకుజీవుడా అనుకుంటూ అక్కణ్నించి పరుగులాంటి నడకతో వెళ్ళిపోయాడు సాంబడు.

''ఆఁ ఏంట్రా ఆ వెధవ నీకు బోధిస్తున్నాడూ?'' సాంబడు వెళ్ళిపోగానే దయాసాగర్ వైపు ఎర్రగా చూస్తూ అడిగాడు రాయుడు.

దయాసాగర్ తల దించుకోబోయాడుగాని... అంతలోనే మనసు మార్చేసుకుని ఠీవిగా నిలబడ్డాడు.

అందుక్కారణం అల్లంత దూరాన్నుంచే అఖిలాండేశ్వరి ఇటుకేసే వస్తూ కనిపించడం.

ఆమె ఈ సమయంలో ఇటుకేసి రావడానిక్కారణం- సాంబడు వెళ్ళి ఊదేశాడామె చెవిలో... ''పెద్దయ్యగారు చినబాబుని తోటలో ఒంటరిగా లంకించుకున్నారమ్మా... మీరర్జంటుగా వెళ్ళకపోతే ప్రమాదం'' అని.

ఆమాటా ఈమాటా చెప్పి బక్షీస్ రూపంలో అప్పుడప్పుడూ చినబాబు దగ్గరకొట్టే చిలక్కొట్టుడంతా లెక్కగడితే అది ఇంచుమించు రాయుడిచ్చే జీతంకన్నా ఎక్కువే. అందుకే సాంబడికి చినబాబంటే ప్రత్యేకాభిమానం.

''వాడు నాకేమీ బోధించడంలేదు. ఏం వ్యాపారం చేయాలో బోధపడక నేను చస్తుంటే బట్టలషాపైతే బాగుంటుందని చెబుతున్నాడంతే'' ఎలాగూ అమ్మొచ్చి చక్రం అడ్డేస్తుంది కదా అన్న ధైర్యం వుండడంతో తండ్రి ప్రశ్నకి ధీమాగా బదులిచ్చాడు దయాసాగర్.

''వాడెవడ్రా నువ్వే వ్యాపారం చేయాలో చెప్పడానికి. తండ్రిగా నేనాజ్ఞాపిస్తున్నాను. వెర్రిమొర్రి ఆలోచనలు కట్టిపెట్టి రేపట్నుంచి నాతో కూడా మన షాపుకి రా. లేదా మన లారివెంట వెళ్ళు. అంతే ఆఁ...''

''నీతో షాపుకి రావడమా? నో... నెవ్వర్''

అప్పటికే అఖిలాండేశ్వరి అక్కడికొచ్చేసుంది. అందువల్ల బింకంగా తలెగరేస్తూ పెంకిగా చెప్పాడు దయాసాగర్.

రాయుడు ఇటు తిరిగున్నందువల్ల అట్నుంచొచ్చిన భార్యని ఇంకా చూళ్ళేదు. ''ఏంట్రా అంత తలబిరుసుగా మాట్లాడ్తున్నావ్? ఏం మీ అమ్మ అండ చూసుకుని రెచ్చిపోతున్నావా?'' అన్నాడు కోపంగా.

''పిల్లాణ్ణి పద్దాక చండుకుతినడం తప్ప ఈయనగారికి వేరే పనేంలేదు'' లోలోన పళ్ళునూర్తూ- ఎదురుగా వున్నది భర్తవీపే కాబట్టి ఆ వీపుకేసే తీక్షణంగా చూసింది అఖిలాండేశ్వరి.

కానీ తానొచ్చేసినట్టు అలికిడి మాత్రం చేయలేదు. కాగా, తనయుడికి మాత్రం కళ్ళతోనే సైగ చేసింది- 'నీకేం ఫర్వాలేదు నువ్వు కానియ్... నేనున్నాగా?'' అన్నట్టు.

ఆమాత్రం చాలదా, దయాసాగర్ ఐరన్‌రాడ్ అయిపోవడానికి? ''అమ్మ అండ చూసుకునేంకాదు. నాకా చెత్త వ్యాపారమంటే చచ్చేంత అసహ్యం. సాంబడి సలహా నాకు బాగా నచ్చింది. నేను బట్టలకొట్టు పెట్టేది పెట్టేదే. ఆ...'' అన్నాడు స్థిరంగా. చివర్లో వాడిన 'ఆఁ'ని తండ్రిని అనుకరిస్తూ మరీ అన్నాడు.

''ఏంట్రా పూరుకొంటున్నకొద్దీ మితిమీరిపోతున్నావ్. ఏదీ ఇంకొక్కసారి అను- చెత్తవ్యాపారమంటే అసహ్యమని?'' కోపం కొద్దీ నేలని దభీమని తన్నాడు రాయుడు. ఆ తన్నడంలో పైకి పొడుచుకొచ్చిన చెట్టు వేరేదో కాలికి గుచ్చుకోగా ''అబ్బా'' అన్నాడు బాధగా.

''మంచిపనయ్యింది' అనుకుంది అఖిలాండేశ్వరి లోలోన.

అన్నెం పున్నెం ఎరుగని తన ముద్దుల కొడుకుని పట్టుకుని అలా నానామాటలూ అంటుంటే దేవుడు చూస్తూ ఊరుకుంటాడేమిటి? అని కూడా అనుకుంది.

కొడుకుమీద ఆమెకు గల ప్రేమ అలాంటిది. అలాగని కొడుక్కున్న 'అతిమంచితనం' అనే అవలక్షణాన్ని ఆమె ఏనాడూ ఖండించలేదనికాదు. 'మరీ ఇలా వుండటం మంచిది కాదురా' అని కొడుక్కామె నచ్చజెప్పబోయిన సందర్భాలు చాలానే వున్నాయి. కానీ ఏంలాభం?

పుర్రెనపుట్టిన బుద్ధి నచ్చజెప్పడాలతో పోతుందా?

అందువల్ల కొడుకిహ మారడని గ్రహించే సిందామె.

"అరెఁ ఏవయ్యింది నాన్నా?" తండ్రి 'అబ్బా'కి ప్రతిస్పందిస్తూ అన్నాడు దయాసాగర్.

"ఏదో ఒకటయ్యిందిలే..."

'ఏమైతే నీకేం?' అన్నట్టు చూసి, "నీకు నచ్చక పోతే నచ్చనట్టుండు. అంతేగాని మన స్క్రాప్ వ్యాపారాన్ని ఈసడించి మాట్లాడితే మాత్రం నేనూరుకోను..." అన్నాడు రాయుడు.

"వాడూరుకున్నా మీరూరుకోనిస్తారా? మీరే కదా వాణ్ణి రెచ్చగొడుతోంది..."

వెనకనుంచి అఖిలాండేశ్వరి కంఠం విని పించడంతో ఉలిక్కిపడి వెనక్కిచూశాడు రాయుడు.

"నువ్వెప్పుడొచ్చావే?!"

"ఎప్పుడో వచ్చాన్లేగాని... ఎందుకు వాణ్నిలా సతాయిస్తారు? వాడికి నచ్చినపని వాణ్ని చేసు కోనివ్వరాదూ? బట్టలకొట్టు పెడ్తానంటున్నా డుగా? పెట్టనివ్వండి..." అంది అఖిలాండే శ్వరి.

"అనుభవంలేని వ్యాపారం జోలికెళ్తే చేతు లు కాల్తాయ్..."

"కాల్తే అప్పుడు వాడు తెలుసుకుంటాడు. నలుగుర్ని చంపన్దే డాక్టర్ కాలేరన్నట్టు, వాడికా అనుభవం రావడానికైనా ముందేదో ఒకటి చేయాలికదా?"

"ఆ చేసేదేదో మన వ్యాపారమే చేయొచ్చు గదా?" అనబోయి ఆగిపోయాడు రాయుడు- ఆ తల్లీకొడుకుల్తో మళ్ళీ చెత్త మహాలక్ష్మిని తిట్టించడం దేనికిలే అని.

భర్త నోరు విప్పకపోవడంతో మళ్ళీ అఖి లాండేశ్వరే అంది, "చేతులు కాలినాసరే... వాడు బట్టలుకొట్టు పెట్టేతీర్తాడు. అంతగా అయితే మా పుట్టింటోళ్ళిచ్చిన..."

"అయిదెకరాల మామిడితోట అమ్మేసైనా నువ్వు పెట్టిస్తావు... అంతేగా?" మధ్యలో అందుకుని భార్య మాటని పూర్తిచేశాడు రాయుడు.

"అఁ... అంతే" అన్నట్లు తలెగరేసింది అఖిలాండేశ్వరి. తన పుట్టింటోళ్ళిచ్చిన అయి దెకరాల మామిడితోటని తల్చుకోగానే పూనకం వచ్చినవాళ్ళ ఒంట్లోకి శక్తొచ్చినట్టు, తనకు తెలియకుండానే ఆమె ఒంట్లోకేదో శక్తొచ్చే స్తూంటుంది.

ఓ అయిదారుక్షణాలు ఆలోచించి అన్నాడు రాయుడు.

"సరే... అలాగైతే ఒక పనిచేయ్. మా కామే శ్వరరావుతో కలిసి జాయింట్‌గా చేద్దామన్న ఉద్దేశంతో బ్రాందీషాపు లైసెన్స్ కోసం అప్లయ్ చేశానామధ్య. అది రేపోమాపో వచ్చేలా వుంది. నీ పుట్టింటోళ్ళిచ్చిన అయిదెకరాల మామిడి తోట అమ్మొద్దులేగాని... పెట్టుబడి నేనే పెడ్తాలే గాని... నీ సుపుత్రుణ్ని ఆ షాపులో తగలడమ ను. నేను చెప్తే కామేశ్వరరావు డ్రాపైపోతాళ్ళే. వీణ్ణొక్కణ్ణే అది చేసుకోమను..."

"ఛీ! బ్రాందీషాపా?" రోతగా ముఖంపెట్టా డు దయాసాగర్.

"అవును బ్రాందీషాపే. ఏం దానికీ ఏదన్నా వంకుందా పెట్టడానికి...?" కొడుక్కేసి క్రీగంట ఎకసెక్కంగా చూశాడు రాయుడు.

"బ్రాందీషాపు నాకిష్టం లేదు..."

"ఎందుకని? నువ్వు బ్రాందీ తాగవు గన కనా?"

భర్తకేసి చురచుర చూసింది అఖిలాండే శ్వరి. "అవేం పాడుమాటలండీ? అక్కడికి వాడికాపాడు అలవాటేదో వున్నట్టు?" అంది కోపంగా.

"అలాంటి అలవాట్లున్నా కాస్త బాగుప డుండేవాడేమో! వీడికి లేకపోయినా, జనా భాలో డెబ్బైఅయిదుశాతం మందికుందా అల వాటు. నిత్యావసర వస్తువులకన్నా ఒకరకంగా దానికే డిమాండ్ ఎక్కువ. కొత్తబట్టలు కొనుక్కో కపోయినా ప్రాణంపోదుగాని... ఆ అలవాటున్న వాడికి ఆవేళకా చుక్కపడకపోతే నిజంగానే పోతుంది ప్రాణం. నీకేం తెలుసని నువ్వు మాట్లాడ్తున్నావ్? ఇన్నేళ్ళనుంచి బిజినెస్ చేస్తు న్నవాణ్ణి... ఏది లాభసాటిగా వుంటుందో నీకు తెలుసా నాకు తెలుసా?" అంటూ హుంక రించాడు రాయుడు.

"లాభసాటిగా వుంటుందికదాని పదిమంది కీ చెడుపుచేసే వ్యాపారం చేస్తామా? బ్రాందీ షాపు పెట్టి ప్రజల్ని చెడగొట్టడం నాకిష్టంలే దు..." అన్నాడు దయాసాగర్.

''మతిలేని మాటలు మాట్లాడబాకు. నువ్వొక్కడివి బ్రాందీషాపు పెట్టనంతమాత్రాన ప్రజలంతా బాగుపడిపోతారా? తాగేవాడు నీ షాపులో కాకపోతే ఇంకోషాపులో తాగుతాడు. అంతేగాని ఆ అలవాటు మానేసుకోడుకదా?''

''అవునుకదా?'' అనిపించింది దయాసాగర్‌కి.

అయినప్పటికీ తను బ్రాందీషాపు పెట్టడం అనే ఆలోచన మాత్రం ఒకపట్టాన మింగుడు పళ్ళేదతనికి.

''నువ్వెన్నయినా చెప్పు... నాకు మాత్రం ఇష్టంలేదు'' అనేశాడు ఖండితంగా.

కానీ...

ఆరోజు రాత్రి రాయుడు అఖిలాండేశ్వరికి విడమరిచి చెప్పాడు- వ్యాపారమంటే మనుషుల బలహీనతల్ని క్యాష్ చేసుకోవడమేననీ, బ్రాందీ షాపువల్ల వచ్చే ఆదాయం మరివేన్లోనూ రాదనీ కొడితే ఏనుగు కుంభస్థలాన్నే కొట్టాలన్నట్టు నిజంగా బాగుపడాలి అంటే అలాంటి వ్యాపారాన్నే చేయాలనీ ఆమెకు బాగా తలకెక్కేలా చెప్పాడు.

మర్నాడుదయం ఆమె కొడుక్కిష్టమైన పెసరట్టుప్మా పెట్టి, అతగాడు లొట్టలువేస్తూ తింటూండగా, క్రితంరాత్రి భర్త తన తల్లోకి ఎక్కించిన విషయాన్ని నెమ్మదిగా అతని తలలోకి ఎక్కించటం ప్రారంభించింది.

ఈ ప్రొసెస్‌లో ఆ తల్లీతనయుల సంభాషణ మధ్యలో తలదూర్చిన సాంబడు కూడా తన శక్తివంచన లేకుండా ఎంకరేజ్ చేశాడు దయాసాగర్‌ని, బ్రాందీషాపు ప్రతిపాదనకి ఒప్పుకోమని.

దాంతో దయాసాగర్ పునరాలోచనలో పడ్డాడు.

నిజమేకదా? వ్యాపారం అంటూ చేసేది లాభంకోసమేకదా? అలాంటప్పుడు లాభసాటి వ్యాపారాన్నే ఎన్నుకోవడంలో తప్పేముందీ?

బ్రాందీ తాగడం తప్పు కావచ్చు... ఆ అలవాటున్న వాళ్ళ జీవితాలు నాశనం కావడమూ నిజమే కావచ్చు. అలాగని వాళ్ళని మార్చలేంకదా? తాగేవాళ్లు ఎప్పటికీ తాగుతూనే వుంటారు... తను షాపు పెట్టినా పెట్టకపోయినా.

కాబట్టి...

కాబట్టి...

కాబట్టి...

పరిపరివిధాల ఆలోచించినమీదట, ఎలాగూ తండ్రికి లైసెన్స్ రాబోతోంది కనుక ఆయన మనసు నొప్పించకుండా బ్రాందీషాప్ వ్యాపారానికి ఒప్పేసుకోవడానికే నిర్ణయించుకున్నాడు దయాసాగర్.

దయాసాగర్ గ్రీన్‌సిగ్నల్ ఇవ్వగానే 'హమ్మయ్య! వీడికింక బాగుపడేరోజులొచ్చేశాయ్...' అనుకున్నాడు రాయుడు ఆనందంగా.

కొడుకు ప్రయోజకుడవుతున్నందుకు అఖిలాండేశ్వరి కూడా చాలా సంతోషపడింది.

అలా మొత్తానికి దయాసాగర్ ఓ బ్రాందీషాపుకి ప్రొప్రయిటర్ అయ్యాడు.

షాపు పేరు కూడా అతని పేరే... 'దయాసాగర్ వైన్స్'

పెద్దయ్యగార్ని ఎలాగోలా ఒప్పించి, దయాసాగర్‌కి హెల్పర్‌గా సాంబడు కూడా ఆ షాపులో చేరిపోయాడు.

కొత్తషాపు కాబట్టి మొదట్లో ఓ మోస్తరుగా సాగినా... ఓ నెల్రోజులు తిరిగేసరికి ఎక్కడలేని జనమూ ఆ షాపుకే రావడానికి అలవాటు పడిపోయాడు.

ఈగల్లా ముసిరిపోతున్న కస్టమర్లని అదుపులో పెట్టడానికి ఎక్కడా లేనివిధంగా ఆ వైన్‌షాప్ ముందు క్యూ పద్ధతి కూడా ఏర్పాటు చేయాల్సొచ్చింది.

★ ★ ★

చెప్పుకుపోతున్న లోకేశ్వరరావుకి మధ్యలో అడ్డుతగుల్తూ అన్నాడు మాధవరావు.

''మరైతే ఇంకేంటండీ బాబూ!? కుర్రాడు బ్రాందీ తాగితే బాధగానీ... బ్రాందీషాపు నడిపితే తప్పేముందీ? అందునా కస్టమర్లు క్యూ గట్టేంతగా వ్యాపారం అభివృద్ధి చెందిందని మీరే చెబుతుంటిరాయె. అలాంటప్పుడు ఇంకా సంకోచించాల్సిందేముంది? అఫ్‌కోర్స్... మీరు చెప్పినదాన్ని బట్టి కుర్రాడు కొంచెం మెతగ్గా అనిపిస్తున్నాడనుకోండి. అయినా దాన్దేముందీ? ఒకరకంగా అదింకో ప్లస్‌పాయింట్

కూడాను. మనసు మెత్తనిది కాబట్టి అమ్మాయిని ఏ సందర్భంలోనూ కష్టపెట్టకుండా వుంటాడు. తాగేవాళ్ళొద్దన్నానుకదాని బ్రాందీ షాపు ప్రొప్రయిటర్ని కూడా వద్దంటానేమోనన్న ఉద్దేశంతో మీరు సంకోచిస్తున్నారులా వుంది. కానీ నా కలాంటిదేంలేదు. వ్యాపారం ఏదైతేనేం, ఆర్జన ముఖ్యం. నాకీ సంబంధం అన్నివిధాలా నచ్చింది. మీరింకేం ఆలోచించకుండా మిగతా ఏర్పాట్లు చూడండి. ఆ రాయుడితో మాట్లాడి వీలైనంత తొందర్లో పెళ్లిచూపులకు రమ్మనండి. అసలే లడ్డూలాంటి కుర్రాడు. ఆలస్యం చేస్తే ఇంకెవరన్నా ఎగరేసుకుపోతారేమో!"

జోగాంబ క్కూడా అలాగే అనిపించింది.

అంతా లలిత అదృష్టం. నిజంగా ఈ సంబంధం గనక కుదిర్తే మనిషి మెతకవాడు కాబట్టి, పిల్లకొంగున కట్టుకుని తిప్పుకోగలుగుతుంది. ఆడించినట్టల్లా ఆడే భర్త దొరకాలేగాని అంతకన్నా ఆడదానికి అదృష్టమేముంది...? ఇలా సాగిపోయాయ్ ఆమె ఊహలు.

అంతలో లోకేశ్వరరావు పెద్ద పెట్టున ఇంచుమించు ఆ హాలు దద్దరిల్లిపోయేలా- ఒక్క నవ్వు నవ్వాడు.

దాంతో దంపతులిద్దరూ మళ్ళీ కన్ఫ్యూజన్లో పడ్డారు... 'ఏవిటబ్బా ఇతగాడి ధోరణి?' అని.

"నన్ను పూర్తిగా చెప్పనివ్వకుండానే మీరేదేదో ఊహించేసుకుని అప్పుడే ఓ నిర్ణయానికొచ్చేస్తే ఎలా? అతని షాపుముందు కష్టమర్లు క్యూ గట్టినమాట నిజమే. కానీ మీరనుకుంటున్నట్టు అతని వ్యాపారం మాత్రం అభివృద్ధి చెందలేదు. సరిగదా ముచ్చటగా మూణ్ణెల్లు గడిచేసరికల్లా ఏకంగా షాపే మూతబడిపోయింది..." అంటూ అసలు సంగతి చెప్పేశాడు.

"అరెం... అదేవిటి పాపం?!" అన్నాడు మాధవరావు విస్మయంగా.

"పాపమేం కాదు. స్వయంకృతాపరాధం. అడిగిన వాళ్ళందరికీ అరువులిస్తూ కూర్చుంటే షాపు మూతబడకేమౌతుంది... అదీ తాగుబోతు నన్నానులకి?"

"అరెం... అట్లా ఎలా ఇచ్చాడబ్బా?"

"ఏవుందీ... ఇతగాడి మెతకదనం కనిపెట్టి తాగుబోతులలా టోపీ వేశారు. ప్రతివాడూ ఏదోక సాకుచెప్పి అరువడగడం, ఇతగాడేమో 'పోన్లే పాపం నోరు తెరిచి అడిగాడుకదా' అని జాలిపడిపోయి ఇచ్చేయడం మొదలయింది. అందుకే జనం అలా క్యూగట్టింది అతని షాపుముందు. అడగడమే ఆలస్యంగా అరువిస్తున్నాడుకదాని మొదట్లో అందరూ అలా విరగబడిపోయారు. తీరా ఇతను బాకీ తీర్చమని అడగబోయేసరికల్లా మొహాలు చాటుచేయడం ప్రారంభించారు. గోడక్కొట్టిన సున్నమయినా గీక్కోవచ్చేమోగాని, తాగుబోతులకిచ్చిన అప్పు తిరిగొస్తుందా? రాదు. రాలేదు కూడా. ఫలితంగా పూర్తిగా దివాళ తీసేసి... మూడుల క్షల బ్రాందీషాపుని మూడు నెలల్లో ఆర్పేసి... ఇపుడింట్లో ఓ మూలన కూర్చున్నాడు"

"వార్నీ!" అన్నాడు మాధవరావు.

"అదీ అతగాడి తంతు. ఊం ఇప్పుడు చెప్పండి... కావాలా మీకలాంటి అల్లుడు? మాట్లాడమంటారా రాయుడుగారితో?" అన్నాడు లోకేశ్వరరావు కవ్వింపుగా చూస్తూ.

"వొద్దు మహాప్రభో!" అంటూ చేతులెండూ పైకెత్తి మరీ దండం పెట్టాడు మాధవరావు.

పెట్టడామరి? చూస్తూ చూస్తూ మరీ అంత మంచివాడికి పిల్లనివ్వడానికి ఎవరు మాత్రం ఇష్టపడతారు?

లోపల్నుంచి అసలు సంగతి ఆలకించిన జోగాంబ కూడా అలాగే అనుకుంది... 'పెళ్ళి చేయకుండా పిల్లనింట్లో కూర్చోబెట్టుకున్నా మేలేగాని... చూస్తూ చూస్తూ మరీ అంత అమాయకపు నన్నాసికివ్వడమా?' అని.

'ఇంకా నయం. ఈ లోకేశ్వరరావు పేరయ్యే మాయమాటలు చెప్పి మభ్యపెట్టకుండా విషయం ఉన్నదున్నట్టు చెప్పాడు. లేకపోతే బోల్తా పడిపోయుండేవాళ్ళమే' అని కూడా అనుకుందామె.

"అదేవిటలా దండం పెట్టేస్తున్నారు? ఇందాకేగా మీకీ సంబంధం అన్నివిధాలా నచ్చిందన్నారు?" మళ్ళీ కవ్వించాడు లోకేశ్వరరావు.

"ఎరక్కపోయి అన్నాను .మహాప్రభో" అంటూ మళ్ళీ ఇందాకటి ఫక్కీలోనే దండం పెట్టాడు మాధవరావు.

"మీరు మరీ అంతలా గాభరా పడిపోవాల్సిన పనిలేదు. బ్రాందీషాపైతే పోయింది గాని... కుర్రాడేం చికాకైపోలేదుగా? రాయుడిగారికున్న మొత్తం ఆస్తితో పోలిస్తే ఆ కుర్రాడార్పిన మూడు లక్షలు ఓ లెక్కలోకి రావు. అంత ఆస్తికీ ఒక్కడే వారసుడు మరి. కాబట్టి మళ్ళీ ఓ సారాలోచించండి.

లోకశ్వరరావుకేసి మింగేసేలా చూశాడు మాధవరావు.

"ఎవరిక్కావాలండీ లక్షలు? మగపుటక పుట్టేక మనిషికి ప్రయోజకత్వం అనేది వుండాలి. ఇవ్వాళ మూడులక్షలార్పినవాడు రేపు ఇంకేదైనా వ్యాపారం పెట్టి మొత్తం ఆస్తంతా ఆర్పేసినా ఆర్పేస్తాడు. ఎందుకొచ్చిన గొడవ? ఇపుడాస్తిని చూసి పిల్లనిస్తాం. కానీ రేపంతా ఆర్పుకుని అడుక్కుతింటే మాత్రం మనమేం చేయగలం? అతన్తోపాటు మనపిల్ల అవస్థలు పడాల్సిందేకదా? అందుకుని, అల వాట్ల విషయంలో కాస్త అటూ ఇటూగా వున్నా ఫర్వాలేదులేగాని... ఏదైనా ప్రభుత్వోద్యోగం వున్న పిల్లాణ్ణి చూడండి. అమ్మాయి జీవితానికి సెక్యూరిటీ అయినా వుంటుంది..." అన్నాడు కాస్త సంభాళించుకుంటూ.

"అలారండి దార్లోకి" అనుకున్నాడు లోకేశ్వరరావు. అలాగే లెండి. ఇకనుండి అలాంటి సంబంధాలే చూద్దాం అయితే" అన్నాడు పైకి.

అంతలో అప్పుడే కాలేజినుండి వచ్చిన లలిత లోకేశ్వరరావ్‌ని చూసి పలకరింపుగా నవ్వింది.

అతగాడు పెళ్ళిళ్ల పేరయ్యనీ, తనకి సంబంధాలు చూస్తున్నాడనీ ఆమెకు తెలుసు.

మరి కాసేపటి తర్వాత లోకేశ్వరరావ్ శెలవు తీసుకుని వెళ్ళిపోయాక తల్లి ఒంటరిగా వున్న సమయం చూసి అడిగిందామె,"పేరయ్యగారొచ్చినట్టున్నారు. ఈసారెలాంటి సంబంధం తెచ్చారేవిటి?" అని.

"ఆఁ తెచ్చాళ్ళే ఓ అప్రాచ్యపు సంబంధం" అంటూ ముఖం చిట్లించి... "వద్దని చెప్పేశాం" అంది జోగాంబ.

వ్యవహారం పెళ్లిచూపులదాకా రాకముందే అమ్మానాన్నలు తిరస్కరించేశారూ అంటే అదేదో వెరీ వెరీ బ్యాడ్ సంబంధం అయ్యుంటుందిలే అనిపించి...తల్లినింకేం వివరాలడగలేదు లలిత.

ఆమెకు సంబంధాలు చూడడం నిజానికి ఈమధ్యనే మొదలయింది.

అప్పటికి ఒకేఒక్క పెళ్లిచూపుల్లో కూర్చుందామె. ఆ అబ్బాయికి లలిత నచ్చిందిగాని, లలితకే అతగాడి మెల్లకన్ను నచ్చకపోవడంవల్ల ఆ సంబంధం బెడిసికొట్టింది.

ఆ తర్వాత లోకేశ్వరరావ్ మరో రెండుమూడు సంబంధాలు సజెస్ట్ చేసినా, ఇదిగో ఈ సంబంధంలాగే అవి పెళ్లిచూపులవరకూ దారి తీయకముందే వీగిపోవడం జరిగింది.

లలిత ప్రస్తుతం డిగ్రీ ఫైనలియర్‌చదువుతోంది.

రిజల్టొచ్చి లలిత పాసయినా, ఫెయిలయినాసరే... ముందున్న వేసవిలో ఆమెకు పెళ్లి చేసేయాలన్నది మాధవరావు దంపతుల అభిమతం. లలితకు పెళ్లిమీద పెద్దగా ఆరాటమూ లేదు... అలాగని అయిష్టతా లేదు.

అబ్బాయికి తను నచ్చడమేకాదు, తనక్కూడా అబ్బాయి నచ్చి తీరాలని మాత్రం అమ్మానాన్నలతో కండిషనల్‌గా చెప్పేసిందామె. తనకు కాబోయే భర్త మరీ నవలా నాయకుడిలా వుండాలన్న దురాశైతే లేదుగాని... కనీసం కనుముక్కు తీరైనా తన కంటికింపుగా వుండాలిగదా అన్నది ఆమె ఉద్దేశం.

★ ★ ★

"ఏంటి నారయ్యా ఇలా వచ్చావ్?" తన ఇల్లు వెదుక్కుంటూ వచ్చిన ఆ బికారి శాల్తీ వైపు ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు దయాసాగర్.

నారయ్య నామధేయుడైన సదరు బికారిశాల్తీ మాసిన గడ్డం తైలసంస్కారంలేని జుట్టూ... మురికితో అట్టలు కట్టుకుపోయి అక్కడక్కడా మాసికవేసిన దుస్తులూ... వగైరా వగైరాలతో ఇంచుమించు ఓ ముష్టివాడిలా వున్నాడు.

"శానా కట్టంమీద మీ ఇల్లు కనుక్కోగలిగేనండయ్యా... తవరీ మధ్యన దుకాణం తీయడం లేదేంటండయ్యా?"

నారయ్య అలా అడుగుతుంటే వాడు తనిని కుశలమడుగుతున్నట్టుగా ఫీలయ్యాడు దయాసాగర్.

"ఇంకెక్కడిపాపు నారయ్యా! అందరూ అరువులు పట్టుకుపోయారే తప్ప, ఒక్కడైనా సరే బాకీ తీర్చిన పాపాన్నపోలేదు. సరుకంతా అయిపోయింది... అందువల్ల కొట్టుమూసేశాను..."

"అంటే పూర్తిగా మూసేసినట్టే నాండయ్యా? ఇంక మళ్ళీ తెరవరాండయ్యా?" తన కొంపేదో మునిగిపోయినంత గాభరాగా చూశాడు నారయ్య.

"ఎలా తెరవమంటావ్ నారయ్యా? సరుకంతా మంది చేతిలోకెళ్ళిపోయింది. డబ్బులేమో తిరిగిరాలేదు. నీ మట్టుకు నువ్వే ఇవ్వాలికదా నాలుగొందల యాభయ్యో ఎంతో. అన్నట్టు చీటో ఏదో పాడేసి నా బాకీ తీర్చేస్తానన్నావ్‌గా? పాడేశావా?"

"లేదండయ్యా" చేతులు నలుపుకుంటూ అన్నాడు నారయ్య... "ఈ నెల్లో బాగా పైకి పోయిందండయ్యా పాట. అందుకని పాళ్ళేదండయ్యా. వచ్చేనెల్లో పాడిచ్చేస్తాలేగాని... ఓ యాభైయుంటే కొట్టించండయ్యా... మీరు దుకాణం తెరవకపోవడంవల్ల నేను సుక్కేస్కోక నాలుగురోజులైపోయిందండయ్యా..." అంటూ కాళ్ళనీ, చేతుల్నీ వొణికిస్తూ దీనంగా చూశాడు.

"అదేంటలా వొణికిపోతున్నావ్?"

"మరేం సేయమంటారండయ్యా? సుక్కపడకపోవడంవల్ల వొచ్చిపడిన అనర్థవండయా ఇది. అర్జంటుగా ఓ కోర్టర్‌పడ్తే తప్ప ఈ వొణుకు తగ్గదు..."

'పాపం' అనుకున్నాడు దయాసాగర్ జాలిగా.

మలేరియారోగి కూడా ఇలా వొణకడు. పాపం ఎంతలా వొణికిపోతున్నాడు.

సాటిమనిషి ఆఫ్టరాల్ ఓ యాభైకోసం అలా వొణికిపోతుంటే చూస్తూ సహించలేకపోయిందతని మనసు.

ఫలితంగా యాభైనోటుని బైటికి తీయడం కోసం పేంట్ జేబులోకి వెళ్ళిందతని చేయి.

కానీ ఆ చేయి ఇంకా జేబులోంచి బైటకి రాకముందే ఎక్కణ్ణించో రాకెట్‌లా దూసుకొచ్చాడు సాంబడు.

"ఏంట్రా నన్నొసెదవా? ఇక్కడిక్కూడా దాపిరించావా? ఏమొహం పెట్టుకునొచ్చావ్‌రా? అసలెందుకొచ్చేవ్‌రా?" అన్నాడు నారయ్యకేసి మింగేసేలా చూస్తూ.

"ఊరుకో సాంబడూ... ఊరుకో సాంబడూ..." వారింపుగా అన్నాడు దయాసాగర్.

దాంతో కొంపదీసి ఈ ఎదవబాకీ చెల్లు చేయడానిగ్గాని వచ్చేడేమోలే అనిపించి... లేకపోతే చినబాబు ఎందుకు వారిస్తాడిలా?' అనిపించి.. కూల్‌డౌన్ అయ్యాడు సాంబడు.

అప్పుడు బైటికొచ్చింది దయాసాగర్ చేయి, పేంట్‌జేబులోంచి.

అందులో మిసమిసలాడిపోతున్న ఓ కొత్త యాభైనోటు.

"ధర్మప్రభువులండయ్యా తవరు..." అన్నాడు నారయ్య కంఠంలోంచి కృతజ్ఞతనొలికిస్తూ.

సాంబడికి విషయం అర్థంగాక ఏమిటన్నట్టు చూశాడు దయాసాగర్‌కేసి.

దయాసాగర్ సంగతి చెప్పాడు, "పాపం నాలుగు రోజుల్నుంచి మందుపళ్ళేదంట... మనిషి నిలువెల్లా వొణికిపోతున్నాడు. వచ్చేనెల్లో పాతబాకీతోపాటు కలిపి తీర్చేస్తానంటున్నాడు. అందుకని..."

"అందుకని ఇంకో యాభై తగలేస్తున్నారా ఆడి మొహాన్నా. ఎంత అమాయకులు చినబాబూ మీరు? ఆడి మొహం చూడండి... అదసలు బాకీతీర్చే మొహవేనా?"

సాంబడలా అంటూండగానే, ఎందుకైనా మంచిదన్నట్టు దయాసాగర్ చేతిలోంచి యాభైకాగితాన్ని చటుక్కున లాగేసుకున్నాడు నారయ్య.

"ఏంట్రా ఆ దౌర్జన్యం? ఇచ్చేయ్... చినబాబుగారికిచ్చేయ్ ఆ నోటు..." ఉద్రేకంగా అరిచాడు సాంబడు.

"పోన్లే సాంబడూ... వచ్చేనెల్లో చీటీపాడి ఇచ్చేస్తానంటున్నాడుకదా... వీడి మాటలకేంల్లే, నువ్వుంచుకో నారయ్యా... కానీ వచ్చేనెల్లో బాకీ మొత్తం తీర్చేయాలి సుమా" అన్నాడు దయాసాగర్.

"అట్టాగేనండయ్యా... తమరి బాకీ ఎగ్గొడితే కళ్ళుపోతాయండయ్యా..." అన్నాడు నారయ్య నయగారంగా.

'పాపం వ్యసనానికి దాసుడై ఇలాగైపోయా

డుగాని, మనిషి మంచివాడే' అనుకున్నాడు దయాసాగర్ ఆ మాటలకి పొంగిపోతూ.

సాంబడు ఘోరమైన ఈ అన్యాయాన్ని చూస్తూ సహించలేకపోయాడు.

బికారినాయాలు... చినబాబు మంచితనాన్ని అడ్డం పెట్టుకుని పాతబాకీ ఇవ్వకపోగా ఇంకో యాభై గుంజుకుపోతున్నాడు.

"తాగడానికి నీకు యాభై ఎందుకురా? ఏం నాటుసారా తాగలేవా? నేను పదిరూపాయలిస్తాలేగానీ యాభై ఇలాగివ్వు..." అన్నాడు వాడి కేసి కసిగా చూస్తూ.

"నాటుసారానా?!" జీవితంలో అసలాపదమే విననివాడిలా ముఖం పెట్టాడు నారయ్య.

సాంబడికి ఒళ్ళు మండిపోయింది.

"ఏంట్రా అలా నీలుగుతున్నావ్. జన్మలో నాటుసారా తాగనివాడికిమల్లే?" అంటూ అరిచాడు.

నారయ్య వాడికేసి రెక్‌లెస్‌గా ఓ చూపు చూసి ఆ తర్వాత దయాసాగర్‌వైపు తిరిగి చెప్పాడు. "నాటుసారా ఇపుడు నా ఒంటికి పడ్డంలేదండయ్యా... తవరు దుకాణం ఎట్టక ముందు నేను నాటుసారానే తాగేవాణ్ణి గానండయ్యా... తవరి దయవల్ల సీవఁ సరుకలవాటైపోయి... ఇపుడా పేరింటేనే డోకొస్తాందయ్యా"

'కాబోల్లే పాపం' అనుకున్నాడు దయాసాగర్. "పోన్లే సాంబడూ నువ్వూరుకో..." అన్నాడు సాంబడితో.

"ఏంటి చినబాబూ ఊరుకునేది, అసలిలాంటి ఎదవలవల్లే మన సాపు సంకనాకిపోయింది. ఇలాంటి ఎదవలందరికీ ఎరువులివ్వొద్దండీ అంటే మీరు విన్నారా? అన్నిటికీ పోన్లే పాపం పోన్లే పాపం అంటూ ఇంతదాకా తెచ్చారు. మీకేం మీరు బాగానే వున్నారు. పెద్దయ్యగారు నన్నెన్ని మాటలన్నారో తెలుసా? చినబాబుకి బుద్ధి లేకపోతే నీ జ్ఞానవేవయ్యిందిరా, అడ్డమైనోడికీ అరువులిస్తుంటే నువ్ చూస్తూ ఎలా ఊర్కున్నావంటూ తలవాచేలా నన్ను తిట్టిపోశారు. మీకేం తెలవదు, మీరూర్కోండి... రేయ్ నారిగా, ఆ యాభై ఇలాగివ్వు... తియ్యరా తియ్ బైటికి..." అంటూ నారయ్య మీదకు ఫోర్స్‌గా దూకాడు సాంబడు.

'ఇదెక్కడి గోలండయ్యా?' అన్నట్టు చూశాడు నారయ్య దయాసాగర్‌కేసి.

దయాసాగర్‌కి కూడా సాంబడి వరసేం నచ్చలేదు. ఎంతైనా నారయ్య ఒకప్పటి తమ కస్టమరాయె. కష్టమర్‌గా అతను తన సాపుకొచ్చినపుడు ఏనాడూ ఇలా ఇన్సల్ట్ చేయలేదు కదా? అలాంటిది ఇప్పుడు మాత్రం ఎందుకు చేయాలి? పాపం హర్టవ్వడూ? ఇలా అనుకుంటూ, "సాంబడూ నీకే చెప్పేది... ఏంటా దూకుడు? కాస్త తగ్గు..." అన్నాడు రవంత కోపంగా.

సర్లే కందకే దురద లేనపుడు కత్తిపీటనైన నాకేల? అనుకున్నాడో ఏమో, మొత్తానికి సాంబడు శాంతించాడు.

"దండాలండయ్యా... నేనొస్తానండయ్యా..." అంటూ చేతులు జోడించాడు నారయ్య.

"అలాగే... వచ్చేనెల్లో నా బాకీ సంగతి మాత్రం మర్చిపోబాకు..." అన్నాడు దయాసాగర్.

అంతలో "బాకీ ఏంట్రా? ఎవడ్రా ఈ బికారి వెధవ?" అంటూ అక్కడికొచ్చాడు రాయుడు. ఏదో పనిమీద బైటికెళ్ళి అప్పుడే వీధిలోంచి ఇంట్లోకొచ్చాడాయన. వస్తూనే 'ఏంటబ్బా ముష్టోడినింట్లోకి రానిచ్చారు?' అనుకున్నాడు ముందు. అంతలో 'బాకీ' అన్నమాట ఆయన చెవిన పడింది.

తండ్రికి విషయం తెలిస్తే నానా రభసా అయిపోతుందన్న ఉద్దేశంతో "అబ్బే ఏంలేదులే నాన్నా" అనేశాడు దయాసాగర్.

కానీ కంగారు పడకుండా మాత్రం వుండలేకపోయాడు.

రాయుడికి కొడుకేదో దాస్తున్నాడని అర్థమైపోయింది.

అయినా అర్థం కాకుండా ఎలా వుంటుంది? ఏదో వుంది కథని అంత స్పష్టంగా తెలిసిపోతుంటేనూ?

"ఎవడ్రా ఈ బిచ్చగాడు? బాకీ ఏంటీ బాకీ?" అన్నాడు ఆ హాల్లో వున్న ముగ్గురికేసీ మార్చి మార్చి చూస్తూ.

సాంబడు చినబాబుగారి వీపు వెనగ్గా తన ముఖంచాటు చేయబోయాడు.

రాయుడిని గమనించి చటుక్కున వాడి

చొక్కా దొరకబుచ్చుకున్నాడు. "ఏంట్రా మొ హంచాటు చేస్తున్నావు? సంగతేంటో చెప్పు... లేకపోతే నీ పేపులు కూడా ఈ బిచ్చగాడి పేపుల్లా మారిపోతాయ్... ఆఁ..." అన్నాడు గర్జిస్తూ.

"ఆడు బిచ్చగాడు కాదు పెద్దయ్యగారూ... చినబాబుగారి బ్రాందీషాపుకి కస్టమరు... మన షాపులో ఖాతా ఉండేది ఈ ఎదవకి" అంటూ మొదలెట్టి విషయం యావత్తూ చెప్పేశాడు సాంబడు.

తప్పులేదు మరి... చినబాబుని సేఫ్‌గార్డ్ చేయడంకోసం ఏదోక అబద్ధం కల్పించి చెప్పా లనిపించినా, ఆ సందర్భానికి అతికినట్టు వుండే అబద్ధమేదీ ఆ సమయంలో వాడికి స్ఫురించలేదు.

అందుకని అతకని అబద్ధమాడి గొంతుమీ దకి తెచ్చుకోవడంకన్నా ఇదే బెటరనిపించి నిజం చెప్పేశాడు.

అంతే. ఆ దెబ్బతో రాయుడాగ్రహంతో ఉగ్ర నరసింహావతారమే అయ్యాడు.

"ఇంత పనికిమాలిన వెధవలకి అరువులి చ్చుకుంటారా ఎవరైనా?" అంటూ దయాసా గర్ మీద మండిపడి, ఆపైన "వాడికి లేకపోతే పోయింది; నీ జ్ఞానమేమయ్యిందిరా" అంటూ సాంబణ్ణి తిట్టిపోసి, అటుపిమ్మట నారయ్యా మురికిదుస్తుల్లోంచి యాభైనోటుని వెదికి బైటికి తీశాడు.

"అప్పేసండయ్యా... వచ్చేనెల్లో తప్పకుండా ఇచ్చేత్తానండయ్యా" అంటూ ఏదో చెప్పబోయా డు నారయ్య.

"ముయ్‌నోరు..." అంటూ వాణ్ణి వరండాలో పడేలా ఒక్కనెట్టు నెట్టాడు రాయుడు.

'ఇంకా నయం. తాటొలవలేదు' అను కుంటూ లేచి దుమ్ముదులుపుకుని వాడించ క్కా ఉడాయించబోతే, చెంగున వాడికేసి దూకి వాణ్ణి ఒడిసి పట్టుకున్నాడు రాయుడు.

"ఎక్కడికిరా జారుకుంటున్నావ్. నిన్నంత తేలిగ్గా వదలడానికి నేనేవన్నా వెర్రోణ్ణను కుంటున్నావా? నీ బాకీ తీరేవరకూ నువ్వు రోజూ మా ఇంటికొచ్చి చెత్తబస్తాలు లారీల్లోకి ఎక్కిస్తావుండు. రోజుకి పదిరూపాయలు నీ కూలీ..." అంటూ వాణ్ణి సాంబడికేసి నెట్టి- "వీణ్ణి లాక్కెళ్ళరా... లాక్కెళ్ళి తన్నైనాసరే వీడితో పనిచేయించు. రోజూ మనింటికొచ్చి వీడు పనిచేసి వెళ్ళాల్సిందే. మన బాకీ తీరేవ రకూ వదలొద్దు వెధవని..." అన్నాడు రాయు డు ఊగిపోతూ.

అలాగే అన్నట్టు తలూపి నారయ్యని వరండామీంచి వాకిట్లోకి నెట్టుకుంటూ తీస్కెళ్ళి పోయాడు సాంబడు.

'పాపం' అనిపించింది దయాసాగర్‌కి. అయినా నోరు మెదపలేకపోయాడు.

ఆ సమయంలో అఖిలాండేశ్వరి పేరంటాని కని ఎవరింటికో వెళ్ళడం అతని దురదృష్టం.

నారయ్యని లారీ దగ్గరికి ఈడ్చుకెళ్ళి- "ఊఁ... ఎత్తరా... ఈ బస్తాలన్నీ లారీలోకెత్తు..." అంటూ వాడికి పని పురమాయించాడు సాంబ డు.

వాడు మొరాయించబోయాడుగాని, సాంబ డిముందు వాడి పప్పులేమీ ఉడకలేదు.

సాయంత్రంవరకూ అలా వాడితో పనిచే యించాక, "ఊఁ... నీ ఇల్లెక్కడో చెప్పెళ్ళు. ఒకవేళ రేపు నువ్వు పన్లోకి రాకపోతే, రేపు నేన్నీఇంటికొచ్చి నిన్ను లాక్కురావాలిగా?" అన్నాడు సాంబడు... "ఇకనుంచి నేనే నీ యజమాన్ని సుమా" అనే ధోరణిలో ఠీవి ఒలికి స్తూ.

అవతారం అడుక్కుతినే అవతారమే అయినా, నారయ్య వెర్రోడేం కాదు.

"ఎంతమాటండయ్యా!? ఇయ్యాల పన్లో సేరి, రేపే ఎగనామం పెడ్తానా? నేనసుంటోడ్ని కాదు. మీ బాకీ తీరేవొరకూ రోజూ ఇలా వొచ్చిపో తానే వుంటాను. అయినా అడిగారు గాబట్టి సెబుతున్నాను. నా ఇల్లు..." అంటూ దొంగ డ్రస్ ఇచ్చి వెళ్ళిపోయాడు.

మర్నాడు వాడు తిరిగి ఆ ఛాయలకు రాలేదు.

వాడు చెప్పిన అనవాళ్ళ ప్రకారం సాంబడు ఆరాతీస్తూపోతే... సాంబడికి కనిపించింది నార య్యా ఇల్లుకాదు. వల్లకాడు.

అవును. నిజంగా వల్లకాడే!

★ ★ ★

"హమ్మయ్యా!" అనుకుంటూ తృప్తిగా నిట్టూ

ర్చింది లలిత.

గుండెలమీంచి పేద్ద బరువేదో దిగిపోయినంత రిలీఫ్‌గా అనిపించిందామెకి.

అప్పుడే ఎగ్జామినేషన్ హాల్లోంచి బైటకొచ్చిందామె.

అదే ఆఖరిపరీక్ష కావడంవల్ల శనేదో విరగడైపోయినంత హాయి... స్టూడెంట్స్‌కది సహజమేకదా!

ఇంకా ఎగ్జామినేషన్ హాల్లోనే వున్న రజిత కోసం నిరీక్షిస్తూ ఓ చెట్టుకింద నిలబడిందామె.

రజిత ఆమెకి క్లోజ్‌ఫ్రెండు. మధులత, శ్రీవాణి, కిన్నెర- వీళ్ళంతా కూడా క్లాస్‌మేట్స్సూ, ఫ్రెండ్సే అయినా రజితతో మూవ్ అయినంత క్లోజ్‌గా వాళ్ళెవ్వరితోనూ ఉండదామె.

బహుశా ఎవరైనా అంతేనేమో!

అంతరంగిక స్నేహం అనేది ఒకరితో, తప్పితే ఇద్దరితో. అంతేగదా?

"ఇంకా ఊడిపడదేంటి ఈ అమ్మాయిగారు? బెల్లయ్యేదాకా రాదల్చుకోలేదేమో..." విసుగ్గా అనుకుంటూ వాచీలోకి చూసుకొంది.

"ఏయ్ లలితా ఎలా రాశావే?" ఇటువేపే వస్తూ అల్లంతదూరాన్నుంచే అడిగింది కిన్నెర.

"బానే రాశాను... నువ్వెలా రాశావ్?"

"అన్నీ నేను చదివిన కొశ్చన్సే వచ్చాయి. చాలా బాగా రాశాను" సంతోషంగా చెప్పింది కిన్నెర. అందులో నిజమెంతో అబద్ధమెంతో ఆమెకే తెలియాలి. ఎందుకంటే స్వతహాగా ఆమె మొద్దురకం. తెలిసిన ప్రశ్నలే వచ్చినా చాలా బాగా రాయగలిగిన తెలివితేటలు పూజ్యం.

"అలాగా వెరీగుడ్..." అంటూ నవ్వింది లలిత.

"ఎవరికోసం వెయిట్ చేస్తున్నావు? రజిత కోసమేనా?"

"ఆఁ..."

"ఆవిడగారింకా రాస్తూనేవుంది. పేజీలకు పేజిలు నింపేస్తూవుంది. ఇప్పట్లో వచ్చేలాలేదు..."

"ఇంకెంత? మరో పదినిమిషాలు... అప్పుడ దింకా రాస్తానన్నా పేపరు లాక్కుని తరిమేయరూ?"

"అయితే వచ్చేదాకా వెయిట్ చేస్తానంటావ్?" అంది కిన్నెర.

"నువ్వూ వుండరాదూ? ఇంటికెళ్ళి ఏం చేస్తావేం?" అంది లలిత ఆమె భుజంమీద చేయివేస్తూ.

సరే అన్నట్టు తలూపింది కిన్నెర.

వాళ్ళలా ఏదో మాట్లాడుకుంటూ వుండగా మధులత వచ్చి జాయినైంది వారితో. మరి కాసేపటికి శ్రీవాణి, ఆ వెనుక రజితా కూడా వచ్చి జాయినయ్యారు.

"బెల్లు మోగేదాకా రాస్తూనే కూర్చున్నారంటే బాగానే రాశారన్నమాట! యామై కరెక్ట్?" అంది లలిత ఆ ఇద్దర్నీ ఉద్దేశించి.

అవునన్నట్టు తలాడించారు ఆ ఇద్దరూ.

"మొత్తానికి చూస్తుండగానే మూడేళ్ళు ఇట్టే గడిచిపోయాయ్... చదువు పేరుతో ఇన్నాళ్ళూ కలిసిమెలిసి వుండగలిగాం. ఇహ వేరైపోవాల్సిందేగా?" కించిత్ బాధగా ముఖం పెట్టి అంది కిన్నెర.

"వేరూ అయిపోం... చెట్టూ అయిపోం. మన సుండాలేగాని, మార్గమే వుండదా? ఈ స్నేహాన్ని నిలుపుకోవాలనుకుంటే ఎక్కడున్నా ఉత్తరాలు రాస్కుంటూ వుండొచ్చుగా?" అంది మధులత.

"నిజమే" అంది రజిత.

"ఏం నిజం నా బొంద. రేపు పెళ్ళిళ్ళయ్యాక ఎవరి మట్టుకు వాళ్ళు సంసారఝంజాటంలో పడిపోతాం. అంత తీరికుండి ఏడుస్తుందా?" అంటూ గమ్మత్తుగా చేతులు తిప్పింది కిన్నెర.

"దాన్ని చేసుకోవడానికి రెడీగా వాళ్ళ బావ వున్నాడు కాబట్టి ఎప్పుడూ దానికి పెళ్ళి ధ్యాసే. అప్పుడే పెళ్ళయి పోయినట్టూ, పిల్లల్ని కనేసినట్టూ చూడండెలా మాట్లాడ్తోందో..." అంది లలిత ఉడికింపుగా.

కిన్నెర బుంగమూతి పెట్టి అంది, "ఏం నా ఒక్కదానికే వున్నాడా బావ? నీకూ వున్నాడుగా? నువ్వూ చేస్కోవచ్చుగా?"

"నాకున్నది బావకాదు. మావ. మా అమ్మ తమ్ముడు. కానీ అతన్ని చేస్కోవడం నా కిష్టంలేదు. అందుకే బైటి సంబంధాలు చూస్తు



న్నారు...'' చెప్పింది లలిత సిగ్గుతో కూడిన నవ్వు నవ్వుతూ.

''ఇదెక్కడి పెళ్ళిళ్ళగోలే బాబూ? ఇలా పరీక్షరాసి బైటికొచ్చారో లేదో మొదలెట్టేశారు. చూడబోతే మీ ఇద్దరికీ పెళ్లంటే మహా ఉబలాటంగా ఉన్నట్టుందే?'' ఇద్దర్నీ కలిపి ఉడికించింది రజిత.

మధులత కినుక్కున నవ్వింది.

''ఛీ పోవే...'' అంటూ రజితని ఓ నెట్టు నెట్టింది లలిత.

''దీన్నిబట్టి మీ ఇద్దరి భవిష్యత్ కార్యక్రమం పెళ్ళేనని తేలిపోతోంది... అంతేనా?'' మధులత అడిగింది.

''ఏం నువ్ పెళ్ళి చేస్కోవా?'' అంది కిన్నెర.

''అఫ్‌కోర్స్... కానీ ఇప్పుడప్పుడే కాదు. ముందు పీజీ చేస్తాను''

''నేనూ అంతే'' అంది రజిత.

''పీజీ చేసి ఏం వెరగబెడదామని? లెక్చరర్స్ అవుదామనా?'' అంది కిన్నెర.

''మేం ఏదో ఒకటవుతాంలే. నువ్ మాత్రం నెక్స్ట్ ఇయర్ ఈ పాటికల్లా తల్లి నవుతానంటావ్, అంతేగా?'' మధులత చిలిపిగా కన్నుగీటింది.

"ఛీ!" అంది కిన్నెర బిడియంగా.

అలా ఒకర్నొకరు వేళాకోళం చేసుకుంటూ ఓ పది నిముషాలక్కడే గడిపి, పరీక్షలు ముగిసిన సందర్భంగా మర్నాడు నలుగురూ కలిసి మాట్నీకి వెళ్ళాలన్న ప్రోగ్రాం వేస్కుని, అందరూ ముందుగా మధులత వాళ్ళింట్లో మీటై అట్నుంచటు వెళ్ళాలని డిసైడ్ చేస్కుని, ఆ మీదట గృహోన్ముఖులయ్యారు నలుగురూ.

ఎంతయినా స్టూడెంట్ లైఫ్ స్టూడెంట్ లైఫే! ఆ దశను దాటి ముందుకు సాగిపోయాక జీవితంలో ఎదురయ్యే బరువులూ, బాధ్యతలూ, సమస్యలే తప్ప... చీకూ చింతాలేని అలాంటి ఆహ్లాదకరమైన రోజులు తిరిగిరావు కదా?

నలుగురూ నాలుగు త్రోవలు పట్టినా... నలుగురి మనసుల్లోనూ ఏదో తెలియని భారం.

సూటిగా చెప్పాలంటే అదోరకం బాధ.



**ద**యాసాగర్‌తో కలిసి మూడు నెలల పాటు దర్జాగా బ్రాందీ షాపులో కూర్చోవడానికి అలవాటు పడిపోయాడేమో, ఖర్మగాలి మళ్ళీ పాత పద్ధతిలోనే చెత్త బస్తాలతో కుస్తీ పట్టాల్సొచ్చేసరికి 'ఛీ! ఎందుకొచ్చిన బతుకిది.. వెధవ బతుకు' అనిపించసాగింది సాంబడికి.

వుండు మీద కారంలా నారయ్య కొట్టిన దెబ్బొకటి.

సరిగ్గా వాకబు చేయకుండా వాడి మానాన్న వాడ్నొదిలేసినందుకు సాంబడ్ని తిట్టిన తిట్టు తిరిగి తిట్టకుండా తిట్టిపోశాడు రాయుడు.

దాంతో ఈ బాధలన్నీ లేకుండా చినబాబుతో మళ్ళీ వేరే షాపేదయినా పెట్టించి, తను మళ్ళీ అసిస్టెంట్‌గా చేరిపోతేనో? అన్న దురాలోచనొకటి తలెత్తింది వాడి మెదళ్ళో.

కానీ అదంత సులభసాధ్యం కాదని తెలుసు.

పెద్దయ్యగారి ముందు ఆ మాటెత్తితే నాలుక చీరేసినా ఆశ్చర్యం లేదు.

అందువల్ల అమ్మగారి సైడు నుండి నరుక్కురావాలనుకున్నాడు సాంబడు.

అఖిలాండేశ్వరి ఒంటరిగావున్న సమయం చూసి ఆమె చెవిలో వేశాడు ఓ మాట.

"పెద్దయ్యగారు చినబాబుగార్ని మరీ పనికిమాలినోడి కింద లెక్కగట్టేస్తున్నారమ్మగారూ! ఒకసారంటే అనుభవం లేక దెబ్బతిన్నారు గానీ, మళ్ళీ మళ్ళీ అలాగే ఎందుకు జరుగుద్ది? ఈసారి నేను దగ్గరుండి ఎవరికీ అరువులివ్వకుండా కాపాడుకుంటాను. కాబట్టి చినబాబుతో మళ్ళీ వేరే వ్యాపారం ఏదయినా పెట్టిస్తే మంచిది" అన్నాడు చేతులు పిసుక్కుంటూ.

"మంచి ఆలోచనే" అంది అఖిలాండేశ్వరి.

"అవునమ్మగారూ... చినబాబుగారు రేపో మాపో పెళ్ళవ్వాల్సినోరు. ఈ వయసులో ఖాళీగా కూచుంటే ఎలా చెప్పండి? అసమర్థుడనుకుంటాది లోకం. ఎంతాస్తున్నా ఏ వ్యాపకమూ లేనోడికి పిల్లనెవరిస్తారమ్మా? చినబాబుగారికేమో పెద్దయ్యగారి చెత్త వ్యాపారమంటే బొత్తిగా ఇష్టం లేదాయె. అందుకని..." అంటూ ఎక్కబొడిచాడు ఆమె అనుకూలంగానే మాట్లాడ్డంతో.

వాడు చెప్పిందంతా సబబుగానే అనిపించింది అఖిలాండేశ్వరికి.

నిజమే కదా? ఏదోకటి పెట్టించి వాడి కాళ్ళ మీద వాడు నిలబడేట్టు చేయకపోతే లోకం కొరగాని వాడివే అంటుంది కదా?

"సరేలేరా... రేపు నేను మీ పెద్దయ్యగారితో మాట్లాడ్తాలేరా!" అందామె.

"పెద్దయ్యగారికి చినబాబుగారంటే చాలా లోకువ. కాబట్టి మీరు గట్టిగా చెప్పండమ్మగారూ! అవసరమైతే మీ పుట్టింటోళ్ళిచ్చిన అయిదెకరాల మామిడితోట అమ్మేసైనా సరే..." అమ్మగారు సరేననడంతో హుషారుపుట్టి ఆ హుషారులో హద్దు మీరేశాడు సాంబడు.

ఏ ధ్యాసలో వుందో అఖిలాండేశ్వరి అదేం పట్టించుకోలేదు. "అలాగే లేరా" అనేసింది. పైగా "అవును... నా పుట్టింటోళ్ళిచ్చిన అయిదె కరాల మామిడితోటుండగా వాడికేం లోటు?" అని కూడా అంది. ఆఫ్టరాల్ ఒక నౌకరు, తనని తన పుట్టింటోళ్ళిచ్చిన ఆస్తిని అమ్మమని సలహా చెప్తాడా? అన్న ఆలోచనగానీ, కోపంగానీ రాలేదామెకు. అసలాలోచనే రానపుడు, ఇహ కోపమొచ్చే ప్రసక్తేముంది?

వాడితో అన్నట్టుగానే ఆ మర్నాడుదయం టిఫిన్లు తింటూండగా రాయుడివద్ద ఆ విషయం కదిపిందామె.

సాంబడన్నట్టే అంది, "ఒకసారంటే ఏదో తెలీక బోల్తా పడ్డాడు. పద్దాకా అలాగే ఎందుకవు తుందీ? కాబట్టి మన దయాసాగర్‌తో మళ్ళీ ఏదన్నా వ్యాపారం పెట్టించండీ"

ఆమె ఇలా మాట పూర్తి చేసిందో లేదో టిఫిన్ పళ్ళాన్ని ఎత్తి కుదేసి గయ్ఁమంటూ లేచాడు రాయుడు.

దయాసాగరపుడు సీన్‌లోనే వున్నాడు.

"ఎట్టెట్టా? ఈ ఆలోచన నీకే పుట్టిందా? లేక ఈ వెధవకి పుట్టిందా? ఒకటి కాదు రెండు కాదు.... మూడు లక్షలు... మూడు లక్షలార్పేశా డు వెధవ. ఇంత జరిగాక కూడా మళ్ళీ వాడితో వ్యాపారం అన్న మాటెత్తడానికి నీకు సిగ్గెలా లేకపోయిందే?" అంటూ వెర్రి గంతులేశాడు రాయుడు.

"వాడి మాటెత్తితే చాలు ఒంటి కాలి మీద లేస్తారు మీరు. పొరపాట్లు పదే పదే చేస్తారా ఎవరైనా?" అంటూ గుర్రుగా చూసింది అఖి లాండేశ్వరి.

"చెయ్యరు... ఎవరైనా అయితే చెయ్యరు. కానీ ఈ పనికిమాలిన బడుద్ధాయ్ మాత్రం చేస్తాడు. చేసి తీర్తాడు. మంచి తనానికీ వెర్రి బాగుల్తనానికీ తేడా తెలీని వెర్రివెధవ. వాడి మీద నీకింకా ఏమన్నా నమ్మకముందేమో గాని... నాకు మాత్రం చీమతలకాయంత కూడా లేదు. చేసిన నిర్వాకం చాల్లేగానీ ఇహ చేతులు ముడుచుక్కూర్చోమను. నేనున్నంత కాలం ఇలా సాగిపోనీ... ఆ తర్వాత వాడేం చేస్కుంటా డో వాడిష్టం..." అన్నాడు రాయుడు ఖండి తంగా.

"చేతులు ముడుచుక్కూర్చోవలసిన ఖర్మ వాడికేమిటండీ? అవసరమైతే మా పుట్టిం..."

"చంపేస్తా, ఆ మాటగాని పూర్తి చేశావంటే. ప్రతిదానికీ వత్తాసుపలుకుతూ ఇప్పటికి వాడిని చెడగొట్టింది చాలు..." ఆగ్రహోదగ్రు డవుతూ అరిచాడు రాయుడు. పనికిమాలిన సన్నాసి... పనికిమాలిన సన్నాసి... చెడబుట్టా డు నా కడుపున..."

రుసరుసా చూసింది అఖిలాండేశ్వరి.

దయాసాగర్‌కి కడుపులో చెయ్యి పెట్టి పేగు ల్ని బైటికి లాగుతున్నంత బాధగా అని పించింది తండ్రి అలా అంటుంటే.

ఎవరూ తననర్థం చేస్కోరెందుకని? మంచిగా వుండటం తప్పా? ఎదుటివ్యక్తిని చూసి జాలి పడటం తప్పా? తనలో జాలి ఓ పిసరు ఎక్కువే కావచ్చు... కానీ అంతకు మించి తానేం తప్పుడు పనులు చేయడం లేదే? మరెందుకు తననిలా పనికిమాలిన వాడిగా జమకట్టడం? నిజంగా నిజంగా తను పనికిమాలిన వాడేనా?

అలా అంగీకరించడానికి అతని మనసు సుతరామూ ఒప్పుకోలేదు.

తనసుతాను అప్రయోజకుడిగా గుర్తించడా నికి ఎవరి మనసు మాత్రం అంగీకరిస్తుంది?

"ఈసారి అలాగేం జరగదులెండి. సాంబ డు దగ్గరుండి ఎవరికీ అరువులివ్వకుండా జాగ్రత్తగా కనిపెట్టుకుంటానన్నాడు..." తనకు తెలియకుండానే నోరు జారేసింది అఖిలాండే శ్వరి.

రాయుడి భృకుటి ముడివడింది.

"అయితే ఇదంతా నూరిపోసింది ఆ వెధవే నన్న మాట!? రేయ్ సాంబడూ! రేయ్... ఎక్క డున్నావ్‌రా?" అరిచాడు గట్టిగా.

వరండాలో పాత సీసాల గుట్టముందు కూర్చుని పెద్ద ఎన్నా సార్టింగ్‌వర్క్ చేస్తున్న సాంబడు ఆ పనొదిలేసి, "అఁయఁ" అంటూ వచ్చాడు లోపలికి.

"చినబాబుతో మళ్ళీ వ్యాపారం పెట్టిస్తే ఈసారి అరువు లివ్వకుండా నువ్ జాగ్రత్తగా కనిపెట్టుకుంటానన్నావటగా?"

వాడి గుండెలో బాంబు పేలింది.

'ఎంత పనిచేశారమ్మగారూ? నా పేరెందుకు

చెప్పేరమ్మగారూ?' అన్నట్టు అఖిలాండేశ్వరి వైపు దీనంగా చూశాడు.

"అటు చూస్తావేంట్రా? అడుగుతున్నది నేను. నాకు చెప్పు సమాధానం..." గదిమాడు రాయుడు.

దాంతో తప్పించుకోవడానికిహ మార్గం లేక పోయింది సాంబడికి.

అవునన్నట్టు నిలువుగా బుర్రాడించాడు.

అంతే!

రాయుడు కల్లు తాగిన కోతైపోయాడు.

"అంత జ్ఞానమున్నవాడివే అయితే బ్రాందీ షాపుకి మంటబెట్టి నపుడేమైందిరా నీ తెలివి? అప్పుడెలా చూస్తూ వూరుకున్నావురా?" అంటూ మొదలెట్టి... ఆ మీదట సభ్యతా సంస్కారాలకు తిలోదకాలలిచ్చేసి బండబూతుల్లోకి దిగిపోయాడు.

సాంబడు కిమ్మనకుండా వాటన్నిట్నీ సహిస్తూ నిలబడితే చూస్తూ వూరుకోలేకపోయాడు దయాసాగర్.

బ్రాందీషాపు ఆరిపోవడానికి ముఖ్య కారకుడు తను. జాలి గుండెగలిగిన యజమానిగా తానరువులిచ్చేస్తుంటే, ఆఫ్టరాల్ ఓ నౌకరు, సాంబడేం చేయగలడు? అక్కడికీ వాడి తప్పేమీ లేకుండా వాడు వారిస్తూనే వచ్చాడు, "వొద్దు చినబాబూ ఇలా అందరికీ అరువులిస్తూ కూర్చుంటే మొదటికే మోసం వొస్తుందని". కానీ తనే వాడి మాటల్ని వినిపించుకోలేదు.

తన తప్పిదానికి వాడు బండబూతులు కాయడం ఏమిటి? అన్యాయం... అన్యాయం... ఇది చాలా అన్యాయం, అంటూ ఆక్రోశించింది దయాసాగర్ మనసు.

దాంతో లోలోన భయపడుతూనే పెదవి విప్పాడతను "ఎందుకు నాన్నా! అనవసరంగా వాడి మీద కేకలేస్తావ్? వైన్ షాపు మూతబడిపోవడానికి కారణం నేను. తిడితే నన్ను తిట్టండి. అంతేగాని వాడినంటావేం?"

దయాసాగర్ మాటలకి సహజంగానే రాయుడికోపం అతని మీదకు మళ్ళింది.

"నిన్ను తిట్టడం కాదురా! చేసిన అప్రాచ్యపు పనికి ఇంటి నుండి వెళ్ళగొట్టినా తప్పులేదు. తగుదునమ్మా అంటూ ఇంకా ఎదురు మాట్లాడ్తున్నావా? మూడు లక్షలంటే మజాకా అనుకుంటున్నావా? ఏ నాడైనా నీ సొంత తెలివితేటల్తో ఒక రూపాయి సంపాదించుంటే తెలిసుండేది డబ్బు విలువేంటో! ఛీ! నీ మొహం చూస్తేనే చీదరపుడ్తోంది. ఫో అవతలకి..."

తండ్రి అంత కరుగ్గా మాట్లాడడం... దయాసాగర్‌కి అమితంగా బాధ కలిగించింది. అతని ముఖం ఇపుడు కొత్తగా వచ్చిన గుండ్రటి పది పైసల నాణెంకన్నా చిన్నగా అయిపోయింది.

అవధులు లేని మంచితనం వున్నంత మాత్రాన్న ఆత్మాభిమానం లేకుండా వుంటుందా?

ఇరిటేట్ అయిపోయాడు.

"మీరు పొమ్మంటే అలాగే పోతాను... అంతే గానీ నా తప్పుకి వాణ్ణి మాత్రం తిట్టబాకండి" అన్నాడు రోషంగా.

ఓయబ్బో పౌరుషానికేం తక్కువ లేదు మొహానికి. ఈ ఇల్లు విడిచి బైటికెళ్తే నువ్ దమ్మిడీకి పనికొస్తావుట్రా?"

అసలే గాయపడున్న మనసు తండ్రి చేసిన ఎద్దేవాతో మరింతగా గాయపడింది.

"అయితే మీ అండ లేకుండా నేను బతకలేననుకుంటున్నారా? బతకగలను. బతికి చూపిస్తాను" అన్నాడు ఉద్రేకంగా.

"అంత చేతనయిన వాడివైతే తక్షణం వెళ్ళిపో 'ఈ ఇంట్లోంచి..." గుడ్డొచ్చి పిల్లని వెక్కిరిస్తే మండదామరి? ఆ మంట కొద్దీ కొడుకు ఉద్రేకానికేం తీసిపోని స్థాయిలో తనూ ఉద్రిక్తుడవుతూ అరిచాడు రాయుడు.

ఎంత మంచి వాడికైనా వయసులో వున్నపుడు వేడి రక్తమే ఉంటుంది.

తండ్రి తీసి తుంగలో తొక్కినట్టు అంతమాటనేసరికి సహించలేకపోయాడు దయాసాగర్.

"ఓ యస్. అలాగే... ఇప్పుడే వెళ్ళి పోతా నీ ఇంట్లోంచి..." అంటూ దిగ్గున లేచాడు.

"బాబూ!" అంది గాభరాగా అఖిలాండేశ్వరి.

"నువ్ నోర్ముయ్... చేతగాని వెధవకి కూడా చెట్టంత పౌరుషం. వెళ్ళనీ ఎక్కడికి వెళ్తాడో..."

అన్నాడు కోపంగా రాయుడు.

అఖిలాండేశ్వరికి ఉన్నట్టుండి వెయ్యేనుగుల బలం వచ్చింది. అందుక్కారణం ఆమె పుట్టింటోళ్ళిచ్చిన అయిదెకరాల మామిడితోట.

"ఎక్కడికో పోవాల్సిన అవసరం వాడికేంటండీ? మీకు లేకపోయినా నాకుంది వాడి మీద నమ్మకం. వాడితో నేను పెట్టిస్తా నింకో వ్యాపారం, అవసరమైతే..." అంటూ ఏదో అనబోయింది.

ఏదో ఏముంది... ఏనాడూ పాడే పాటే!

"...చప్ నోర్ముయ్..." మధ్యలోనే అడ్డు తగుల్తూ ఉరిమాడు రాయుడు. "మన సంపాదన తీస్కెళ్ళి గంగలో కలపడం కాదు. చేతనైతే స్వశక్తితో ఓ ముప్ఫైవేలు సంపాయించమను నీ పుత్రరత్నాన్ని చూద్దాం. మూడు నెలల్లో మూడు లక్షలు మంటగలిపాడు. మూడు కాదు దానికి రెండు రెట్లు టైమిస్తాను. ఓ 'ముప్ఫైవేలు సంపాదించమను చూద్దాం ఆరు నెలల్లో. అప్పుడంగీకరిస్తాను వీడూ ఒక మనిషేననీ, వీడూ ఒక సమర్థుడేననీ..."

మనిషినిగాక నేను పశువునా? అనుకున్నాడు దయాసాగర్ ఉడికిపోతూ. చూపిస్తా నా ప్రయోజకత్వం ఏమిటో అని కూడా అనుకున్నాడు ఆవేశంగా.

"నువ్వూరుకోమ్మా... నాకెవరి సహాయమూ వొద్దు. నా స్వశక్తితోనే నా కాళ్ళమీద నేను నిలబడతాను. ఆరు నెలల్లో ముప్ఫైవేలు సంపాదించడమే కదా ఆయనక్కావలసింది? పట్టుదలుంటే ఏమైనా సాధించొచ్చు. నన్నాపకు... నన్ను వెళ్ళనీ" అన్నాడు సిన్సియర్‌గా.

"కబుర్లు చెప్పడం కాదు" అంటూ నవ్వేడు రాయుడు.

దాంతో దయాసాగర్ ఇంక ఆగలేక పోయాడు.

ఎలాగైనా సరే తన సమర్థతని నిరూపించుకోవాలన్న గట్టి నిర్ణయానికొచ్చేసి, తల్లి కాళ్ళకీ వేళ్ళకీ అడ్డుపడుతున్నాసరే లెక్కచేయకుండా అప్పటికప్పుడే తన సూట్‌కేస్ సర్దుకోవడం ప్రారంభించాడు.

అఖిలాండేశ్వరి రాయుడి మీద విరుచుకుపడింది.

రాయుడు అఖిలాండేశ్వరి మీద విరుచుకుపడ్డాడు.

కొడుకును వారించమని అఖిలాండేశ్వరి... పోతే పోనీ అంటూ రాయుడు... విరుచుకుపడుతూనే అరుచుకోసాగారు ఒకరి మీద ఒకరు.

తన బోడి సలహా ఇంత విపరీతానికి దారితీస్తుందని ఊహించని సాంబడు బితుకుబితుకు చూస్తూ ఇంకా అక్కడే నిలబడివుండిపోయాడు.

ఈలోగా దయాసాగర్ సూట్‌కేస్ సర్దడం పూర్తయ్యింది.

"నువ్ వెళ్ళడానికి వీల్లేదు" అంటూ గుమ్మానికడ్డంగా నిలబడింది అఖిలాండేశ్వరి.

"వొద్దమ్మా... నన్నాపకు..." అన్నాడు దయాసాగర్ హీరోలా.

రాయుడికీ కొడుకుని ఆపాలనే అనిపించింది. ఎంతయినా పితృహృదయం. ఆ వాత్సల్యం ఎక్కడికి పోతుంది? అయినా ఆ ప్రయత్నం మాత్రం చేయలేదాయన.

కొడుకు ఇప్పటికయినా కళ్ళు తెరిచి జీవితమంటే ఏమిటో తెలుసుకోవడానికి తెలుసుకోగలగడానికి ఇదో అవకాశమేమో అనిపించిందాయనకి.

ఎక్కడికి పోగలడు? ఎన్నాళ్ళుండగలడు? నాలుగు రోజులు అష్టకష్టాలూ పడితే అప్పటికయినా తెలిసొస్తుంది వాడికి డబ్బు విలువేమిటో. ఈ సమాజంలో బతకాల్సిన విధానమేమిటో.

"ఒరేయ్ ఆగరా" అనే మాట నాలుక చివరిదాకా వచ్చినా కూడా బలిమిన దిగమింగేసుకున్నాడాయన.

"ఒద్దు చినబాబుగారూ... అమ్మగారి మాటినండి బాబూ..." సాంబడు చూస్తూ వూర్కోలేక పెదవి విప్పాడు.

"రేయ్ నువ్వెళ్ళి నీ పని చూస్కోఫో..." సాంబడ్ని కసిరాడు రాయుడు.

అయినా వాడు పోలేదక్కడినించి. ఈ పరిస్థితికి ఒకరకంగా కారకుడు తనే. అందుకే వాడికి కదలడానికి కాళ్ళు రాలేదు.

దయాసాగర్ మరేం ఫర్వాలేదన్నట్టు వాడికి కళ్ళతోనే సైగచేసి-

"అడ్డు తప్పుకోమ్మా... నన్ను వెళ్ళనీ" అన్నా

డు తల్లితో.

ఆమె సజల నేత్రాలతో చూసింది.

"నాకేం భయం లేదులే అమ్మా! ప్రపంచంలో అందరూ చెత్తే అమ్ముకుని బతుకుతున్నారా?" అన్నాడు దయాసాగర్.

ఆ మాట అతనే ఉద్దేశంతో అన్నా నిజానికదే అతను చేసిన పొరపాటు.

అతనా మాటగనక అనకపోయుంటే రాయుడు ఓ మెట్టు దిగొచ్చి కొడుకుని వారించి వుండేవాడేమో?

కానీ ఎప్పుడైతే అతనలా అన్నాడో ఆ వెంటనే రాయుడి మనసు తాత్కాలికంగా బండబారిపోయింది.

"నువ్ తప్పుకోవే... ఏ పాటి వెళ్తాడో వెళ్లనీ చూద్దాం" అంటూ భార్యని ఇవతలకి లాగేడాయన.

ఆవేశంలోవున్న దయాసాగర్ ఆ అవకాశాన్ని మిస్ చేసుకోలేదు.

చేతిలో సూట్‌కేస్‌తో సహా చటుక్కున గడప దాటేశాడు. వెనుదిరిగి చూడకుండా విసవిసా కాంపౌండ్ గేటు వైపు అడుగులు వేశాడు.

"బాబూ" అంటూ పరుగు తీయబోయిన అఖిలాండేశ్వరిని జబ్బపట్టి ఆపేశాడు రాయుడు. "చినబాబుగారూ" అంటూ వరండా మీద గ్గొంతిన సాంబడ్ని ఉద్దేశించి "చంపుతా నొరేయ్" అంటూ అరిచాడు.

భయం కొద్దీ కాకపోయినా సాంబడు అక్కడే ఆగిపోయాడు. ఎందుకంటే అప్పటికే దయాసాగర్ ప్రహరీగేటు దాటి రోడ్డు మీదకు వెళ్ళిపోయాడు.

ఉడుకులెత్తిన యువరక్తం ఆ సమయాన దయాసాగర్‌ని అంత సాహసానికి పురిగొల్పింది.

తనకున్న అతిమంచితనం అనే ఏకైక బలహీనత వల్ల ముందుముందు బాహ్యప్రపంచంలో తానెన్ని ఇబ్బందుల్ని ఎదుర్కోవలసి వస్తుందో ఆ క్షణాన్న అతనూహించలేకపోయాడు.

దయాసాగర్ వెళ్ళిపోయాక అఖిలాండేశ్వరి నానా రగడా చేసింది ఇంట్లో. "మీరు మనిషి కాదు. మీకు మనసు లేదు" అంటూ నిందించింది రాయుడ్ని.

"వాడెక్కడికి పోతాడే? ఈ బెట్టు మీద మహా అయితే ఓ రెండు మూడు రోజులు ఫ్రెండ్స్ దగ్గర కాలం గడుపుతాడు. వూళ్ళో వాడి క్లాస్‌మేట్స్ వున్నారుగా? ఎవరింట్లోనో వుంటాడు. వేడి తగ్గాక తప్పుతెలుసుకుని వాడే తిరిగొస్తాడు" అనేశాడు తేలిగ్గా రాయుడు.

దయాసాగర్ కృతనిశ్చయంతో వెళ్ళాడని ఆయనకేం తెలుసు?

★ ★ ★

ఎటు పోవడమా, ఏం చేయడమా? అని ఆలోచిస్తూ బస్టాప్‌లో నిలబడ్డాడు దయాసాగర్.

తనకున్న ముఖ్య స్నేహితుల లిస్టు ఓసారి మనసులో మననం చేసుకున్నాడు.

ఈ పరిస్థితిలో తనని ఆదుకోగలిగేది ఎవరు?

ఒకింత ఆసరాగా నిలవగలిగేది ఎవరు?

రఘురాం, గణేష్, ప్రదీప్, చెన్నకేశవులు, నిరంజన్, నిరంజన్.

యస్ నిరంజన్ ఈజ్ ది బెస్ట్ ఛాయిస్.

మిగతా వాళ్ళతో పోలిస్తే వాడితో తనకున్న స్నేహమూ ఎక్కువే... గతంలో తను వాడికెంతో సహాయం చేసివున్నాడు కాబట్టి వాడు తననాదుకునే అవకాశమూ ఎక్కువే.

అదీగాక వాడి మెదడు పాదరసం లాంటిది.

ఈ సిట్యుయేషన్‌లో తానేం చేస్తే తండ్రితో తను చేసిన ఛాలెంజ్‌ని ఎదుర్కోగలుగుతాడో, వాడయితేనే తగిన సలహా ఇవ్వగలడు. హి ఈజ్ సో బ్రిల్లియంట్ చాప్.

ఆమధ్య వేరే ఇంట్లోకి మారినట్టు చెప్పాడు.

కొత్త ఇంటి అడ్రస్ తెలియదు.

కానీ బ్యాంకుకి వెళ్తే దొరుకుతాడుగా?

"బాబూ!"

ఎవరిదో పిలుపు వినిపించడంతో ఆలోచనల్లోంచి ఇవతలికొచ్చాడు దయాసాగర్.

రెండు చేతుల్లో రెండు పెద్దపెద్ద మూటల్తో ఓ వృద్ధుడు ముడతలు పడిన ముఖం, వొంగిపోయిన నడుము, దారిద్ర్యాన్ని చాటుతోన్న దుస్తులు, కళ్ళు చికిలించిన విధానాన్ని బట్టి

పాపం చూపు సరిగ్గా ఆనదని తెలుస్తూనే వుంది.

"ఏంటి తాతా? ఏం కావాలి?!" అన్నాడు దయాసాగర్ దయనిండిన స్వరంతో.

"రోడ్డు దాటాలి బాబూ..." అర్థింపుగా చూశాడు వృద్ధుడు.

దయాసాగర్ ఓసారి రోడ్డుకేసి చూశాడు.

వాహనాల రద్దీ అధికంగావుంది. తన లాంటి యువకులే ఎంతో జాగ్రత్త వహిస్తేనే తప్ప సవ్యంగా అవతలకి చేరుకోవడం కష్టం.

అలాంటిది పాపం ఈ ముసలాయన... అందునా రెండు చేతుల్లోనూ ఆ మూటలతో...

"అలాగే తాతా! నేను దాటిస్తాలే" అనేశాడు దయాసాగర్ ఇంకేం ఆలోచించకుండా.

'మా నాయనే' అని పైకయితే అనలేదు గానీ... అన్నట్టుగానే కళ్ళలో కృతజ్ఞతను మెరిపిస్తూ చూశాడు ఆ వృద్ధుడు.

దయాసాగర్ మనసులో ఏదో తృప్తిలాంటి భావన.

వెంటనే తన సూట్‌కేస్‌ని బస్టాప్‌లో వున్న సిమెంట్ బెంచీ మీదపెట్టి, ఆ వృద్ధుడి చేతుల్లోంచి మూటల్ని తీసుకొని ఓ చంకలో ఇరికించుకుని, ఓ చేతిని వృద్ధిడి భుజం మీద వేసి, నెమ్మదిగా నడిపించుకుంటూ తీస్కెళ్ళి అతగాడ్ని అవతలవైపుకు చేర్చాడు.

అదే బస్టాప్‌లో తన ఫ్రెండ్‌తో నిలబడి వున్న లలిత ఆ దృశ్యాన్ని చాలా ఆసక్తికరంగా చూసింది.

విసుక్కోకుండా గుణుక్కోకుండా అవతారం దరిద్రంగా వుందని అసహ్యించుకోకుండా, భుజంమీద చేయివేసి మరీ ఈ యువకుడు ఆ తాతని రోడ్డు దాటించాడూ అంటే... "రియల్లీ హి ఈజ్ ఎ వెరీ వెరీ గుడ్‌బోయ్" అనిపించిందామెకు.

ఎదుటివ్యక్తి నెత్తిమీద తేలున్నా చూస్తూ ఊరుకునే రకమే ఎక్కువ ఈ రోజుల్లో. ముఖ్యంగా యువకుల్లో అలాంటి మెంటాలిటీ మరీ ఎక్కువ.

అలాంటిది ఈ మనిషిలో ఎంత హెల్పింగ్ నేచరు?

పక్కనున్న కిన్నెరతో ఆమాటే అంది లలిత- "అతనెవరోగాని పాపం మంచి బాలుడు సోమూలా వున్నాడు కదే?" అని.

కిన్నెర ఏమీ కామెంట్ చేయలేదుగాని... రజిత అందుకుంటూ అంది "ఎందుకూ? ఆ ముసలాడ్ని రోడ్డు దాటించాడనా? అదేమంత ఘనకార్యమని?"

"అదేవిటే అలా అంటావ్?" అంది లలిత ఆశ్చర్యంగా.

"అదంతే! అతను మన ముగ్గుర్నీ చూసుంటాడు. మన దృష్టిలో ఓ హీరో అయిపోవాలని ఆ ముసలాడికిలా సాయం చేసుంటాడు..."

"ఛ... ఊరుకోవే పాపం. అతనేదో ఆలోచిస్తూ నిలబడ్డాడే తప్ప... అసలు మనకేసి కన్నెత్తయినా చూళ్ళేదు..."

"అయితే ఇందాకట్నుంచి నువ్ అతన్నే గమనిస్తూ నించున్నావా ఏంటి? కొంపదీసి నీకళ్ళకి నవమన్మధుడిలా అనిపించాడా ఏంటి?" ఉరకలేసే వయసులో ప్రతీది చిలిపిమాటలకే దారితీస్తుంది. స్నేహితురాల్ని ఉడికిస్తూ అంది రజిత.

"ఛీ! ఏం పాడు మాటలవి? తన్నమన్నావా ఏం?" లలిత చిరుకోపంగా చెయ్యెత్తింది.

అంతలో సాగదీసి ఒదిలిన రబ్బరు ముక్కలా సర్రున ఇటుకేసి దూసుకొచ్చి లలితకు డాషిచ్చి... "సారీ అండీ... అయామ్ వెరీవెరీ సారీ" అంటూనే స్పీడ్ మాత్రం తగ్గించకుండా కుడివైపుగా సాగిపోయాడు దయాసాగర్.

అలా ఎందుకు జరిగిందో, ఉన్నట్టుండి అతనలా ఎందుకు పరుగుతీశాడో ఎవ్వరికీ అర్థంకాలేదు.

"స్కౌండ్రల్" అంది రజిత పళ్ళు కొరుకుతూ. అతను ఇన్‌టెన్షనల్‌గానే లలితకు డాష్ ఇచ్చాడని ఆమె అభిప్రాయపడింది. "బుద్ధిమంతుడని పొగిడేవ్‌గా... చూడేంచేశాడో?" అన్నట్టుగా చూసింది లలితవైపు.

అయితే లలిత ఈ ధ్యానలో లేదు.

ఆమె చూపు దయాసాగర్ పరుగు తీసిన వైపే వుంది.

"రేయ్ ఆగరా... రేయ్ ఆగరా... దొంగ... దొంగ... నా సూట్‌కేసు ... నా సూట్..."

దయాసాగర్ అరుపులు వీళ్ళునించున్న

చేటుక్కూడా విన్పిస్తూనే వున్నాయ్.

దయాసాగర్‌కి ఒకింత ముందుగా చేతిలో సూట్‌కేస్‌తో పరుగుతీస్తూ ఓ పన్నెండు పద మూడేళ్ళ కుర్రాడు.

విషయం బోధపడింది స్నేహితురాళ్ళు ముగ్గురికీ.

"అరె... సూట్‌కేసిక్కడే పెట్టేడుగా? మన కళ్ళు గప్పి ఆ దొంగా దెప్పుడెత్తుకుపోయా డో?!!" అంది కిన్నెర బుగ్గలు నొక్కుకుంటూ.

"పుణ్యానికి పోతే పాపం ఎదురవ్వడం అంటే ఇదే. ఆ ముసలాడికి సాయం చేయ బోయి పాపం తన సూట్‌కేస్ పోగొట్టుకున్నా డు..." -ఈ మాటా కిన్నెరే అంది.

'మరే' అన్నట్టు తలాడించింది లలిత.

ఆమె చూపులింకా అటుకేసే వున్నాయి.

మలుపుల్లేకుండా స్ట్రెయిట్‌గా వున్న రోడ్డు కావడంవల్ల పరుగెత్తుతూన్న దయాసాగర్ ఇంకా కనిపిస్తూనే వున్నాడు.

రజిత కూడా అటువైపు చూస్తూ వుంది.

అంతలో దయాసాగర్ అదృష్టం బాగుండ టంవల్ల జరిగిందో, లేక సూట్‌కేస్ కాజేయబో యిన ఆ కుర్రాడి అదృష్టం బాగోకపోవడంవల్ల జరిగిందోగాని... మొత్తానికి కాలికి రాయేదో అడ్డుపడ్డంవల్ల సూట్‌కేస్‌తో ఆ కుర్రాడు బోర్లా పడ్డం జరిగింది.

దాంతో దయాసాగర్ తన వేగాన్ని మరికాస్త పెంచి వాడ్ని అంది పుచ్చుకున్నాడు. వాడి చేతిలోంచి తన సూట్‌కేస్‌ని లాక్కున్నాడు.

"తప్పైపోయింది... ఇంకెప్పుడూ దొంగ తనం చేయను... నన్నొదిలేయండి బాబూ..." అని ఏడుస్తూ దండంపెట్టాడా కుర్రాడు.

'పాపం' అనిపించింది దయాసాగర్‌కి.

కానీ నేనొకణ్ణున్నానంటూ అప్పుడే అక్కడికి దూసుకొచ్చిన ఓ కానిస్టేబుల్‌కి మాత్రం అని పించలేదిలా.

"ఏం జరిగింది సార్?" అని దయాసాగర్‌ని అడుగుతూనే లాఠీతో ఆ కుర్రాడి డొక్కలో ఓ పోటు పొడిచాడు.

పాపం స్టేషన్‌కి తీస్కెళ్ళి మెత్తగా చితగ్గొట్టా దేమోననిపించి... "అబ్బే ఏం లేదు లెండి..." అనేశాడు దయాసాగర్. పాపం పసికుంక ఏదో తెలియక చేశాడు అన్న జాలి.

"ఏం లేదంటారేంటండీ... నేనంతా చూశా ను. ఏరా వేలెడంతలేవుగాని సూట్‌కేస్‌లు దొంగతనం చేస్తావుట్రా?" అంటూ ఆ కుర్రాడి డొక్కలో మరో లాఠీపోటు పొడిచాడు కానిస్టేబు లు.

"అబ్బా..." అన్నాడు వాడు బాధగా.

"పోన్లే పాపం వొదిలేయండి సార్... నా సూట్‌కేస్ నాకు దొరికిందిగా..." జాలిగా అన్నా డు దయాసాగర్.

అతనీ మాటలంటుండగా- ఏం జరుగు తుందో చూద్దాం అన్నా కుతూహలంతో లలితా అండ్ బృందం అక్కడికి నడుచుకుంటూ వచ్చేశారు.

"మీరెవరమ్మా?" అన్నట్టుగా చూశాడు కాని స్టేబుల్ వాళ్ళకేసి. ఈ సూట్‌కేస్ ఈయన్దే నండీ... అసలేం జరిగిందంటే..." అని మొద లెట్టి తాము చూసిందంతా చెప్పింది రజిత.

అలాగా అన్నట్టు తల పంకించి... "అమ్మ నా కొడకా!" అంటూ ముచ్చటగా మూడోపోటు పొడిచాడు కానిస్టేబుల్ ఆ కుర్రాడి డొక్కలో.

"అమ్మా..." అంటూ బాధగా మూలిగాడు కుర్రాడు.

దయాసాగర్ ప్రాణం గిజగిజలాడిపో యింది.

వెధవ రాయి కాలికడ్డం తగలకపోయినా బావుండేది. అందుకేగా పాపం వీడు తనకి దొరికిపోత? అంతలావు లాఠీతో డొక్కలో అలా పొడుస్తుంటే నెప్పెట్టదూ పాపం?

"పోన్లే సార్... చిన్న కుర్రాడు... వదిలే యండి పాపం..." అంటూ అర్థింపుగా చూశా డు దయాసాగర్.

దొంగతనం జరిగిందని స్పష్టంగా తెలు స్తూంటే వదిలేయమంటే ఎలాగండీ బాబూ? ఇలాంటి వెధవలమీద జాలిపడి వదిలేస్తే, తొండముదిరి వూసరవెల్లయినట్టు వీళ్ళే రేప్పొ ద్దున్న కేడీ నాయాళ్ళై కూర్చుంటారు"... అంటూనే ఆ కుర్రాడివైపు చూపు మరల్చి, ప్రచురణార్హం కాని ఓ బూతు తిట్టి, మరో దెబ్బ వేయడానికి చేతిలోని లాఠీని పైకెత్తాడు కానిస్టే బుల్.

"సార్‌సార్ ప్లీజ్..." అంటూ పైకి లేచిన ఆ లాఠీని తన చేత్తో పట్టుకున్నాడు దయాసాగర్.

లలితకు విస్మయంగా అనిపించింది. తన సూట్‌కేస్ కాజేయబోయిన దొంగని కొడు తుంటే ఇతగాడిలా లబలబ లాడుతున్నాడే మిటీ?!

కిన్నెరా, రజితలు కూడా కించిదాశ్చ ర్యంగానే చూశారు దయాసాగర్‌వైపు.

"ఏదో పసివాడు... తెలిసో తెలియకో చేశా డు... వాడ్ని చావగొడితే ఏమొస్తుంది చె ప్పండి..." బ్రతిమాలుతూ అన్నాడు దయాసా గర్. "అయినా నా సూట్‌కేస్ పోలేదు గదా..."

"దొరికింది కాబట్టి పోలేదంటున్నారు. ఒక వేళ దొరక్కపోయుంటే?"

'అలా జరిగినా బాగుండిపోను' అనుకున్నా డు దయాసాగర్ ఆ కుర్రాడికేసి జాలిగా చూస్తూ.

దయాసాగర్ ఏమీ మాట్లాడకపోవడంతో మళ్ళీ కానిస్టేబులే అన్నాడు.

"స్టేషనుకొచ్చి రిపోర్టూ అదీ ఇవ్వాల్సొచ్చు ద్దని కంగారు పడుతున్నారేమో... ఫర్వాలేదు మీదారిన మీరు వెళ్ళండి. వీడి సంగతి నేను చూసుకుంటాను..."

"అబ్బే అలా అని కాదండీ... పసివాడు కదాని..."

"పసోడైతే పసిబుద్ధులుండాలి. అంతేగాని ఇవ్వేం పనులూ... ఇలాంటి/ఎదవలమీదజాలి తల్చడం మహాపాపం. మీకెందుకు, మీరెళ్ళ ండి..." అంటూ ముఖం వినుగ్గా పెట్టాడు కానిస్టేబుల్.

అతని బాధ అతన్ది. అందర్నీ అక్కడ్నించి పంపించేశాక ఆ కుర్రసన్నాసి జేబులో ఏవన్నా డబ్బులుంటే లాక్కోవొచ్చు కదాని ఆశ!

దయాసాగర్‌కి అప్పటివరకూ పోలీసుల్తో ప్ర త్యక్షానుభవం అంటూ ఏదీ లేదుగాని.., మిగ తా శాఖల వాళ్ళకన్నా ఆ శాఖ వాళ్ళకి లంచం వాననంటే మహా ఇష్టమని మాత్రం తెలుసు.

కానీ అక్కడే ఆఫర్ చేయడానికి ఎదురుగా ఎవరో ముగ్గురమ్మాయి లుండడంవల్ల బావుండదని చెప్పి-"అలా పక్కకొస్తారా? చిన్న మాట..." అన్నాడు కానిస్టేబుల్‌తో.

"రండి..." అంటూ ఆ కుర్రాడ్నీడ్చు కుంటూనే ఓ పక్కకి దారితీశాడు కానిస్టేబులు. దయాసాగర్ అతన్ని వెన్నంటి వెళ్ళాడు.

"ఊఁ... చెప్పండి" అన్నాడు కానిస్టేబులు. ఆ కుర్రాడి జుట్టింకా అతని పిడికిల్లోనే వుంది.

"నాకెందుకో ఈ కుర్రాడిమీద జాలిగా వుంది సార్. దయచేసి వీడ్నొదిలేయండి. ఇది గో ఇదుంచండి..." అంటూ జేబులోంచి ఓ ఇరవై కాగితాన్ని బైటికి తీసి, దాన్ని కానిస్టే బుల్ చేతిలో కుక్కేడు దయాసాగర్.

'ఇదెక్కడి వెర్రిరా బాబూ?' అనిపించింది కానిస్టేబుల్‌కి.

"సర్లెండి సార్... మీరింతగా చెవుతున్నారు కాబట్టి వదిలేస్తున్నా" అని, వాడి జుట్టొదిలిపె ట్టి, "పోరా పో. ఈ అయ్యగారి దయవల్ల బైటపడ్డావు. ఇంకెప్పుడూ దొంగ పనులు చె య్యబాకిలా..." అంటూ గద్దించాడు.

'అలాగే' అన్నట్టు తలూపి, దయాసాగర్ వైపు తిరిగి చేతులు జోడించి, ఆ మీదట పరుగు లంకించుకున్నాడు దొంగ కుర్రాడు.

కానిస్టేబుల్ అట్నుండటే పోగా సూట్‌కేస్‌తో వెనుదిరిగిన దయాసాగర్, ఆ ముగ్గురమ్మాయి లూ ఇంకా అక్కడే నిలబడి వుండటంచూసి చకచకా వారి దగ్గరికొచ్చాడు.

"సారీ అండీ. ఇందాక మీకు డాష్ ఇచ్చి నందుకు అయామ్ రియల్లీ సారీ... సూట్‌కేస్ పోతోందన్న కంగారులో చూస్కోకుండా గుద్దేశా ను..." అన్నాడు కిన్నెరతో.

రజిత కిసుక్కున నవ్వింది.

దయాసాగర్ తెల్లబోయి చూశాడు.

మరేం లేదు లెండి... ఇందాక మీరు గు ద్దింది నన్ను. దాన్ని కాదు. ఫర్వాలేదులేగానీ ఆ కానిస్టేబుల్‌కేం మంత్రం వేశారేంటి?- ఆ కుర్రాడ్నొదిలేశాడు?" అంది లలిత.

"నేను గుద్దింది మిమ్మల్నా... అయితే సారీ అండీ... మీకు సారీ అండీ" అన్నాడు దయా సాగర్.

"అది సర్లే గాని... నా ప్రశ్నకి సమాధానం చెప్పేరు కాదు?" అంది లలిత ఉబికి రాబో యిన నవ్వు నాపుకుంటూ.

"అదాండీ... అదీ... అదీ మరేం లేదు. ఓ ట్వెంటీ రూపీస్ అతనికి లంచం ఇచ్చాను. ఆ

కుర్రాడు మరీ చిన్నాడు కదండీ. వాడ్ని సేవ్ చేయడంకోసం తప్పేనని తెలిసికూడా ఆ పని చేయాల్సొచ్చింది...'' బిడియంగా చెప్పాడు దయాసాగర్.

''వాడికోసం మీ డబ్బెందుకండీ వొదుల్చుక వడం?''

''పాపం చిన్న కుర్రాడు. వాణ్ణలా కొడ్తుంటే చూళ్ళేకపోయాను. అయామ్‌సారీ అండీ... అదే ఇందాక మిమ్మల్ని గుద్దినందుకు...''

''ఎన్నిసార్లు చెబతారండీ బాబూ?'' అంటూ నవ్వింది లలిత.

''వస్తానండీ...'' అంటూ వెళ్ళిపోయాడు దయాసాగర్.

''మనిషి చాలా దయార్ద్రస్వభావుడిలా వున్నాడు'' అంది లలిత అతను వెళ్ళిపో యాక.

''కాదు... క్రాక్ మాస్టర్ జనరల్‌లా వున్నాడు. లేకపోతే ఓ దొంగ వెధవ కోసం అతను లంచం ఇవ్వడం ఏమిటీ?'' అంది రజిత, స్నేహితు రాలి కాంప్లిమెంట్‌ని ఖండిస్తూ.

''అబ్బ! అతని గొడవ మనకెందుకులేవే. మనకి టైమ్ కావస్తోంది. అవతల మధులత మనకోసం వెయిట్ చేస్తూంటుంది. పదండి ఏదన్నా ఆటోలో పోదాం'' అంటూ విసుక్కొంది కిన్నెర.

వాళ్ళు వెళ్ళబోతోంది మ్యాట్నీకి.

అందరూ కలిసి మధులత వాళ్ళ ఇంట్లో మీటవ్వాలని ముందుగా అనుకున్నారు.

కిన్నెర ఇంకా చాలా టైముండగానే లలిత వాళ్ళ ఇంటికొచ్చింది- ఇల్లు దగ్గరే కాబట్టి ఎలాగూ టైముంది కదా పద రజిత వాళ్ళింటి కెళ్ళి దాన్ని కూడా పికప్ చేసుకుందాం' అంది లలిత, ఇద్దరూ వెళ్ళి రజితని కూడా లాక్కొని బైటికొచ్చి బస్‌కోసం వెయిట్‌చేస్తుండగా ఇదిగో ఈ సంఘటన జరిగింది.

''ఏయ్ ఆటో...''

ఓ ఖాళీ ఆటో అటుగా వెళ్తూంటే చప్పట్లు కొట్టి పిలిచింది కిన్నెర.

ఆటో వాళ్ళ ముందాగింది.

అప్పటికి దయాసాగరింకా బస్టాప్‌లో బస్ కోసం వెయిట్‌చేస్తూనే వున్నాడు.



నిరంజన్‌కోసం ఆ బ్యాంకుకెళ్ళిన దయాసా గర్‌కి అతనారోజు సి.యల్ పెట్టాడని తెలి సింది.

ఇంటి అడ్రస్ అడిగి తెలుసుకుని ఇంటికి వెళ్ళాడు.

అదృష్టవశాత్తూ ఇతను వెళ్ళేసరికి ఇంట్లోనే వున్నాడు నిరంజన్.

''ఏంట్రా ఇలా వచ్చేవ్? రా... రా! అరెం చేతిలో ఆ సూట్‌కేసేంటీ? ఎక్కడికయినా వెళ్తు న్నావా, లేక ఎక్కడ్నించైనా వొస్తున్నావా?'' దయాసాగర్ వెళ్ళేసరికి మంచంలో పడుకుని వున్న నిరంజన్, మిత్రుణ్ణి చూస్తూనే లేచి కూర్చుని ఆప్యాయంగా ఆహ్వానించాడు.

''ఎక్కడికీ వెళ్ళడం లేదు. ఎక్కణ్ణించీ రావ డమూ లేదు. మీ ఇంటికే వచ్చాను...'' అంటూ చొరవగా మంచంమీదే నిరంజన్ పక్కన కూర్చుంటూ ''ముందు కాస్త చల్లటి మంచినీళ్ళి ప్పించు'' అన్నాడు దయాసాగర్.

''వరం...'' అంటూ లోపలెక్కడో వున్న భార్య వరలక్ష్మి నుద్దేశించి పిలిచాడు నిరంజన్.

కొద్దిక్షణాల్లో ''పిలిచారా?'' అంటూ ఆమె ఆ హాల్లోకి వచ్చింది.

''పిలవన్దే ఎలా వినిపిస్తుందేంటీ?'' అని చిన్నపాటి జోకు లాంటిది వేసి-

''వీడు దయాసాగర్ అని చెప్పి నా క్లాస్‌మే టూ కమ్ బెస్ట్ ఫ్రెండు... మన పెళ్ళికొచ్చేడు. చూసే వుంటావు గానీ గుర్తుండుండదు...'' అంటూ దయాసాగర్‌ని ఆమెకి పరిచయం చేశాడు.

"నమస్తే" అంటూ చేతులు జోడించిందామె.

"నమస్తే" అంటూ ప్రతినమస్కారం చేశాడు దయాసాగర్.

"నా భార్య..." చెప్పాడు నిరంజన్.

తెలుసులే అన్నట్టు తలూపాడు దయాసాగర్.

"అన్నట్టు మంచినీళ్ళడిగేవ్ కదూ?" అంటూ వరలక్ష్మివైపు తిరిగి చూపుల్తోనే ఆమెకా పని పురమాయించాడు నిరంజన్.

వరలక్ష్మి లోపలికి వెళ్ళి ఫ్రిజ్‌లోంచి చల్లటి నీళ్ళు తెచ్చి దయాసాగర్ కందించింది.

"థాంక్స్..." అంటూ గ్లాసందుకున్నాడు దయాసాగర్.

దయాసాగర్ నీళ్ళు తాగి స్థిమితపడ్డాక- "ఊఁ... ఇప్పుడు చెప్పు. ఏంటిలా సూట్‌కేస్‌తో ఊడిపడ్డావ్? అన్నట్టు మేం ఇల్లు మారేక నువ్ ఇదే కదా రావడం; అడ్రెసెలా తెలిసిందీ?" అని అడిగాడు నిరంజన్.

"మీ బ్యాంక్‌కెళ్ళి ఎంక్వయిరీ చేసి తెలుసుకున్నాను" -మొదటి ప్రశ్నకు సమాధానం దాటేసి, రెండో దానికి మాత్రమే జవాబిచ్చాడు దయాసాగర్.

నిరంజన్ అంతకుముందు వేరే ఇంట్లో వున్నప్పుడు ఏదో చిన్న పనిమీద దయాసాగర్ ఆ ఇంటికెళ్ళడం జరిగింది. అయితే అప్పుడు వరలక్ష్మి ఇంట్లోలేదు. పుట్టింటికి కాబోలు వెళ్ళింది.

ఆ తర్వాత దయాసాగర్ నిరంజన్ ఇంటికంటూ రావడం ఇదే. బయటెక్కడైనా కలుసుకుని కూడా చాలా కాలమైంది. ఇంచుమించు రెండు నెలలు.

"అలాగా?" అంటూ తలూపి, "ఊఁ... చెప్పు" అన్నాడు నిరంజన్.

"అయ్ వాంట్ యువర్ హెల్ప్..." దయాసాగర్ బిడియంగా అన్నాడు.

"విత్ ప్లెజర్. నేను చేయగలిగిందీ, నా చేతిలో వున్నదీ ఏమైనా సరే చేస్తాను. ఇట్స్ ఏన్ ఆపర్చ్యూనిటీ ఫర్ మీ. ఇలాగైనా నీ రుణం కొద్దిగా తీర్చుకోగలిగే సదవకాశం లభించిందనుకుంటాను..." అన్నాడు నిరంజన్ మనస్ఫూర్తిగా.

డిగ్రీ చదివే రోజుల్లో దయాసాగర్ నిరంజన్‌కి చేసిన ఉపకారాలు ఒకటీ రెండూ కావు.

ఇప్పుడంటే ఉద్యోగం వొచ్చి అన్నివిధాలా కంఫర్టబుల్‌గా బ్రతుకుతున్నాడుగాని, చదువుకునే రోజుల్లో నిరంజన్ పాపం చాలా పేద విద్యార్థి. తండ్రి చిన్నతనంలోనే పోవడంవల్ల అతగాడి చదువంతా తల్లి రెక్కలకష్టంమీదే సాగింది. నిజం చెప్పాలీ అంటే ఆమె రెక్కాడితేనే తప్ప ఆ తల్లీకొడుకుల డొక్కలాడని పరిస్థితి. అయినా సరే ఒక్కగానొక్క కొడుకు భవిష్యత్తు దృష్ట్యా ఎన్నో కష్టాల కోర్చి అతగాడ్ని డిగ్రీదాకా చదివించిందామె.

పరిస్థితి అలాంటిది కాబట్టే విద్యార్థిదశలో ఫీజులూ అవీ సకాలానికి కట్టలేక తరుచుగా ఇబ్బంది పడ్తూండేవాడు నిరంజన్. అయితే దయాసాగర్‌తో స్నేహం పెరిగాక అతనికలాంటి అవస్థలన్నీ తప్పిపోయాయి.

ఎప్పటికప్పుడు అవసరం అడిగి తెలుసుకుని మరీ సహాయం చేస్తుండేవాడు దయాసాగర్.

మొహమాటానికి వద్దన్నా చివరికా సహాయాన్ని స్వీకరించక తప్పేది కాదు నిరంజన్‌కి.

"నీ చదువు పూర్తై, నువ్వేదైనా ఉద్యోగంలో చేరేక నా బాకీ అణాపైసల్తోసహా తీర్చేద్దువుగాన్లే" అని నచ్చజెబుతుండేవాడు దయాసాగర్ నిరంజన్‌కి డబ్బిచ్చినపుడల్లా.

అయితే నిరంజన్‌కి ఉద్యోగం వచ్చాక ఇతను తీర్చిందీ లేదు అతను అడిగిందీ లేదు.

అయినా నిజంగా తీర్చడానికి దయాసాగర్ ఇతగాడికిచ్చింది బాకీ అయితే కదా?

కొన్నికొన్ని రుణాలు డబ్బు రూపంలో తీర్చేసినంత మాత్రాన్న తీరిపోవు. అలాంటిదే ఇదీను.

"మరీ అంత పెద్దపెద్ద మాటలెందుకు లేరా?" అంటూ సిగ్గుగా తల దించుకున్నాడు దయాసాగర్.

"పెద్దపెద్ద మాటలేమున్నాయ్? ఇట్స్ ఫాక్ట్. సర్లే సర్లే ఇంతకీ నీకు కావలసిందేంటో చెప్పు..."

"ఎలా చెప్పాలో తోచడంలేదురా... అంతా విని నువ్ సిల్లీగా కొట్టిపారేస్తావేమో?!"

''నెవ్వర్! నువ్వేం చెప్పినా నేనర్థంచేసుకోగ ల్గుతాను. అలాంటి ఫీలింగేం పెట్టుకోవద్దు...''

మిత్రుడలా అభయం ఇచ్చిన మీదట, బిడియాన్ని ప్రక్కకునెట్టి తన పరిస్థితంతా సావధానంగా వివరించి చెప్పాడు దయాసాగర్. ''నువ్వేమనుకుంటున్నావో ఏమో నాకు తెలియదు. బట్ నేను మాత్రం ఓ స్థిర నిశ్చయంతో ఇంట్లోంచి బైటకొచ్చేశాను. మా నాన్నతో నేనూ ఒక ప్రయోజకుడ్నే అని అనిపించుకోవాలి. ఎట్‌లీస్ట్ ఆయన పెట్టిన ఆ గడువు లోపల ఆయన చెప్పిన ఆ ముప్పైవేల న్నా సంపాదించి నన్ను నేను ప్రూవ్ చేసుకోవాలి. అంతవరకూ ఎన్ని అవాంతరాలొచ్చినా సరే నేను తిరిగి మా ఇంటి గడప తొక్కకపోవడం మాత్రం ఖాయం!'' అన్నాడు చివర్లో.

నిరంజన్ నవ్వబోయాడుగాని మిత్రుడెక్కడ హర్ట్ అవుతాడోనన్న భయంతో ఆగిపోయాడు.

''సో అదన్నమాట సంగతి. సరే... ఏ సమస్యకైనా ఓ పరిష్కారం వుండే తీర్తుంది. నీ సమస్యను ఎలా సాల్వ్‌చేయడమా అన్నది నెమ్మదిగా ఆలోచిద్దాం. ప్రస్తుతానికి నువ్వేం వర్రీ కావొద్దు. మేడమీద ఓ గది ఖాళీగా వుంది. ఇది నీ ఇల్లే అనుకుని నువ్ అందులో నిమ్మాదీగా వుండచ్చు...'' అంటూ దయాసాగర్ వెన్నుతడ్తూ అతని భుజంమీద ఆప్యాయంగా చెయ్యివేశాడు నిరంజన్.

''థాంక్స్ రా... వెరీవెరీ థాంక్స్...'' అన్నాడు దయాసాగర్.

''చాల్లేరా ఊర్కో. నీకూ నాకు మధ్య థాంక్సేంటి నా బొంద. ఇది నీ ఇల్లే అనుకో. ఏ విషయంలోనూ సిగ్గుపడబాకు'' అనేశాడు నిరంజన్ తేలిగ్గా.

''నువ్వు వీక్లీ తిరగేస్తూండు... నే నిప్పుడే వస్తాను'' అంటూ దయాసాగర్ చేతికేదో వీక్లీ అందించి, లేచి లోపలికి వెళ్ళాడు నిరంజన్.

భార్యకు విషయం వివరించి... ''ఇదీ సంగతి. కాబట్టి ఇకనుంచి కొన్నాళ్ళపాటు వాడు మనింట్లోనే వుంటాడు'' అన్నాడు నిరంజన్.

వరలక్ష్మి చాలా అవగాహనగలమనిషి. ముఖ్యంగా అన్ని విషయాల్లోనూ భర్తకు అనుకూలంగా ప్రవర్తించే మనిషి.

''ఆఁ నేను వింటూనే వున్నాను. అలాగే కానీండి... మీ ఇష్టం'' అందామె, మరేవంకా పెట్టకుండా.

గతంలో భర్తపట్ల దయాసాగర్ ఔదార్యం గురించి ఆమెకూ తెలుసు. అంటే నిరంజనే చెప్పున్నాడామెకు ఏదో మాటల సందర్భంలో. అందువల్ల ఇలాంటి పరిస్థితిలో దయాసాగర్ని తమకు చేతనైన రీతిలో ఆదుకోవడం భావ్యమేనని అనిపించింది ఆమెక్కూడా.

''సరే మన మేడమీద రూమ్ క్లీన్‌చేయ్. మడతమంచం అక్కడే వుందిగా? దానికి తోడు ఓ టేబులూ కుర్చీ వేస్తే సరిపోతుంది'' అన్నాడు నిరంజన్.

''అలాగే... ముందు అన్నయ్యగార్ని భోజనానికి లేవమనండి...'' అంది వరలక్ష్మి.

''టైమ్ మూడు దాటుతోంటే ఇప్పుడేం భోజనం?''

''భలేవారే... ఆయన పొద్దున్నెప్పుడో గొడవపడి ఇంట్లోంచి బైటికొచ్చినట్టున్నారు. ఈ గొడవలోపడి భోంచేశారో లేదో... ఓ మాట అడిగి చూడండి...''

భార్య సలహామేరకు నిరంజన్ తిరిగి హాల్లో కొచ్చి ''లేరా... భోంచేద్దువుగాని... ముందు బాత్‌రూంలోకెళ్ళి కాళ్లూ చేతులూ కడుక్కో'' అన్నాడు దయాసాగర్‌తో.

''ఇప్పుడేం భోజనంరా!'' అంటూ మొహమాటంగా చూశాడు దయాసాగర్.

వరలక్ష్మి ఊహించింది నిజమే.

భావి కార్యక్రమం ఏమిటా అన్న ఆలోచనలోపడి అతనిప్పటిదాకా భోజనం మాటే మర్చిపోయాడు.

మిత్రుడు గుర్తు చేసేసరికి కడుపులో ఎలుకలు పరుగెత్తినట్టుగా అనిపించింది గాని... ఆ సమయంలో భోజనానికి లేవడానికి బిడియం అడ్డొచ్చింది.

ముఖకవళికల్నిబట్టి మిత్రుడి పరిస్థితే మిటో గ్రహించగలగాడు నిరంజన్. ''అంతా రెడీగానే వుంది. మొహమాటంతో కడుపు మాడ్చుకోవడం మంచిది కాదు లే...'' అంటూ దయాసాగర్ని లేవదీసి, బలవంతాన్న అతన్ని డైనింగ్ టేబుల్ దగ్గరికి లాక్కెళ్ళాడు.

ఆత్మారాముడు శాంతించాక ప్రాణం

ఒకింత కుదుటపడ్డట్టుగా అనిపించింది దయాసాగర్‌కి.

ఇతగాడు భోంచేస్తూండగా మేడ మీద గదిలో మంచం వాల్చి తగిన ఏర్పాట్లు చేసొచ్చాడు నిరంజన్.

"వెళ్ళి కాసేపు రెస్ట్ తీసుకో. సాయంత్రం మిగతా విషయాలు మాట్లాడుకుందాం" అన్నాడు భోజనం ముగించిన దయాసాగర్‌తో అతనికి టవలందిస్తూ.

నిరంజన్ దారి చూపుతూండగా దయాసాగర్ మేడమీద గదివైపు అడుగులేశాడు.

గాలీ వెలుతురూ ధారాళంగా వస్తూ, చిన్నదే అయినా చాలా ముచ్చటగా కన్వీనియంట్‌గా వుంది రూము.

"ఎలావుంది రూము?"

"బాగుంది..." అన్నాడు దయాసాగర్ పొడిగా.

"సరే కాసేపు రెస్ట్ తీసుకో..." అని చెప్పి, మరి కాసేపు ఏవో రెండు ముక్కలు మాట్లాడి ఆ తర్వాత క్రిందకు వెళ్ళిపోయాడు నిరంజన్.

"లీవ్ ఎందుకు పెట్టినట్టూ?" అనడిగితే- "ఏం లేదు... ఊర్కే రెస్ట్ తీసుకుందామని పించి పెట్టేశా... సీయల్స్ అన్నీ అలాగే వున్నాయ్ అందుకని పెట్టేశా. అప్పుడప్పుడూ నాకిది అలవాటేలే" అంటూ నవ్వేశాడు నిరంజన్.... వెళ్ళబోయే ముందు.

మంచం మీద నడుంవాల్చి ఆలోచనలోపడ్డాడు దయాసాగర్.

అనుకోకుండా ఏదో కల్లో జరిగినట్టుగా జరిగిపోయిందంతా. ఆవేశంలో ఆలోచనా రహితంగా ఛాలెంజ్ చేసి వచ్చేశాడు తను.

తన పంతం నెగ్గించుకోగలుగుతాడా?

ఏమో... దేనికయినా కాలం కలిసి రావాలంటారు.

తన విషయంలో ఎలా జరుగుతుందో మరి?

నిరంజన్ అండ దొరికింది కాబట్టి భవిష్యత్తు మరీ అగమ్యగోచరంగా అనిపించలేదు గాని మొత్తానికి దయాసాగర్ మనసంతా ఆందోళనతో నిండిపోయింది.

★ ★ ★

దయాసాగర్ ఇల్లు విడిచి ఇరవై నాలుగ్గంటలు దాటిపోవడంతో అఖిలాండేశ్వరిలోని ఆరాటం అధికమైపోయింది.

తల్లి ప్రాణం తల్లడిల్లిపోతుంటే కన్నీళ్ళతో భర్తని సతాయించడం ప్రారంభించింది.

"ఎవర్నయినా పంపించి ఎక్కడున్నాడో వెతికించి ఇంటికి తీసుకురండని" ఒకటేపోరు.

బలవంతాన్న ఈడ్చుకు రావడానికి వాడేవన్నా చిన్న పిల్లాడా? రేపోమాపో తప్పు తెలుసుకుని వాడే వచ్చేస్తాళ్ళే" అంటూ రాయుడు తన బింకం మీద తానుండిపోయాడు.

దాంతో ఇహ ఈయన్తో లాభంలేదని, విధిలేక సాంబడ్ని ఆశ్రయించిందామె.

"రేయ్ సాంబా... వాడెక్కడున్నాడో ఏమో- నాకు చాలా బాధగా వుందిరా! అసలే ఆకలికి ఆగలేడు పిచ్చిసన్నాసి. వెళ్ళేటపుడు జేబులో ఎంతుందో ఏమో? పోనీ ఓ వెయ్యో అయి దొందలో రహస్యంగా జేబులో పెడదామా అంటే ఆ అవకాశమే చిక్కలేదు. నాయన్నాయనా... నీకు పుణ్యముంటుంది. వాడెక్కడున్నాడో కాస్త ఆరా తియ్యరా బాబూ..." అంటూ వాడి ముందు కన్నీళ్ళు నింపుకొంది.

"చినబాబుకి అంత అవస్థేం రాదులే అమ్మగారూ. ఊళ్ళో ఆయనకి స్నేహితులు ఎక్కువమందేవున్నారుగదా... ఎవరింటికో వెళ్ళే వుంటారు..." తనకు తోచిన విధంగా ఆమెనూరడించబోయాడు సాంబడు.

"ఏమోరా! అసలే వాడికి అభిమానం జాస్తి. ఎవరేదడిగినా కాదనకుండా ఇచ్చేయడమే గాని నోరు తెరిచి ఏనాడూ ఎవ్వర్నీ ఏదీ అడిగిన వాడు కాదు. అయినా స్నేహితులున్నా అవసరానికి ఆదుకుంటారన్న గ్యారంటీ ఏముంది? బాబ్బాబూ... పెద్దయ్యగారికి నేనేదో నర్ది చెబుతాలేగాని నువ్వా పని పక్కనపెట్టి వెళ్ళిరా బాబూ...." అంటూ కొంగుతో కళ్ళొత్తుకుంది.

అమ్మగారలా పదేపదే కన్నీళ్ళు పెట్టుకుంటుంటే చూడలేకపోయాడు సాంబడు.

"అలాగే అమ్మగారూ... ఇప్పుడే వెళ్తా..." అంటూ చేతిలోని ఇనపముక్కని అల్లంత దూరాన్న పడేలా గిరాటేసి కార్యోన్ముఖుడయ్యాడు. భుజం మీది కండువాని తలకు చుట్టుకుంటూ

అప్పటికప్పుడే బయలుదేరాడు, చినబాబుని అన్వేషించడంకోసం.

'ఎలాగైనా వాడు ఇంటికి తిరిగొచ్చేలా చూడు స్వామీ' అని మనసులోనే తన ఇష్టదైవాన్ని ప్రార్థించింది అఖిలాండేశ్వరి.

★ ★ ★

ఓ రెండు రోజులు గడిచిపోయాయి.

వేళకు తినడం మిగతా సమయమంతా పుస్తకాలతో కాలక్షేపం చేయడం. నిరంజన్ ఇంట్లోవున్నంత సేపూ, అంటే అతగాడు బ్యాంక్‌కి వెళ్ళకముందూ వెళ్ళొచ్చిన తర్వాత... అతన్తో కబుర్లాడుతూ గడిపేయడం...

ఇలా వృధాగా గడిచిపోయాయి ఆ రెండ్రోజులూ.

వరలక్ష్మి బాగా కలుపుగోలు మనిషి. మధ్య మధ్యలో ఆమె కూడా వచ్చి పలకరించి పోతుండేది. ఏవన్నా కావాలా అన్నయ్యగారూ, అదీ ఇదీ అంటూ.

"నా పరిస్థితేమిటీ?" అంటే, చూద్దాంలే... ఏదోకటి ఆలోచిద్దాం" అంటూ జరిపేశాడు నిరంజన్ ఆ రెండ్రోజులూ.

పరిగెత్తిపాలు తాగడం కన్నా నిలబడి నీళ్ళు తాగడమే మేలన్నది అతని ఉద్దేశం. అంతే తప్ప మిత్రుడి సమస్యను పరిష్కరించాలన్న ఆసక్తి లేక మాత్రం కాదు.

తొందర పడుతున్న దయాసాగర్‌తో కూడా ఆ మాటే అన్నాడతను. "నీకెందుకూ? ఏదోకటి బాగా ఆలోచించి నేను ప్లాన్ చేస్తాగా" అంటూ ధైర్యం చెప్పాడు.

"మీ బ్యాంక్ ద్వారా ఏదైనా లోన్ ఇప్పించకూడదూ... మళ్ళీ ఏదయినా వ్యాపారం చేస్తాను?" అని దయాసాగర్ అంటే, "చూద్దాంలే" అనేశాడు నిరంజన్.

బ్యాంక్‌లోన్ అంటే మాటలా? దానికి బోలెడంత తతంగముంటుందాయె. బోలెడన్ని ఫార్మాలిటీసు. ముఖ్యంగా సెక్యూరిటీ ఇచ్చేవాళ్ళుండాలి.

అదలా ఉంచితే, ముఖ్యంగా దయాసాగర్ వ్యాపారం చేసి రాణించగలడన్న నమ్మకం నిరంజన్‌కీ కలగలేదు.

దానికి తోడు తండ్రీ కొడుకుల మధ్య తగాదా ఎన్నాళ్ళుంటుందిలే, రేపోమాపో రాయుడుగారొచ్చి దయాసాగర్‌ని తీసుకెళ్ళిపోకుండా వుంటారా? అన్న ఆలోచనొకటి.

మూడోనాడు... దయాసాగర్ ముందు ఓ ప్రపోజల్ లేవదీశాడు నిరంజన్.

"నీకేదయినా లోన్ ఇప్పించే విషయం నెమ్మది మీద ఆలోచిస్తాను. తల్చుకోగానే జరిగిపోయే పని కాదది. ఎంత గట్టిగా ప్రయత్నించినా ఒకటి రెండు నెలలు పట్టక తప్పదు. ఈలోగా ఖాళీగా వుండటం దేనికి? నాకు తెలిసిన మెడికల్ షాపొకటివుంది. అందులో చేరు అందాక. అంటే సేల్స్ బోయ్‌గా అని కాదు నా ఉద్దేశం... అప్రంటిస్‌షిప్ అనుకో. కొన్నాళ్ళు అక్కడ పనిచేయడం వల్ల నీకా వ్యాపారంలోని మెళకువలు తెలుస్తాయి కదా? బాగుందీ, ఫర్వాలేదూ అనుకుంటే అప్పుడే దైనా లోన్ తీసుకుని నువ్వే సొంతంగా ఓ మెడికల్ షాపు పెట్టుకో వచ్చు... మందు వ్యాపారం ఎలాగూ నీ ఒంటికి అచ్చిరాలేదు. పోనీ మందుల వ్యాపారమైనా కలిసొస్తుందేమో చూద్దాం. ఏమంటావ్?" అన్నాడు.

ఖాళీగావుంటే ఆలోచనలు మెదడ్ని తినేస్తాయి. అంతకన్నా ప్రస్తుతానికి ఏదో ఒక వ్యాపకం వుండటం మంచిదేగా అనిపించి "సరే మాట్లాడు" అన్నాడు దయాసాగర్.

"మాట్లాడితే అతను కాదనేదేం వుండదు. శ్రీశైలం గారనీ, ఆ షాపు ఓనరు నాకు బాగా తెలిసిన వ్యక్తి. మా బ్యాంక్ ద్వారా నేనే అతనికి ఫైనాన్స్ ఇప్పించింది. కానీ ఎందుకయినా మంచిది, మళ్ళీ ఓసారి బాగా ఆలోచించుకో. తొందరపడి చేరిపోయి ఆ మీదట ఆ పని నచ్చక మళ్ళీ వెంటనే మానేయడం బాగుండదుకదా! కాబట్టి సాయంత్రందాకా ఆలోచించు..." అనేసి బ్యాంకుకి వెళ్ళిపోయాడు నిరంజన్.

ఇంత బతుకూ బతికి ఆఫ్టరాల్ ఓ సేల్స్‌బోయ్‌గా చేరడమా? అని అనిపించలేదు దయాసాగర్‌కి. పోస్ట్ అదే అయినా చేరేది కేవలం అనుభవం గడించడం కోసమే కాబట్టి అహాన్ని పక్కకునెట్టి ఎలాగోలా అడ్జస్ట్ అవ్వడమే మంచిదనిపించింది.

అతనలా ఆలోచిస్తుండగా... ఎలా వాకబు

చేశాడో, ఇల్లెలా కనుక్కోగలిగాడోకాని... "చినబాబుగారూ!" అంటూ అతని ముందు ప్రత్యక్షమయ్యాడు సాంబడు.

వాడ్ని చూసి ఆశ్చర్యపోయాడు దయాసాగర్.

"అరెం నువ్వా? నేనిక్కడున్నట్టు నీకెలా తెలిసింది? ఎలా కనుక్కోగలిగేవ్?"

"ప్రయత్నిస్తే సాధ్యం కానిదేముంటుంది చినబాబూ! రెండ్రోజుల్నుంచి ఇదే పనిగా వూరంతా గాలించి పారేశాను. మొత్తానికి దొరికారు అదే చాలు..." అంటూ ఆనందాన్ని వ్యక్తం చేసి "పదండి చినబాబుగారూ! మనింటికి పోదాం" అన్నాడు సాంబడు.

"నేను రాను..." అడ్డంగా తలాడించాడు దయాసాగర్.

"అలా అంటే ఎలా చినబాబూ? అవతల అమ్మగారు మీకోసం ఎంత బెంగెట్టుకున్నారో తెలుసా? వచ్చి మంచినీళ్ళయినా ముట్టట్లేదంటే నమ్మండి..." బుజ్జగించబోయాడు సాంబడు.

"నమ్ముతాను... కానీ నేను మాత్రం ఇప్పట్లో ఆ ఇంటికి రావటం జరగదు. ఆ రోజు నువ్వూ చూసేవుగా నాన్న ఎంత అవమానకరంగా మాట్లాడేడో..." అంటూ ఏదో చెప్పబోయాడు దయాసాగర్.

"పెద్దయ్యాగారి మాటలకేంట్లే చినబాబూ! అదెప్పుడూ వుండేదేగా, అయినా కోపంలో అలా అన్నారే తప్ప ఆయనకు మాత్రం మీ మీద ప్రేమలేకనా? పిచ్చినన్నాసి, ఎన్నవస్థలు పడుతున్నాడో ఏమో నంటూ మిమ్మల్ని ఎన్నిసార్లు గుర్తు చేసుకున్నారో తెలుసా? అమ్మగారైతే మిమ్మల్ని తల్చుకోని క్షణం లేదు..." దయాసాగర్ మాటలకి అడ్డు తగుల్తూ ఉన్నదానికి తన కల్పనా చాతుర్యంతో మరికొంత జోడించి చెప్పాడు సాంబడు.

"అమ్మతో నేనిక్కడ బాగానే వున్నానని చెప్పు. బెంగపెట్టుకోవద్దని చెప్పు..."

"అదెట్లా చినబాబూ! నేనా మాట చెప్పినంత మాత్రాన్న ఆవిడకడుపు నిండిపోతుందా? మిమ్మల్ని మళ్ళీ కళ్ళారా చూస్కోవాల అప్పుడు తీరాల బెంగ. అంతేగాని మాటలతో పోతాదా?"

"అంతగా నన్ను చూడాలనుకుంటే అమ్మనే ఇక్కడికి రమ్మను. అంతే తప్ప నేను మాత్రం ఇప్పట్లో ఆ ఇంటికొచ్చే ప్రసక్తే లేదు. వొచ్చి నాన్న దృష్టిలో ఎప్పటికీ ఓ అప్రయోజకుడిగా మిగిలిపోవడం నాకిష్టం లేదు. ఎలాగైనా సరే నేనా ముప్పైవేలూ సంపాదించాల్సిందే... సంపాదించి నాన్నతో శభాష్ అనిపించుకోవాల్సిందే. ఆరు నూరైనా నూరు ఆరైనా నా ఈ నిర్ణయం మారదు. మారదుగాక మారదు" స్థిరంగా పలికాడు దయాసాగర్.

"ఓస్ అంతేకదా?" అన్నాడు సాంబడు.

ఇదేవిటి వీడిలా అంటున్నాడు? కొంపదీసి సునాయాసంగా ముప్పైవేలు సంపాదించడానికి వీడి దగ్గరేమైనా చిట్కాగాని వుందా? అనిపించింది దయాసాగర్‌కి.

అంటే నిజంగానే అనిపించడం కాదు. జస్ట్ ఓ భావనా వీచిక లాంటిది... అంతే.

"అమ్మగారు మీకో మాట చెప్పమన్నారు..."

"ఏంటది?"

"మీరు గనక ఇంకా అదే పట్టుదల మీదుంటే, పెద్దయ్యాగారికి తెలీకుండా ఆరి పుట్టింటోళ్ళిచ్చిన అయిదెకరాల మామిడితోట తాకట్టుపెట్టి ఆ ముప్పైవేలూ మీకు పంపిస్తానన్నారు... మీరది తీస్కెళ్ళి పెద్దయ్యాగారికిచ్చి..."

సాంబడి మాట పూర్తికాక ముందే "చాల్లే ఆపు" అంటూ కోపంగా అరిచాడు దయాసాగర్.

"అంటే అలా చేసి నన్నింకా చేతగానివాడ్ని చేయాలనుకుంటోందా అమ్మ? ఓటమినైనా అంగీకరిస్తానేమోగాని మోసాన్ని మాత్రం అంగీకరించను. అందులోనూ కన్నతండ్రినా మోసగించడం?"

"ఇందులో మోసమేముంది చినబాబూ? అమ్మగారి డబ్బొకటీ, మీ డబ్బైతే ఒకటీనా?" నర్ది చెబుతున్న ధోరణిలో ఇంకా ఏదో అనబోయాడు సాంబడు.

"నో... నెవ్వర్" అంటూ అడ్డు తగిలాడు దయాసాగర్. "మాటంటే మాటే. ఇది నా ఆత్మగౌరవానికీ, పట్టుదలకీ సంబంధించిన విషయం. ఫాల్‌ప్లేకి నేనొప్పుకోను"

"ఫాల్ప్లే అంటే?" నిజంగానే అర్థం గాక అడిగాడు సాంబడు.

"వంచనతో కూడుకున్న ఆట. దొంగాట..."

"ఇంటికి రండిబాబూ అంటుంటే ఆటల గొడవ దేనికి చినబాబుగారూ? అన్నీ అవే సర్దుకుంటాయ్... మీకెందుకూ, మీ రొచ్చేసేయండి..."

"నాన్సెన్స్.. ఇంత జరిగాక సిగ్గు చంపుకుని ఎలా రమ్మంటావు రా? రావడం అంటూ జరిగితే విజేతగానే వస్తాను..."

"విజేతంటే?"

"నీబొంద... ఏదో ఒకట్లేగానీ నువ్వెళ్ళి నేను రానన్నానని చెప్పు అమ్మగారితో..." అన్నాడు దయాసాగర్ విసుగ్గా, రవంత కరుగ్గా.

సాంబడు అక్కడితో వదిలేయలేదు.

శతవిధాల ప్రాధేయపడ్డాడు. మీ కాళ్ళు పట్టుకుంటానన్నాడు. మీ చేతులు పట్టుకుంటానన్నాడు. మీ గడ్డం పట్టుకుంటానన్నాడు. బతిమాలడంలో తనకు తెలిసిన ఎన్ని రకాలున్నాయో అన్నీ ప్రయోగించి చూశాడు.

అయినా దయాసాగర్ దిగిరాలేదు.

ఈమధ్యలో జరుగుతున్నదేమిటో చూద్దామని వరలక్ష్మి ఓసారి ఆ గదిలోకి తొంగి చూడగా... "రండమ్మగారూ రండి... మీరైనా చెప్పండి మా చినబాబుగారికి" అంటూ ఆమెను లోనికి పిలిచి, ఆమెను కూడా రంగంలోకి దింపాడు సాంబడు.

"అఖిలాండేశ్వరి నిద్రాహారాలు మానేసిం"దని సాంబడు చెబుతుంటే పోనీ ఓసారి వెళ్ళి చూసి రారాదా?" అంటూ తనూ ఓ మాట వేసింది వరలక్ష్మి.

"ఏమ్మా? మూడు రోజులకే నేను మీకు భారంగా అనిపిస్తున్నానా?" కావాలనే నిష్ఠూరం ఆడేడు దయాసాగర్.

"ఛఛ... అదేం మాటన్నయ్యగారూ" అంటూ నొచ్చుకుంది వరలక్ష్మి.

"మరలాగైతే నన్ను మా ఇంటికి వెళ్ళమని ఫోర్స్ చేయొద్దు. అంతగా చూడాలని వుంటే మా అమ్మే ఇక్కడికొస్తుందంతే!" అన్నాడు దయాసాగర్.

"పోనీ మీ అమ్మగార్ని అలా చెయ్యమనవయ్యా..." అంది సాంబడితో. వరలక్ష్మి దయాసాగర్ని ఒప్పించడానికి మళ్ళీ ప్రయత్నించి మరో మారతన్ని నొప్పించడం ఆమెకిష్టం లేక పోయింది.

మా బాగా చెప్పేవు తల్లీ బోడి సలహా అనుకున్నాడు సాంబడు కసిగా మనసులో. అదోలా చూశాడు వరలక్ష్మికేసి.

ఆ చూపు రుచించక "మీరు మాట్లాడుతూండండి అన్నయ్యగారూ... నాకు పనుంది, నేను మళ్ళీ వస్తా" అనేసి అక్కడ్నించి వెళ్ళిపోయిందామె.

ఆ తర్వాత సాంబడు మరి కాసేపు గీజులాడేడు. కానీ దయాసాగర్ ఒక్క మెట్టు కూడా దిగి రాలేదు.

అప్పుడు తీశాడు సాంబడు తన అంగీ జేబులోంచి ఓ వెయ్యి రూపాయల కట్టని.

"పోనీ ఈ డబ్బయినా వుంచండి చినబాబుగారూ. మీరు కనిపిస్తే ఇమ్మని అమ్మగారిచ్చేరు..."

అందుకూ అంగీకరించలేదు దయాసాగర్.

"నేను సంపాదించబోయే ముప్పై వేలూ కేవలం నా స్వశక్తితోనే సంపాదిస్తాను తప్ప ఇలా అమ్మో, నాన్నో ఇచ్చే డబ్బు నర్దం పెట్టుకుని మాత్రం కాదు. ఆ డబ్బు నాకవసరంలేదు. తీస్కెళ్ళి అమ్మగారికిచ్చేయ్" అని తిరస్కరించేశాడు బ్లంట్గా.

అరగంట నుండి ఓపిక కరిగిపోయేలా బతిమాల్తూవున్నాడేమో, లోలోన ఒళ్ళు మండింది సాంబడికి చినబాబుగారి మీద.

'ఆఁ మీ మొహమే సంపాదించేది ముప్పై వేలు. ఈ జన్మలో సాధ్యం కాదది' అని గొణుక్కున్నాడు తన ఒక్కడికి మాత్రమే వినిపించేటంత నెమ్మదిగా.

"ఏంట్రా అంటున్నావూ?" నమ్మినబంటే అయినా సాంబడి వేపు అనుమానంగా చూశాడు దయాసాగర్.

"ఏం లేదులే బాబూ! ఎంత చెప్పినా వినిపించుకోనపుడు నేను మాత్రం ఏం చేయగల్ను? వస్తా చినబాబూ..." అంటూ అంతవరకూ దయాసాగర్ కాళ్ళ దగ్గర గొంతుక్కూర్చున్న వాడల్లా లేచి నిలబడ్డాడు సాంబడు.

"మంచిది" అన్నాడు దయాసాగర్.

"మీ మొహం" అనుకున్నాడు మనసులో సాంబడు.

★ ★ ★

"అంత మాటన్నాడా?... నేను బెంగపెట్టుకున్నానని నువ్ వాడికి సరిగ్గా చెప్పావా లేదా?" సాంబడి వేపు అనుమానంగా చూస్తూ బాధగా అడిగింది అఖిలాండేశ్వరి.

"చిలక్కిచెప్పినట్టు చెప్పేనమ్మగారూ. అసలు మీరు పచ్చిమంచి నీళ్ళు కూడా అంటుకోవడంలేదని చెప్పాను. అయినా వినిపించుకుంటేగా? అంతగా కావాలంటే మిమ్మల్నే రమ్మన్నారు. అంతేగాని ఆయన మాత్రం రారంట. పాపం ఆయమ్మగారు కూడా చెప్పి చూసింది. అయినా వినిపించుకోలేదు చినబాబు..." తన తప్పేమీ లేదని తేల్చేశాడు సాంబడు.

"ఏ అమ్మగారు?"

"అదేనండీ... చినబాబుగారి స్నేహితుడి భార్య..."

'అలాగా' అన్నట్టు తల పంకించి, ఓ రెండు క్షణాలాగి అడిగింది అఖిలాండేశ్వరి.

"ఇంతకీ ఎలా వున్నాడ్రా వాడు? మనిషేవన్నా చిక్కేడా?"

చినబాబు సమక్షంలో తను పడిన కంఠశోష గుర్తొచ్చి- "చిక్కడానికి ఆయనకేం రోగం, దుక్కలా వుంటేనూ?" అనాలనిపించింది సాంబడికి.

కానీ అంతలోనే తన నౌఖరు గిరీ గుర్తొచ్చి, అంతమాట అనలేకపోయాడు.

"బానే వున్నారమ్మా. మనింట్లోంచి వెళ్ళినప్పుడెలాగున్నారో అలాగే వున్నారు"

"రెండు రోజులకే ఏం చిక్కుతాడులే. మరో నాల్రోజులు పోతే దిగుల్తో పూచికపుల్లయిపోడూ?" అంది అఖిలాండేశ్వరి ఆవేదనగా.

"మరే" అన్నాడు సాంబడు.

అని వాడు వెళ్ళిపోయాక కొడుగ్గురించే ఆలోచిస్తూ దిగాలుగా కూర్చుంది అఖిలాండేశ్వరి.

ఆ కూర్చోవడం కూర్చోవడం పొద్దుగుంకే వరకూ అక్కడ్నించి లేవలేదామె.

ఇదిలా వుండగా, అక్కడ నిరంజన్ వాళ్ళింట్లో...

బ్యాంకు నుండి వచ్చిన నిరంజన్‌కి సాంబడు వచ్చి వెళ్ళిన విషయం చెప్పింది వరలక్ష్మి.

"నేననుకుంటూనే వున్నాను. ఇవ్వాళ రేపో వాళ్ళింటినుండి ఎవరో ఒకరు ఊడి పడతారని. అలాగే జరిగిందన్నమాట. ఇంతకీ వాడేమన్నాడూ?" అడిగాడు నిరంజన్.

"అన్నయ్యగారు మహాపట్టుదలగావున్నారు. రానుగాక రానని తెగేసి చెప్పేశారు. పాపం అతను చాలాసేపు బతిమాలి వెళ్ళిపోయాడు..." చెప్పింది వరలక్ష్మి.

స్నానం గట్రా ముగించి లుంగీలోకి మారేక, మేడమీది దయాసాగర్ గదిలోకి వెళ్ళాడు నిరంజన్.

కాసేపు ఆమాటా ఈ మాటా చెప్పాక "మీ ఇంటినుండి మీ నౌకరొచ్చేడటగా... మీ అమ్మగారికి బాగోలేదటగా?" అంటూ ఆ విషయం మళ్ళీ కదిపాడు.

"ఆఁ" అన్నాడు దయాసాగర్ ముఖం చిట్లిస్తూ.

"ఎంతయినా కన్నతల్లి కదరా... పాపం ఎంత బెంగ పెట్టుకుందో ఏమో! పోనీ ఒక్కసారి అలా వెళ్ళి ముఖం చూపించి వచ్చేయరాదూ?"

చురచురా చూస్తూ అంతకుముందు వరలక్ష్మీమీద ప్రయోగించిన బాణాన్నే తిరిగి ఇతనిమీద కూడా వదిలాడు దయాసాగర్.

"ఏం నీకు నేనిక్కడుండటం కష్టంగా వుందా?" అన్నాడు నిష్ఠూరంగా.

నిరంజన్ అర్థంచేసుకోగలిగాడు అతగాడి మనస్థితిని.

"నా సంగతి తెలిసుండికూడా కావాలనిగాక పోతే ఎందుకురా అలా నిష్ఠూరాలాడ్తావ్? ఒకసారి వెళ్ళిచూసి రమ్మన్నాను గాని నిన్నేం వెళ్ళిపోమనలేదుగా. కావాలంటే నడు, నేను కూడా వస్తాను నీతో. ఇద్దరం ఒకసారి కనిపించి, నువ్ నా దగ్గిర కులాసాగానే వుంటున్నావని చెప్తే మీ అమ్మ మనసు తృప్తిపడుతుంది. నా మాటిను..." అన్నాడు బుజ్జగింపుగా.

"నీ మాట ఏ విషయంలోనైనా వింటాను గాని ఈ విషయంలో మాత్రం కాదు. ఇపుడు

గనక నేను నా బింకాన్ని తగ్గించుకుని ఆ ఇంటి గడప గనక తొక్కేనంటే మా నాన్న దృష్టిలో మరీ చులకనైపోతాను. అది నాకెంత మాత్రం ఇష్టంలేదు'' అనేశాడు దయాసాగర్ నిర్ద్వంద్వంగా.

ఒత్తిడి చేస్తే నొచ్చుకుంటాడేమోనని నిరంజన్ మరేం అన్లేకపోయాడు.

అసలు తానే రాయుడింటికి వెళ్ళి దయాసాగర్ మా ఇంట్లో క్షేమంగానే వున్నాడని చెప్పివద్దామా అనుకున్నాడు నిరంజన్ బ్యాంకు నుండి ఇంటికి బయలుదేరేముందు.

కానీ దయాసాగర్ ఈ ఇంటికి వచ్చిన్నాడే చెప్పాడా విషయం... ''నేనిక్కడున్నానని నువ్వెళ్ళి మా నాన్న చెవిలో ఊదిరాబాకు. అనవసరంగా ఇక్కడకొచ్చి నానా గొడవా చేస్తాడు'' అంటూ. అపుడేదో మూడ్‌లో వుండి 'సరే' అనేశాడు తను.

అందువల్లే సాయంత్రం అలాంటి ఆలోచన వచ్చినా దాన్ని కార్యరూపంలో పెట్టలేదతను.

తీరా ఇపుడింటికొస్తే ఈ విషయం తెలిసింది.

దయాసాగర్ తనవద్ద వుంటున్నాడని వాళ్ళింట్లో ఎలాగూ తెలిసిపోయింది కాబట్టి ఓసారి వెళ్ళొస్తే మర్యాదగానూ వుంటుంది, చూసినట్టుగానూ వుంటుంది కదాని మిత్రుడిముందు ఆ ఊసు తెచ్చాడు నిరంజన్.

కానీ వాడు రాను మొర్రో అంటుంటే ఏం చేయడం?

''సరే నీ ఇష్టం'' అనక తప్పలేదు నిరంజన్‌కి.

''అది సరే... నా ఉద్యోగం సంగతి ఏం చేశావ్?''

''ఉద్యోగమా?!'' ఆశ్చర్యంగా చూశాడు నిరంజన్.

''అదేరా, మెడికల్ షాపులో ఉద్యోగం...'' గుర్తుచేశాడు దయాసాగర్.

''అదా? నేను పొద్దున్నే చెప్పేనుగా? నువ్వు బాగా ఆలోచించుకుని ఊఁ అంటే నాదేం లేదు. నేను ఎప్పుడైనా సరే వెళ్ళి మాట్లాడ్తాను...''

''నేను బాగానే ఆలోచించుకున్నాను. ఏదో నామినల్‌గా జీతం ఎంతిచ్చినా ఫర్వాలేదు. నువ్వన్నట్టు కొంత అనుభవం గడించడానికే ఆ షాపులో చేరాలనుకుంటున్నాను...''

''నిజంగానే అంటున్నావా? మళ్ళీ మనసు మార్చుకోకూడదు మరి...'' ఎందుకయినా మంచిదన్నట్టు మరోసారి రెట్టించి అడిగాడు నిరంజన్.

''మళ్ళీ మనసు మార్చుకోవడానికి అదేవన్నా చేయగూడనిపనా ఏంటి? నీకా భయమేం అక్కర్లేదు...'' అన్నాడు దయాసాగర్.

''సరే... రేపు ఖచ్చితంగా మాట్లాడ్తానయితే'' అన్నాడు నిరంజన్.

అంతలో వరలక్ష్మి కాఫీ గ్లాసుల్తో పైకొచ్చింది.

కాఫీ సేవిస్తూ మిత్రులిద్దరూ వేరే టాపిక్‌లోకి మారిపోయారు.



ఆ మర్నాడుదయం...

దయాసాగర్ స్నానం చేసొచ్చి, తడి టవల్ని డాబామీద బట్టలారేయడానికుద్దేశించి కట్టిన తీగెమీద ఆరేస్తుండగా... పొరపాట్న చెయిజారి అది పక్కపోర్షన్‌లోకి పడిపోయింది.

తీగె పిట్టగోడనానుకుని వుండటంవల్ల అలా జరిగింది.

'అరెఁరెఁ' అనుకుంటూ క్రిందికి చూశాడు టవలుకోసం. క్రింద పక్కింటి వాళ్ళపెరడు.

ఆ పెరట్లో ఓ సన్నజాజి పందిరి.

చేతిలో వున్న సజ్జలోకి సన్నజాజిపూలు తెంపుతూ ఓ వయసులో వున్న అమ్మాయి.

తనూలావణ్యం అదిరిపోయేలా వుంది గాని... ముఖం ఎలా వుంటుందో మాత్రం తెలియలేదు దయాసాగర్‌కి.

అందుక్కారణం... అతని టవలు సరిగ్గా ఆమె తలమీదపడి మేలిముసుగులా ఆమె ముఖాన్ని కవర్ చేస్తూండడం.

దయాసాగర్ కాళ్ళలో చిరుకంపన.

కొంపదీసి ఆమె అపార్థంచేసు కుంటుందేమో, తను కావాలనే వేశాడను కుంటుందేమో నన్న భయం.

"స...స... సారీ అండీ" అనడమైతే అన్నా డు గాని, గొంతు సరిగ్గా పెగలకపోవడంవల్ల అతని మాట అతనికే సరిగ్గా వినిపించలేదు. ఇహ కిందెక్కడో వున్న ఆమెకెలా విని పిస్తుంది? దయాసాగర్ భయం భయంగా చూస్తుండగా-

ఆమె... మెల్లిగా ఆ మేలి ముసుగును తొలగించి, తల పైకెత్తి చూసింది.

ఎక్కడో చూసిన మొహంలా వుందే? అని పించింది దయాసాగర్‌కి.

వెంటనే అయితే గుర్తుకు రాలేదు గాని, నాలుగైదు క్షణాలు ఆలోచించిన మీదట గుర్తొ చ్చింది.

అరె... ఈ అమ్మాయా?! అనుకున్నాడు దయాసాగర్.

ఆమె మాత్రం చప్పున గుర్తుపట్టేసింది దయాసాగర్‌ని. ఎందుకంటే ఆరోజు చాలా సేపు చాలా స్పష్టంగా గమనించిందామె అత న్ని.

ఈ దయార్ద్ర స్వభావుడు సడన్‌గా ఇక్కడ దర్శనమిచ్చేడేంటబ్బా? అనుకుంది ఆశ్చ ర్యంగా.

"స...స... సారీ అండీ! పొరపాట్న పడిపో యింది..."

'అలాగా?' అన్నట్టు తల పంకించి అదోలా చూసిందామె.

ఆమె... లలిత! మాధవరావుగారి ఒక్కగానొ క్క కూతురు.

"కాస్త వుండలా చుట్టి పైకిసిరేయండి... కాచ్ చేస్తాను..." మనసులో కల్మషం లేకపోవ డంవల్ల నిర్భయంగానే అడిగాడు దయాసా గర్. నిర్భయం అంటే ఇక్కడ ఉద్దేశం తత్తర పాటూ గత్రా లేకుండా అన్నమాట.



లలిత అతనివైపు సీరియస్‌గా చూసిందో క్షణం.

కావాలనే చేసుంటాడా ఈ పని?

అయ్యుండదులే అనిపించింది.

మొన్నారోజు తను స్వయంగా చూసింది కదా- అతని స్వభావం ఎలాంటిదో. వెరీవెరీ గుడ్‌బోయ్ అని సర్టిఫికేట్ కూడా ఇచ్చిందిగా.

అక్కడే వుండండి అన్నట్టు చేత్తోసైగ చేసి, పెరట్లో నలు దిక్కులూ చూసింది లలిత.

వంటింటి గోడకు చేరేసున్న బూజు కర్ర ఆమె కంటబడింది.

వెంటనే అక్కడికెళ్ళి ఆ కర్రని తీసుకొచ్చి, దానికోవైపున దయాసాగర్ టవల్‌ని జండాలా కట్టి... నెమ్మది నెమ్మదిగా ఆ కర్రని పైకి లేపింది.

ఆ పద్ధతి చాలా తమాషాగా అనిపించింది దయాసాగర్‌కి.

ఎంతయినా వయసులో వున్న కుర్రాడాయె. అందమైన ఓ అమ్మాయి పొరపాట్న పడేసుకు న్న టవల్‌ని అలా విలక్షణమైన పద్ధతిలో అందిస్తుంటే తమాషాగానే అనిపిస్తుంది మరి.

బూజు కర్ర పిట్టగోడ అంచుదాకా వచ్చింది.

దాని చివర్న దూముడివేసివున్న తన టవ ల్నందుకుంటూ- "థాంక్సండీ" అన్నాడు దయాసాగర్ గట్టిగా. కిందున్న ఆమెకు విని పించాలిగా మరి.

ఫర్వాలేదన్నట్టుగా తలూపి, బూజు కర్రని మళ్లీ యథాస్థానంలో పెట్టేసి ఇంట్లోకి వెళ్ళిపో యిందామె. తిరిగి తల పైకెత్తి చూడలేదు.

చూడనందుకు బాధనిపించింది దయాసా గర్‌కి.

అనిపించదా మరి?

...ఆమె కళ్ళలోని ఆకర్షణ అలాంటిది.

'ఈ అమ్మాయి ఎవరోగాని మొత్తానికి స్ట న్నింగ్ బ్యూటీ' అనుకున్నాడు దయాసాగర్.

మొదటిసారి చూసినపుడు సూట్‌కేస్ పోయిన కంగారులో వున్నాడేమో, ఆమె అందా న్ని సరిగ్గా గుర్తించలేదు గాని...

ఇపుడు మాత్రం అందమైన ఆమె రూపం అతని హృదయంలో చిన్నకదలిక లాంటి దాన్ని కలిగించింది.

కంటికి నదరుగా కనిపించిన అమ్మాయి

గురించి మనసులో చెత్త చెత్తగా 'పాడు ఊహలు' ఊహించేసుకోవడం యువకుల సహజ లక్షణం.

కానీ మనవాడు అలాంటి పని చేయలేదు. అందాన్ని 'అందమైన అందం'గా గుర్తించి ఊరుకున్నాడంతే.

అదేరోజు సాయంత్రం "మీ పక్కింట్లో ఎవ్రా వుంటోంది? వాళ్ళకో అమ్మాయున్నట్టుంది. ఆమె పేరేంటి? ఎంతవరకు చదివింది?" ఇత్యాది ప్రశ్నలు నిరంజన్‌ని అడగాలని అనిపించింది దయాసాగర్‌కి.

ఎందుకూ అంటే చెప్పలేం... కానీ అలా అనిపించిందంతే.

అయితే నిజంగా అడిగేడా అంటే లేదు. "నీకెందుకురా ఆ వివరాలన్నీ?" అని మిత్రుడు ఎగతాళి చేస్తాడేమో నన్నభయంతో నోరు విప్పలేకపోయాడు.

లవ్ ఎట్ ఫస్ట్‌సైట్ అవునో కాదోగానీ మొత్తానికి లలిత అతని దృష్టిని బాగా ఆకర్షించింది.

నిరంజన్ ఓ చిన్నసైజు శుభవార్తలాంటిది వేశాడు దయాసాగర్ చెవిలో... "నేను శ్రీశైలంగారితో మాట్లాడొచ్చాను. నిన్ను పన్లో పెట్టుకుని నీకన్నీ నేర్పిస్తానని ప్రామిస్ చేశాడు. నీవు నా మనిషివి కాబట్టి నిన్ను గౌరవంగానే చూసుకుంటాడులే. రేపు నిన్నోసారి వెంటబెట్టుకురమ్మన్నాడు. రేపు మనం ఒక గంట ముందుగా బయల్దేరి అక్కడికి వెళ్దాం. నిన్నాయన చేతిలో పెట్టి నేనట్నుండటే బ్యాంకుకి వెళ్ళిపోతాను. సరేనా?" అంటూ.

దయాసాగర్‌కి సంతోషంగానే అనిపించింది. "అలాగే" అని వెంటనే ఒప్పేసుకున్నాడు.

"నీ సామర్థ్యాన్నిబట్టి జీతం ఓ అయిదారొందలకి తగ్గకుండా ఇస్తానన్నాడు" చెప్పాడు నిరంజన్.

"జీతం దేముందిలే" అనేశాడు దయాసాగర్ తేలిగ్గా.

"అలా అంటే ఎలా? నీ పంతం నెగ్గాలీ అంటే ముఖ్యంగా నీక్కావాల్సింది డబ్బే కదా? ఇప్పట్నించే పైసాపైసా కూడబెట్టడం మంచిది"

మిత్రుడు చెప్పింది సబబుగానే వున్నా ఎందుకో సడన్‌గా నిరాశ ఆవహించింది దయాసాగర్‌ని.

పైసాపైసా కూడబెడితే ముప్ఫయ్ వేలు ఎప్పటికి జమవ్వాలి? ప్చ్!

అంతలోనే తనకుతానే ధైర్యం చెప్పుకున్నాడు... ఈ జీతం మీదే తానెప్పటికీ డిపెండ్ అవ్వడు కదా! ఎక్స్‌పీరియన్స్ కోసమే కదా, ఈ సేల్స్‌బోయ్ ఉద్యోగం? ఆ తర్వాత తనే సొంతంగా మెడికల్ షాపు పెడితే, బహుశా ముప్ఫైవేలు సంపాదించడం కష్టమేం కాకపోవచ్చు.

అయినా కాకపోయినా ప్రస్తుతానికి ఇంతకాన్నా చేయగలిగిందేముంది?

ఏదోక ప్రయత్నం చేయకపోతే ఉన్నట్టుండి అంత డబ్బు ఎక్కడ్నించీ ఊడిపడదు కదా?

మిత్రుడు నోరు విప్పకుండా ఏదో ఆలోచనలో పడ్డంచూసి అడిగాడు నిరంజన్, "ఏంట్రా మాట్లాడవ్?"

"మాట్లాడ్డానికేముందీ? నువ్ చెప్పినట్టే చేద్దాం..." అన్నాడు దయాసాగర్.

"నీ మెయిన్‌టినెన్స్ వరకూ ప్రోబ్లమేంలేదు, నీ ఛాలెంజేదో నెరవేరేదాకా ఎలాగూ మా ఇంట్లోనే వుంటావు కాబట్టి. ఎటొచ్చీ ఆలోచించాల్సిందల్లా అంత డబ్బు ఆరునెలల షార్ట్ పీరియడ్లోఎలా సంపాదించడమా అన్నదే..."

నిరంజన్ అలా అంటుంటే ఇబ్బందికరంగా నవ్వేడు దయాసాగర్.

"అయితే ఈ ఆరునెలలూ నీకేమీ 'పే' చేయకుండా నీమీద పడి మేయమంటావ్?"

"అంటే ఏంటి నీ ఉద్దేశం? నా ఇంట్లో పేయింగ్ గెస్ట్‌గా వుందామనుకుంటున్నావా? అలాగయితే ఒక్కక్షణం కూడా నిన్ను నా ఇంట్లో వుంచుకోను... ఆఁ"

ఆ మాటల్లోని ఆప్యాయతనీ, అభిమానాన్నీ గుర్తించగలిగాడు దయాసాగర్. "నీదెంత మంచి మనసురా! నీ రుణం ఎలా తీర్చుకోగలుతుతానో ఏమో..." అన్నాడు ఆర్ద్రమైన స్వరంతో.

"నా రుణం నువ్ తీర్చుకోవడం ఏంటి? నీ రుణమే నేనిలా తీర్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. అయినా మనమధ్య ఇలాంటి మాటలు

దొర్లడం నాకిష్టంలేదు. ఇంకెప్పుడూ ఇలా మాట్లాడబాకు'' అంటూ మందలించాడు నిరంజన్.

అందులోనూ ఆప్యాయతే.

''సరే లేరా...'' అంటూ నిండుగా నవ్వేశాడు దయాసాగర్.

మర్నాడు నిరంజన్‌తోపాటే వెళ్ళి, శ్రీశైలంగార్ని కలిసి, ఆలస్యం అమృతం విషం అన్న పెద్దల మాటను పాటిస్తూ ఆ పూటనుండే డ్యూటీలో జాయినైపోయాడు దయాసాగర్.

లక్షాధికారైన చెత్తరాయుడిగారి కొడుకిపుడు ''అమృతా మెడికల్స్''లో సేల్స్‌బోయ్.

'విధి లీలలు' అనే పదాన్ని కథల్లోనూ గట్రా చదివి ఏమో అనుకుంటాంగానీ... నిజంగా విధిలీలలు విచిత్రమైనవే!

మొదటి రెండు రోజులూ ఒకింత ఇబ్బందిగా అనిపించినా తర్వాత అలవాటుపడిపోయాడు దయాసాగర్ ఆ ఉద్యోగానికి. ఏక సంథాగ్రాహి కావడంవల్ల మెడిసిన్స్ పేర్లన్నీ క్షుణ్ణంగా నోటికి కంఠతా వచ్చేశాయి. ఎక్కడ ఏముందో, దేని ఖరీదెంతో కూడా తడుముకోకుండా చెప్పగలిగే స్థితికి చేరుకున్నాడు.

పట్టుమని పదిరోజులైనా గడవకముందే అలా చాకులా తయారైన దయాసాగర్‌ని చూసి ముచ్చటపడ్డాడు శ్రీశైలంగారు.

అదలా వుంచితే ఈ పదిరోజుల్లో అఖిలాండేశ్వరి ఒకరోజు సాంబడ్ని వెంటబెట్టుకుని నిరంజన్‌వాళ్ళ ఇంటికొచ్చి దయాసాగర్‌ని ఇంటికొచ్చేయమని నానా రకాలుగా బతిమాలింది.

ఆవిడెన్ని చెప్పినా లొంగలేదు దయాసాగర్.

అతను మెడికల్ షాపులో ఉద్యోగం చేస్తున్నందుకు ఆమె పడినబాధ ఇంతా అంతా కాదు.

''నీకేం ఖర్మ పట్టిందిరా నాయానా'' అని ఇంచుమించు ఏడ్చేస్తూ వాపోయింది.

''ఖర్మో బొర్మో... నన్నిలా వుండనీ'' అనేశాడే తప్ప, ఆవిడ కన్నీటికైనా కరగలేదు దయాసాగర్. ''నీకు చూడాలనిపించినపుడల్లా ఇక్కడికొచ్చి నన్ను చూసిపోతూండు'' అని మాత్రం అన్నాడు.

ఆవిడెంతో కొంత డబ్బు చేతబెట్టబోగా నసేమిరా తీస్కోవడానికి నిరాకరించాడు.

దాంతో ఇంకేం చేయలేక లబ్బున మొత్తుకుంటూనే వెళ్ళిపోయిందామె.

కరవొద్దంటే పాము క్కోపం... విడవొద్దంటే కప్ప క్కోపం! అందుకని అది జరిగినపుడు నిరంజన్, వరలక్ష్మిలు సీన్‌లోనే వున్నా ఎటూ మాట్లాడలేకపోయారు. 'మీరయినా నచ్చజెప్పండి బాబూ' అంది అఖిలాండేశ్వరి. 'ఈ విషయంలో మీరు జోక్యం గనక చేసుకుంటే నేను మీ ఇంట్లోంచి కూడా వెళ్ళిపోతాను' అంటూ దయాసాగర్... దాంతో ఎవరి పక్షం మాట్లాడాలో తెలియక మిన్నకుండిపోయారా దంపతులు.

''మనబ్బాయి మెడికల్ షాపులో సేల్స్‌బోయ్‌గా చేస్తున్నాడటండీ! మనకింత ఆస్తుంచుకుని వాడలా అవస్థలు పడ్తుంటే చూస్తూ వూరుకోవడం భావ్యమా! నేనెంత ప్రాధేయపడినా నా మాట వినిపించుకోలేదు. వాడిస్థితికి కడుపు తరుక్కుపోతోంది. మీరయినా వెళ్ళి బ్రతిమాలి తీసుకురండీ!'' అని కన్నీరు నింపింది నిరంజన్ వాళ్ళ ఇంటి నుండి వెళ్ళాక భర్త ముందు అఖిలాండేశ్వరి.

''వాడు మెడికల్‌షాపులో చేస్తున్నాడని తెలుసు. చూసిన వాళ్ళు చెప్పారు. చెయ్యనీ ఎంత కాలం చేస్తాడో. ఆ బోడి ఉద్యోగంతో ఆరునెలల్లో ముప్పై వేలు సంపాదించేస్తాడటనా? తెలిసి రావాలి వాడికి. ఉండనీ అక్కడే'' అనేశాడు కరుగ్గా రాయుడు.

''ఛీ... మీదెంత కఠినమైన మనసండీ'' ఈసడింపుగా అంది అఖిలాండేశ్వరి.

''నువ్వేలా అనుకున్నా సరే నేను మాత్రం వెళ్ళి వాడ్ని బతిమాలడం జరగదు'' అనేసి అక్కడ్నించి వెళ్ళిపోయాడు రాయుడు.

ఈ పదిరోజుల్లో చూడకూడదనుకుంటూనే అప్పుడప్పుడూ పక్కింటి పెరట్లోకి లలిత కోసం చూడ్డం ఓ అలవాటై కూర్చుంది దయాసాగర్‌కి.

ఒకటిరెండు సార్లు ఆమె పెరట్లో కనిపించడమైతే కనిపించింది గాని ముఖం మాత్రం కనిపించలేదు. అంటే తలపైకెత్తి చూసిన

పాపాన పోలేదన్నమాట!

ఎలా పోతుంది?

ఇతగాడేవన్నా అలికిడీ గట్రా చేస్తే కదా?

మర్నాడు...

అలా అలికిడీ గట్రా చేయాల్సిన అవసరమేం లేకుండానే ఆమె తలపైకి తీసి ఇతగాడికేసి చూసింది.

ఏదో యధాలాపంగా చూసి తద్వారా చూపులు కలుసుకోవడం కాదు.

అన్‌ఫార్చునేట్‌గా జరిగిన పొరపాటే మళ్ళీ జరిగింది.

అదే తీగమీద, అదేవిధంగా, కానైతే ఈసారి దయాసాగర్ లుంగీని ఆరేస్తుంటే... రివ్వున వీచిన గాలికి అది కాస్తా ఎగిరెళ్ళి లలితా వాళ్ళ పెరట్లో పడింది.

చచ్చాంరా భగవంతుడా! అనుకుంటూనే క్రిందకు తొంగి చూశాడు దయాసాగర్.

ఈసారా లుంగీ ఆమె తలమీద ముసుగులా అయితే పడలేదు. కాళ్ళముందు ఓ కుప్పలా పడింది.

"న... న... సారీ అండీ! పొ... పొ... పొరపాట్న పడింది" అన్నాడు దయాసాగర్ ఆమె తలపైకెత్తి చూడగానే.

పొరపాట్లు పదేపదే జరుగుతాయా?

ఒకసారంటే ఏదో అనుకోవొచ్చు. కానీ బుద్ధి, జ్ఞానం వుంటే మళ్ళీ అలాంటి పొరపాటు జరక్కుండా జాగ్రత్త పడొచ్చు కదా? ఏ క్లిప్పో పెట్టొచ్చు కదా?

ఎంత మంచివాడుగా మనసులో ముద్రపడినా, యువకుడు కావడంవల్ల దయాసాగర్నీసారి ఆమె శంకించకుండా వుండలేకపోయింది.

"పొరపాటా పాడా? ఏం ఆమాత్రం జాగ్రత్తుండక్కర్లా? ఈసారి గనక మళ్ళీ ఏదన్నా ఇటువైపుగాని పడిందంటే తీస్కెళ్ళి మా బావిలో పడేస్తానంతే... ఆఁ" అంది కోపంగా.

"సారీ అంటున్నాగా? నిజమండీ... ఒట్టు. నేను కావాలని పడేయలేదు..." బీదముఖం పెట్టి సిన్సియర్‌గా చూశాడు దయాసాగర్.

"అదంతా నాకు తెలియదు. నేను మాత్రం ఇంకోసారిలా జరిగితే ఊరుకోనంతే" అని తీక్షణంగా చూసి, కాళ్ళ దగ్గరున్న లుంగీని ఉండలా చుట్టి శక్తికొద్దీ పైకి గిరాటేసింది లలిత.

ఎగిరి దాన్నందుకుని "థాంక్సండీ" అన్నాడు దయాసాగర్.

అయితే అతని గ్రహచారం బాగులేకపోవడంవల్ల కావచ్చు, ఆ ఎగరడంలో అతని చొక్కా జేబులో వున్న మనీపర్సు కాస్తా అతన్తోపాటేఎగిరి గాల్లోకి లేచి గురిచూసి కొట్టినట్టు ఠపీమని ఆమె నెత్తిమీద పడింది.

"ఇందాకటిది పొరపాటు, దీన్నేవంటారు మరి?" తన నెత్తినితాకి భూపతనం చెందిన ఆ మనీపర్సుని చేతిలోకి తీసుకుని ఎర్రగా చూస్తూ అడిగింది లలిత.

"ఇందాక జరిగిన పొరపాటుకి ఇది కొనరండీ. లేదా నా గ్రహచారమండీ..." బీదముఖాన్ని ఏడుపుముఖంలా కన్వర్ట్ చేసి బేలగా చూశాడు దయాసాగర్.

ఏ ఖడ్గమృగం చర్మంతో చేయబడిందో ఏమోగాని, ఆ పర్సు మొత్తానికి దుక్కలా చాలా బరువుగా వుంది.

అందువల్ల అది తన నెత్తిని తాకినపుడు మాడు అదిరినట్టే అనిపించింది లలితకి.

ఎదుటివ్యక్తి పొరపాటువల్ల తన మాడు అదిరితే ఎవరికి మాత్రం కోపం రాకుండా వుంటుంది?

"అటులనా?" అంటూ వ్యంగ్యంగా నవ్వి... "నేను మాటంటే మాటే! దీన్ని బావిలో పడేస్తున్నా కాస్కోండి..." అంటూ బావివైపు అడుగులు వేసింది లలిత.

"ఏవండేవండీ... ప్లీజ్... వొద్దండీ..." లబలబలాడ్తూ అరిచాడు పైనుండి దయాసాగర్.

"అదేం కుదర్దండీ... వేసేస్తున్నానంతే... వన్... టూ..."

"ఏవండీ ప్లీజ్ అండీ... ఏవండీ ప్లీజ్ అండీ..." శక్తికొద్దీ అరుస్తూ కథాకళిలో భరతనాట్యాన్ని మిక్స్‌చేస్తూ చిందులేశాడు దయాసాగర్.

లలితకు నవ్వు రాబోయిందిగాని... మునివంట అదిమి పెట్టుకుంది.

"సరే... ఈ ఒక్కసారికి ఎక్స్‌క్యూజ్ చేస్తు

న్నా..." అనేసి తన బలాన్నంతా ఉపయోగిస్తూ ఆ పర్సుని గాల్లోకి విసిరింది.

ఆ వెంటనే తల దించుకుని విసవిసా ఇంట్లోకి వెళ్ళిపోయింది.

★ ★ ★

అప్పుడే లలితా వాళ్ళ ఇంట్లోంచి బయటికొస్తున్నారు లలితా, రజితా.

సరిగ్గా అదే సమయంలో నిరంజన్ వాళ్ళ ఇంట్లోంచి బైటికొచ్చాడు దయాసాగర్.

"ఎవరే ఈ శుక్రాచార్యుడు?" అంది రజిత లలితతో. "అరెఁ ఇతనేరోజు బస్టాప్‌లో తారసిల్లిన బడుద్ధాయిలా వున్నాడే?!" అంది ఆ వెంటనే.

లలిత దయాసాగర్‌వైపు చూసింది.

అతని కుడికన్ను ఇంతలావుగా ఉబ్బి... ఇంచుమించు మూసుకుపోయి వుంది.

అరెఁ... పొద్దున్న బాగానే వున్నాడుగా? ఇంతలోనే ఈ శుక్రాచార్యుడి అవతారమేంటీ? అనుకుందామె గాభరాగా.

ఆ ఆలోచనలోపడి స్నేహితురాలి ప్రశ్నలకి జవాబివ్వలేదామె.

"అయితే ఇతనుండేది మీ పక్కింట్లోనే అన్నమాట" గమ్మత్తుగా తలూపుతూ అంది రజిత. "మరైతే ఆరోజు ఇతనెవరో నీకు తెలియనట్టే ప్రవర్తించావేఁ?!!"

లలిత మాట్లాడలేదు. ఆమె ధ్యానంతా దయాసాగర్ కుడికంటి గాయంమీదే వుంది.

"మాట్లాడవేమే? కొంపదీసి ఏదన్నా వ్యవహారమా?" లలిత డొక్కలో మోచేత్తో పొడుస్తూ అంది రజిత.

దాంతో ఈ లోకంలో కొచ్చిన లలిత "ఛీ నోర్ముయ్" అంది కోపంగా.

అంతలో దయాసాగర్ చకచకా వాళ్ళిద్దర్నీ సమీపించాడు.

"సారీ అండీ! పొద్దున్న నిజంగానే పొరపాట్న జరిగిందలా. మీరు నన్ను పూర్తిగా అపార్థం చేసుకున్నట్టున్నారు..." అన్నాడు లలితతో.

దగ్గరకొచ్చి అవతలా మళ్ళీ సారీ చెబుతుంటే కరుగ్గా మాట్లాడ్డానికి మనస్కరించలేదు లలితకి.

"నెవర్ మైండ్..." అంది పొలైట్‌గా. "అది సరే... కంటికా గాయం ఏంటి?" అడక్కుండా వుండలేకపోయింది కుతూహలంకొద్దీ.

"మీ చలవే కదండీ?" అన్నాడు దయాసాగర్ తడుముకోకుండా.

"నా చలవా?" అంటే? అన్నట్టుగా చూసింది లలిత.

"పొద్దున్న నామీద కోపంకొద్దీ నా పర్సుని మీరు శక్తికొద్దీ పైకి విసిరారు కదా! అది కాస్తా వచ్చి ఈ కంటిని ముద్దాడింది. అంతేనండీ... జస్ట్... అంతే..." ఏడవలేక నవ్వినట్టుగా నవ్వేడు దయాసాగర్.

"నిజంగానా?"

"నిజమేనండీ! మరీ హరిశ్చంద్రుడ్ని కాకపోయినా ఊర్కే మాత్రం అబద్ధాలాడే స్వభావం కాదు నాది..." అన్నాడు బుద్ధిమంతుడిలా చేతులు కట్టుకుంటూ.

"సారీ అండీ... నేనిలా జరుగుతుందనుకోలేదు..." చెప్పింది లలిత.

"ఫర్వాలేదులెండి. ఇలా జరగాలని రాసిపెట్టుందేమో, జరిగిందంతే... డోంట్‌వర్రీ... వస్తానండీ!" అనేసి ముందుకు సాగిపోయాడు దయాసాగర్.

"ఏవిటే? ఈ సారీ లేమిటి? పర్సుతో కొట్టుకోవడాలేవిటి? అసలితను మీ ఇంటిపక్కన ఎప్పుడు చేరేడు? ఆరోజు బస్టాప్‌లో బుద్ధిమంతుడూ అదీ ఇదని సర్టిఫికేటిచ్చావ్. ఇవ్వాళేమో బహుగందరగోళంగా సారీలూ గట్రా చెబుతున్నావ్... ఇదంతా చూస్తుంటే నాకెందుకో డౌటుగా వుంది..." అంది రజిత అతగాడు కాస్త దూరంకాగానే.

"డౌటా? అంటే?"- ఏమిటీ నీ ఉద్దేశం అన్నట్టు చూసింది లలిత.

"ఓ అందమైన అబ్బాయీ, అమ్మాయీ పోటీలుపడి మరీ సారీలు చెప్పుకుంటున్నారూ అంటే..." పూర్తిచేయకుండా మాటనాన్చింది రజిత.

"అయితే ఏవిటంటా?"

"ఏముందీ... దేర్ మస్ట్‌బీ సమ్‌థింగ్ బిహైండ్ దట్..." అంటూ చిలిపిగా నవ్వింది రజిత.

"ఛీ ఊర్కో" అంటూ ఆమె నెత్తిన్నో మొట్టు మొట్టి- ఒకపక్క నడక సాగిస్తూనే దయాసాగర్

గురించి టూకీగా వివరాలు చెప్పింది లలిత.

వరలక్ష్మిని 'వదినా' అని పిలుస్తూంటుంది లలిత. పెరటిగోడ దగ్గర సమావేశమై ప్రతి రోజు కాకపోయినా అడపాదడపా కబుర్లాడుకో వడం వాళ్ళకు పరిపాటే. అదీగాక ఆ ఇంటికీ ఈ ఇంటికీ ఆడవాళ్ల రాకపోకలు తరుచుగానే సాగుతుంటాయ్. అందువల్ల ఏదో మాటల సందర్భంలో దయాసాగర్ గురించి ఈమెకు టూకీగా చెప్పింది వరలక్ష్మి. అదే ఇపుడు రజితకు ఎత్తి చెప్పింది లలిత. దాంతోపాటు తనకీ, అతనికీ మధ్య జరిగిన 'టవలూ-లుంగీల' సంఘటనల్ని గురించి కూడా చెప్పింది.

"అయితే మొత్తానికి అతని వెనక చాలా పెద్ద కథే వుందన్నమాట. తండ్రితో శపథంచేసి ఇంట్లోంచి వచ్చేశాడూ అంటే ఓ చిన్నసైజు హీరోనే. అందులో సందేహంలేదు..." అంది రజిత.

అవునన్నట్లు తలాడించింది లలిత.

"అదిసరే. ఇంతకీ నువ్వతన్ని శుక్రాచార్యుణ్ణి చేసింది- కావాలనే చేశావా, లేక..."

"ఛీ పూర్కోవే కావాలని చేస్తారా ఎవరైనా? పాపం కన్ను కప్పలా ఉబ్బిపోయింది... పాపం ఎంత బాధ పడ్తున్నాడో ఏమో" అంది జాలిగా లలిత.

"అతని బాధ సంగతేమోగానీ నీ బాధ మాత్రం అధికంగానే వుంది..." అంది రజిత పరిహాసంగా.

"తంతా మళ్ళీ గనక ఇలా మాట్లాడేవంటే..." చిరుకోపంగా అంది లలిత.

దాంతో ఆ టాపిక్ కట్టిపెట్టి వేరే మాటల్లోకి దిగింది రజిత.

ఆ సమయంలో వాళ్ళిద్దరూ బయల్దేరింది చిన్నపాటి షాపింగ్‌కి. కబుర్లాడుకుంటూ అలా ముందుకు సాగిపోయారు.

★ ★ ★

"అరెః... ఏవిటయ్యా ఆ కన్నలా వాచిపోయింది?" దయాసాగర్‌ని చూస్తూనే పరామర్శింపుగా అడిగాడు శ్రీశైలం.

ఆయన దయాసాగర్‌ని ఏకవచనంలోనే సంబోధిస్తుంటాడు. వయసులో తనకన్నా చాలా పెద్దవాడు కావడంవల్ల దయాసాగర్‌కదేం బాధ కలిగించదు.

"అబ్బే ఏం లేదండీ... చిన్నదెబ్బ తగిలిందంతే!" అన్నాడు బిడియంగా నవ్వుతూ.

"చిన్న దెబ్బంటావేంటయ్యా దిబ్బకుడులా కన్ను అంతలా ఉబ్బిపోతేనూ..."

"ఉబ్బు జాస్తిగా వుందిగాని... నొప్పి అంతగా లేదులెండి... ఆయింట్‌మెంట్ పెట్టుకున్నాను..."

"సరే... నాకీరోజు ఊళ్ళో కొంచెం పనుంది. బహుశా సాయంత్రందాకా రాకపోవచ్చు. ఈ పూటకి నువ్వు ఒక్కడివే మానేజ్ చేయగలవా?"

"దాన్దేముందీ... అలాగే..." అన్నాడు దయాసాగర్ ఉత్సాహంగా,

అతనిమీద శ్రీశైలంగారికి అప్పటికే చాలా నమ్మకం ఏర్పడిపోయింది. అందువల్ల నిర్భయంగా అతనికి షాపప్పగించి మరికాసేపట్లో తన పనిమీద తాను బైటకి వెళ్ళిపోయాడు.

ఎంతయినా విద్యాధికుడు. అందునా నిరంజన్‌గారి ఫ్రెండు. కాబట్టి కక్కుర్తిబుద్ధి వుండడానికి అవకాశంలేదు. అందువల్ల దయాసాగర్‌కి కేష్ కౌంటర్ అప్పగించి వెళ్ళడానికి ఆయనేమాత్రం సంకోచించలేదు.

శ్రీశైలంగారు వెళ్ళాక ఓ అరగంటసేపు అమ్మకాలు సవ్యంగానే సాగించాడు దయాసాగర్.

అతర్వాతే వచ్చిపడింది చిక్కు.

నలభై అయిదూ, యాభైకి మధ్యవయసున్న బీదరాలొకామె వచ్చింది... షాపుకి.

ప్రిస్క్రిప్షన్ చీటీ అందించింది దయాసాగర్‌కి.

అందులోకి చూసి, మనసులోనే లెక్కగట్టి చెప్పాడు దయాసాగర్... "ఎనభైఆరు రూపాయలవుతుందమ్మా" అని.

బీదరాలి ముఖం వాడిపోయింది.

"నాకాడ అంతలేదు. యాభయ్యే వుంది నాయనా..." అంటూ రొంట్లోంచి చిక్కం సంచీని తీసిందామె.

"అంతే వుంటే ఎలాగమ్మా? వెళ్ళి మీ వాళ్ళనడిగి మిగతా డబ్బులు కూడా తీసుకురా

అమ్మా'' అన్నాడు దయాసాగర్.

"నా కెవరూలేర్నాయనా. నేనొక్కదాన్నే... అవతల నా బిడ్డ చావుబ్రతుకుల్లో వుంది... కడుపులో బిడ్డ అడ్డం తిరిగిపోనాదట. అర్జంటుగా ఈ సీటీలోని మందులన్నీ అట్టుకు రమ్మన్నారు...'' అంటూ కన్నీరు నింపిందామె.

"పాపం'' అనిపించింది దయాసాగర్‌కి.

అవతల ఓ వ్యక్తి చావుబతుకుల్లో వుంటే చూస్తూ ఎలా ఊరుకోవడం? మనుషులు చేయాల్సిన పనేనా అది?

అంతగా ఆమె తిరిగివ్వకపోతే తన జీతంలోంచి తీస్కోమని శ్రీశైలంగారితో చెప్పొచ్చు. ఆ పోయేప్రాణాన్ని నిలబెట్టడం తన తక్షణ కర్తవ్యం.

"సరే... మందులన్నీ ఇస్తాలేగాని... మరి మిగతా డబ్బు రేపు తెచ్చిచ్చేస్తావా?'' ఆమె అడక్కముందే అరువివ్వడానికి సిద్ధపడిపోతూ అన్నాడు దయాసాగర్.

ఆ సమయంలో ఆమెకంతకన్నా కావాల్సిందేముంది?

"మా బాబే! నూరేళ్ళు చల్లగా వర్ధిల్లు... నా బిడ్డపేణం నిలబెడుతున్నావు... నీ రుణం ఈ జనమలో తీర్చుకోలేను...'' అంటూ చేతులు జోడించింది.

దయాసాగర్ మనసులో తృప్తి.

వెంటనే మరేం సంకోచించకుండా ఆమెక్కావలసిన మందులన్నీ పేక్‌చేసి ఇచ్చి పంపించాడు.

"దండం బాబూ...'' అంటూ మళ్ళీ నమస్కరించి వెళ్ళిపోయిందామె.

ఇలాంటి సందర్భాలలో శ్రీశైలం అయితే డబ్బులివ్వందే కుదరదంటూ నిష్కర్షగా తిప్పి పంపేయడం దయాసాగర్‌కి తెలుసు. బట్ అప్పుడాయా వ్యక్తుల్ని ఆదుకోవడం తన చేతుల్లో వున్నపని కాకపోవడంవల్ల అతనేమీ మాట్లాడలేకపోయేవాడు.

కానీ ఇపుడు తను స్వతంత్రుడాయె... అఫ్‌కోర్స్ తాత్కాలికంగానే కావచ్చు.

అందుకే ఇపుడతను అలా ధైర్యంగా అరువివ్వగలిగాడు.

మరో అరగంట తర్వాత అలాంటికేసే మరొకటొచ్చింది.

అతగాడి భార్యని ఎద్దు పొడిచిందట. ప్రాణాపాయస్థితిలో ఆస్పత్రిలో వుందట...

అతనిక్కావాల్సిన మందులు నూటనలభై అయితే, అతని వద్ద ఆ సమయానికి వున్నది నూరే.

ఏదో తిప్పలుపడి ఓ అరగంటలో తెచ్చిస్తాననీ, ముందు తన భార్య ప్రాణాలు కాపాడమనీ వలవలా ఏడ్చేశాడు.

సహజంగానే దయాసాగర్ మనసు కరిగిపోయింది.

సర్లే అంటూ అతనికీ అరువిచ్చి పంపాడు.

ఆ తర్వాత మరో ముప్పావుగంటకి మరోకేసు.

ఆ వెనుక మరో అయిదు నిమిషాలకే ఇంకో కేసు.

ఈ దేశంలో దరిద్రులకు లోటేముంది?

పై రెండు కేసుల విషయంలో కూడా దయాసాగర్ మనసు చెరువే అయ్యింది.

వాళ్ళను కూడా 'అవసరం' గడిపే పంపించాడు.

ఆ సాయంత్రం తన పనిపూర్తి చేసుకుని తిరిగొచ్చిన శ్రీశైలం అడిగాడు దయాసాగర్‌ని.

"బిజినెస్ ఎలా సాగింది?''

"బాగానే సాగింది సార్'' అంటూ క్యాష్ బాక్స్‌లోని డబ్బంతా అప్పగించి...'' ఇహపోతే మీరు నా జీతంలోంచి ఓ మూడొందల అరవై రూపాయలు పట్టుకోవాల్సుంటుంది....'' అన్నాడు దయాసాగర్.

విషయం అర్థంగాక తెల్లబోతూ చూశాడు శ్రీశైలంగారు. "ఎందుకని? నువ్వు వాడుకున్నావా?''

అవునన్నట్టు నిలువుగానూ, ఆ వెంటనే కాదన్నట్టు అడ్డంగానూ కూడా తలాడించాడు దయాసాగర్.

"సంగతేంటో చెప్పవయ్యా బాబూ! ఏమీ అర్థం కాకుండా ఏంటా తలూపడం?'' అన్నాడు శ్రీశైలంగారు చిరాగ్గా.

"మరేంలేస్సార్...'' అని మొదలెట్టి చెప్పేశాడు దయాసాగర్ తను చేసిన ఘనకార్యం. పైగా, అవతల ప్రాణాలుపోయే వ్యవహారం

కదండీ! అందుకని మానవత్వం దృష్ట్యా జాలి చూపక తప్పలేదు..." అన్నాడు తన తప్పేమీ లేదన్నట్టు.

శ్రీశైలంగారికి నవ్వాలో ఏడ్వాలో అర్థం కాలేదు. జుట్టు పీకేసుకుని, బట్టలు చించేసుకుంటే బావుండనిపించింది. "ఇదేమిటబ్బా... అది ఇదేను అబ్బా..." అంటూ సందర్భోచితం కాని పాటొకటి పాడాలని కూడా అనిపించింది.

ముందు వెర్రిచూపొకటి చూశాడు దయాసాగర్‌కేసి.

తర్వాత ఆయన కళ్ళు ఎర్రగా అయ్యాయి.

"నీకేవన్నా మతుందా అసలు? మన షాపెదురుగా వున్నది అసలే ధర్మాసుపత్రి. అక్కడికొచ్చేవాళ్ళంతా బీదవాళ్ళే. ఆస్పత్రిలో మందులుంచుకుని కూడా అవన్నీ దిగమింగి ఇలా చీటీలు రాసి పంపుకుంటారు వాళ్ళు. వాళ్ళకే లేని దయ నీకు పుట్టుకొచ్చిందా ఆ బికారి ముండాకొడుకుల మీద? అయినా నేనెలా వుంటున్నానో రోజూ నువ్వు చూస్తూనే వున్నావుగా? ఇన్నాళ్ళలో ఒక్కడికి... ఒక్కడికైనా అరువిచ్చానా నేను? అలాంటిది ఒక్కపూట నిన్ను నమ్మి నీకు షాపప్పగించినందుకు ఇంత నిర్వాకం చేస్తావా?" అన్నాడు ఫీంకరిస్తూ.

"త... త... తప్పేనండీ... కానీ పాపం..." అంటూ ఏదో చెప్పబోయాడు దయాసాగర్ బిక్కమొహంవేసి.

"పాపంలేదు పుణ్యంలేదు. నా కింకేం చెప్పొకింక. ఇంకా నయం... నిన్ను నమ్మి నీకు షాపప్పజెప్పి ఓ నాల్రోజులపాటు తిరపతెళ్ళొద్దామనుకున్నాను. అదే గనక జరిగితే నా కొంప నిలువునా ముంచేసేవాడివే. చేసిన వెధవపని చాలక పైగా నీ జీతంలోంచి విరగ్గోసుకోమంటున్నావా? అసలు నీ జీతం ఎంతనుకుంటున్నావ్? ఇంతోటి మహానుభావుడు ఇంకెక్కడా దొరకడని ఏ అయిదువేలో పదివేలో ఇస్తాననుకుంటున్నావా? ఏదో ఆ నిరంజన్‌గారి మాట కాదన్లేక నిన్ను పన్లో పెట్టుకున్నందుకు మా బాగా చేశావులే. ఇంకా చూస్తూ నిలబడ్డావేం? ఊఁ బయల్దేరు...." అన్నాడు శ్రీశైలంగారు చిందులేస్తూ.

"అది కాదండీ..." అంటూ ఇంకేదో సంజాయిషీ ఇవ్వబోయాడు దయాసాగర్.

"నాతో నువ్వింకేం మాట్లాడొద్దు. నేను చెప్పాల్సిందేవన్నా వుంటే నిరంజన్‌గారితో చెప్పుకుంటాను. ఈ క్షణంనుండి నువ్వు పన్లో వుండనవసరంలేదు. వెళ్ళిపో..." అంటూ ఖండితంగా చెప్పేసి తీక్షణంగా చూశాడు శ్రీశైలంగారు.

తనని పనిలోంచి తీసేయాల్సినంత తప్పు తానేం చేశాడో అర్థం కాలేదు దయాసాగర్‌కి.

చావుబతుకుల్లో వున్నవాళ్ళమీద జాలి చూపడం తప్పెలా అవుతుంది?

"చెప్పేది నీకే... కదలవేం?" అంటూ హుంకరించాడు శ్రీశైలంగారు.

దాంతో ప్రాణం చివుక్కుమనిపించి- "వస్తానండీ! ఆ మూడొందల అరవై రూపాయలు మా నిరంజన్‌తో పంపిస్తాను" అన్నాడు దయాసాగర్.

"మంచిది నాయనా... వెళ్ళిరా..." అన్నాడు శ్రీశైలంగారు.

దయాసాగర్ తల దించుకుని ఆ షాపులోంచి బైటికొచ్చేశాడు.

★ ★ ★

జరిగింది తెలుసుకుని దయాసాగర్‌ని దుమ్మెత్తిపోశాడు నిరంజన్.

"మరీ ఇంత అమాయకత్వమైతే ఎలా గురా? జాలికైనా, మంచితనానికైనా, దేనికైనా సరే... ఓ హద్దంటూ వుండాలి. టూమచ్ ఎనీథింగ్ ఈజ్ బాడ్ అని ఊరికే అన్నారా? అయినా నీ ఇష్టం వొచ్చినట్టు అరువులిచ్చేయడానికి అదేవన్నా నీ సొంతషాపా? లాభంలేదురా, నువ్వీ ధోరణి మార్చుకోకపోతే బాగుపడ్డం కష్టం..." అన్నాడు చివర్లో ఒకింత శాంతిస్తూ.

దయాసాగర్ బిక్కముఖం పెట్టి మూతి బిగించుక్కూర్చున్నాడే తప్ప ఏమీ మాట్లాడలేదు.

మిత్రుణ్ణి ఆ స్థితిలో చూస్తుంటే జాలేసింది నిరంజన్‌కి.

అవధులులేని జాలి అనర్థదాయకమని అతగాడికెలా తెలియచెప్పడం?

అదీగాక మితిమీరిన జాలి మంచిదికాదని తానై అతనికి చెప్పాలీ అంటే ఒకరకంగా

ఇబ్బందే.

"ఇపుడిలా అంటున్నావుకదా? మరి ఆరోజుల్లో నేన్నీనుండి ఏ ప్రతిఫలమూ ఆశించకుండానే నీకు సాయం చేశాను. అలా చేయకపోయుంటే నీ చదువు సవ్యంగా పూర్తయ్యుండేదా? ఈనాడు నువ్వింత ఉన్నతస్థితిలో వుండగలిగేవాడివా?'' అని ఎదురుప్రశ్న వేస్తే- తన దగ్గర సమాధానమేముంది?

తనకి బ్యాంక్‌లో క్యాషియర్‌గా ఉద్యోగం వచ్చినప్పుడు, మూడువేలు క్యాష్ డిపాజిట్ అడిగారు వాళ్ళు. ఏం చేయాలో పాలుపోక ఆనాడు తను దయాసాగర్‌నే ఆశ్రయిస్తే, సమయానికి వాడి దగ్గర లేకున్నా మెడలోని పులిగోరు చెయిన్ తాకట్టుపెట్టి మరీ తనని ఆదుకున్నాడు.

అలాంటివాడికి మంచితనం, జాలి మంచి లక్షణాలు కావని తానెలా చెప్పగలడు? నీకో న్యాయమూ, ఇతరులకో న్యాయమూనా అని ఎద్దేవా చేస్తే...? తలతీసి ఎక్కడ పెట్టుకోవాలి తను?

అందువల్ల హితబోధ చేసే ఉద్దేశం మానుకుని, "సర్లేరా... లెట్ ఇట్ బి. మరో ఉపాయం ఏదైనా ఆలోచిద్దాంలే'' అనేశాడు నిరంజన్.

"ఏమోరా... నామీద నాకే నమ్మకం పోతోంది. ఎంతో నిగ్రహంగా వుందామనుకున్నా అదేంటోగాని సాటివ్యక్తులమీద జాలిపడకుండా వుండలేకపోతున్నాను నేను. మా నాన్న అన్నట్టు నిజంగానే నేనెందుకూ కొరగానను కుంటా...'' నిస్పృహ ఆవహించగా నిరాశగా అన్నాడు దయాసాగర్.

అనుకోకుండా జరిగిపోయిన పరిణామానికి అతను బాగా డీలా పడిపోయాడు.

"ఛఛ... అదేం మాటరా! ఉపాయం వుంటే వూళ్ళేలొచ్చన్నారు పెద్దలు... నీకెందుకు నువ్వు ధైర్యంగా వుండు నేనేదో ఒకటి ఆలోచిస్తాగా?'' ఊరడింపుగా అన్నాడు నిరంజన్.

అలా అంటూండగానే అతని మెదడ్లో ఫ్లాష్‌లా ఓ ఆలోచన మెరిసింది.

"రేయ్ నాకో అయిడియా వచ్చింది''

"ఏంటది?''

"నీ జాలిగుండెకీ, వ్యాపారానికీ పొత్తు కుదరదని తేలిపోయిందికదా... కాబట్టి వ్యాపారం సంగతి పక్కన పెట్టేద్దాం. నువ్వెలాగూ ఎమ్మే గోల్డ్‌మెడలిస్ట్‌వి. కాబట్టి డిగ్రీస్థాయిదాకా ట్యూషన్లు చెప్పడం నీకేం కష్టం కాదనుకుంటాను. ఈ రోజుల్లో కోచింగ్ సెంటర్‌లు, స్టడీసర్కిల్స్ పెట్టి సునాయాసంగా లక్షలు సంపాదిస్తున్నారు చాలామంది. నువ్వు సరేనంటే ఇదిగో ఇక్కడే కోచింగ్ సెంటర్ ప్రారంభిద్దాం. ప్రస్తుతానికి ఈ రూమ్‌లోనే నాలుగు బెంచీలూ గట్రా వేస్తే సరిపోతుంది. ఒకరకంగా ఇదీ ఓ వ్యాపారమే అయినా ఇందులో పెట్టుబడిగా వుండేది నీ జ్ఞానమే కాబట్టి నష్టపోవడం అన్న ప్రసక్తే వుండదు. కొత్తకదా అని సంకోచించబాకు... ఈ వీధిలో నాకు తెలిసిన వాళ్ళందర్నీ కలిసి వాళ్ళ పిల్లల్ని నీ దగ్గరికి ట్యూషన్‌కి పంపించమని నేను రిక్వెస్టు చేస్తాను. మొదట్లో డల్‌గా వున్నా నువ్వు బాగా చెబుతున్నావని పేరొస్తే క్రమంగా స్ట్రెంగ్త్ దానంతటదే పుంజుకుంటుంది. టీచింగ్ ఈజ్ ఎ హెూల్ ప్రొఫెషన్. మోరోవర్... ఇంట్లోంచి కాలు బైటపెట్టనవసరంలేకుండా బోలెడంత సంపాదించొచ్చు... ఏమంటావ్?'' అన్నాడు నిరంజన్ ఉత్సాహంగా.

వెరీగుడ్ ఐడియా అనిపించింది దయాసాగర్‌కి.

"చాలా బాగుందిరా... వెంటనే ఆ ఏర్పాట్లేవో చూడు'' అనేశాడు ఇంకేం ఆలోచించకుండా.

★ ★ ★

మర్నాడు దయాసాగర్‌ని వెంటబెట్టుకుని మాధవరావు వాళ్ళ ఇంటికి వెళ్ళాడు నిరంజన్.

వాళ్ళింట్లోకి దారితీస్తుండగా, "ఇక్కడికెందుకూ?'' అని దయాసాగర్ అడిగితే విషయం చెప్పాడు నిరంజన్- "వీళ్ళింట్లో ఓ మొద్దబ్బాయ్ వున్నాళ్ళే... మాధవరావుగారి అన్నకొడుకు. అమ్మా నాన్నల దగ్గర అతిగారాబంవల్ల చెడిపోతున్నాడని ఇక్కడికి పంపించారు. లలిత అనీ వాళ్ళకో అమ్మాయుంది. చూసేవుంటావు బహుశా. ఆమెకన్నా వీడు ఓ ఏడాదో, ఏడాదిన్నరో చిన్న. ఇప్పటికి మెట్రిక్ మూడుసార్లు డింకీ కొట్టాడు. వాణ్ణి నీ దగ్గరకి ట్యూషన్‌కి పంపించమని అడుగుతాను...''

అంటూ.

అలాగే అన్నట్టు తలాడించాడు దయాసాగర్.

వీళ్లు వెళ్ళేసరికి మాధవరావుగారు ఇంట్లోనే వున్నారు. నిరంజన్‌ని గుర్తుపట్టి "ఏవిటిలా వచ్చారు? రండి కూర్చోండి" అంటూ సోఫా చూపించాడు పలకరింపుగా నవ్వుతూ.

క్లుప్తంగా విషయం చెప్పి, "మీ అన్నయ్య గారబ్బాయిని మావాడి దగ్గరికి ప్రైవేటుకి పంపించాలి మీరు. మా మేడమీదే కోచింగ్ సెంటర్ ప్రారంభిస్తున్నాం" అన్నాడు నిరంజన్.

దయాసాగర్‌వైపు తేరిపారజూస్తూ "నిన్నెక్కడో చూసినట్టుందే..." అన్నారు మాధవరావుగారు.

"మా ఇంట్లోనే వుంటున్నాడులెండి. మా ఇంట్లోనే చూసుంటారు బహుశా..." అన్నాడు నిరంజన్.

కాదన్నట్టు అడ్డంగా తలాడిస్తూ, "ఇతని పేరేంటన్నావ్?" అనడిగాడు మాధవరావు నిరంజన్‌ని.

"దయాసాగర్..." చెప్పాడు నిరంజన్.

"అద్దీ సంగతి..." గుర్తొచ్చిందన్నట్టు తలూపుతూ అన్నాడు మాధవరావు. వీళ్ళ నాన్నగారు చెత్తరాయుడుకదూ?"

"కాదండీ ఉత్తరాయుడే. కానైతే స్క్రాబ్ వ్యాపారం చేస్తుంటారు..." అన్నాడు దయాసాగర్ మనసులో ఉడుకుమోత్తనం ముంచుకురాగా.

"అదేలేవోయ్... అదిసరే, నువ్వేదో బ్రాందీ షాపు పెట్టి మూడో నాలుగో లక్షలార్పేశావటగా? ఆ తర్వాత ఇంకేం ఆర్పేవేంటీ?!" నవ్వుతూ అడిగాడు మాధవరావు.

నిరంజన్ ఆశ్చర్యపోయాడు. దయాసాగర్‌కీ ఆశ్చర్యంగానే అనిపించింది.

"వీడి జాతకం అంతా తెలిసినట్టు చెప్పేస్తున్నారే? ఎలా తెలిసిందీ?" అన్నాడు నిరంజన్.

"మీ ఇంట్లో వుంటున్నట్టు నేనెప్పుడూ గమనించలేదులేగాని... ఒకసారి ఈ ప్రబుద్ధుడి ఫొటో చూశాను..." అంటూ విరగబడి నవ్వి, లోకేశ్వరావు తన కూతురికి ఇతగాడి సంబంధాన్ని సజెస్ట్ చేయడం, ఇతగాడి ముదనష్టపు మంచితనాన్ని గురించి పూర్తిగా తెలుసుకున్నాక తాను రిజెక్ట్ చేయడం అదంతా దాచుకోకుండా చెప్పేశాడు మాధవరావు.

అతన్దంతా అదోరకం స్వభావం. వున్నదున్నట్టుమాట్లాడేయడమే! ఎదుటివాళ్ళు ఏవనుకుంటారోనని బొత్తిగా ఆలోచించడు.

దయాసాగర్ ముఖం నెత్తురుచుక్క లేనట్టు పాలిపోయింది, ఆయనగారు తనని గురించి అలా ఎగతాళిగా మాట్లాడ్తుంటే.

కానీ ఏవనగలడు?

అయితే 'లలితని ఒకసారి తనకి ఇవ్వబోయి మానేయడం' అనే అంశం మాత్రం అతనికి చాలా గమ్మత్తుగా అనిపించింది.

అసలీ విషయం తనకింతవరకూ తెలీనే తెలియదాయె.

ఛి ఛీ...తన దిక్కుమాలిన మంచితనం అడ్డురాకపోయుంటే ఎంత బావుండేది? లలిత తన భార్యయ్యుంటే ఎంత అద్భుతంగా వుండేది?

ఇతని ఆలోచనలిలా సాగుతుంటే అవతలి గదిలోంచి ఇదంతా ఆలకించిన లలిత పెరట్లో వున్న తల్లి దగ్గరికి పరుగుతీసింది.

"అమ్మా... అమ్మా ఈ విషయం నిజమేనా...?" అని అడిగింది తల్లిని చెంగుపట్టి చిన్నపిల్లలా లాగుతూ.

తులసికోటకు ప్రదక్షిణాలు చేస్తోన్న జోగాంబ- "ఏవిటే?" అంది సంగతేమిటో తెలియక.

హాల్లో జరిగింది ఆవిడతో చెప్పి- "నాన్న చెప్పింది నిజమేనా?"

"ఆ దయాసాగర్ అనే కుర్రాడి సంబంధం నాకొస్తే వొద్దనేశారటగా?" అంది లలిత.

"ఏ దయాసాగరే బాబూ?"

"చెత్తరాయుడి కొడుకట. అతిమంచితనం అనే అవలక్షణంవల్ల మీరు తిరస్కరించిన సంబంధం..."

కూతురలా గుర్తు చేసేసరికి, "అవునవును" అంటూ తలాడించింది జోగాంబ.

"ఎందుకని కాదన్నారు? నాతో మాటవరసకైనా చెప్పలేదేం?"

"చెప్పేనుగా ఆరోజు... లోకేశ్వర్రావుగారు అదేదో అప్రాచ్యపు సంబంధం తెచ్చేరని..."

"అతను అప్రాచ్యుడెందుకయ్యాడు?"

"కాదామరి? దమ్మిడీకి కొరగానివాడు అప్రాచ్యుడుగాక ఏమవుతాడే?" అంది జోగాంబ, కూతురు అలా ప్రశ్నమీద ప్రశ్న వేస్తున్నందుకు ఒకింత ఆశ్చర్యంగా చూస్తూ.

'దయాసాగర్ తనకు కుదరబోయి తప్పిపోయిన సంబంధం' అనే అంశం లలితక్కూడా గమ్మత్తుగానే అనిపించింది.

తల్లికి వెంటనే ఏమీ బదులివ్వలేకపోయిందామె. ఒకటి రెండుక్షణాల తర్వాత అంది, "అతనిపుడు మన పక్కింటిమేడమీదే వుంటున్నాడు తెలుసా?"

"వుంటే?" అయితే ఏంటన్నట్టు చూసింది జోగాంబ.

"ఏంలేదులే" అనేసి తిరిగి లోపల్కి వెళ్ళిపోయింది లలిత.

ఈమె వెళ్ళేసరికి నిరంజన్‌వాళ్ళు లేరక్కడ.

"ఏం చెప్పారు నాన్నా వాళ్ళతో? మన సూర్యాన్ని పంపుతానన్నారా?" తండ్రినడిగింది లలిత... ఏదో కాజువల్‌గా అడిగినట్టు.

"నువ్వెప్పుడు విన్నావమ్మలూ?" అన్నాడు మాధవరావు.

"ఇందాక వాళ్ళు మీతో చెబుతుంటే విన్నాన్లే... అతను ఎమ్మే గోల్డ్‌మెడలిస్ట్ కాబట్టి చదువులో గట్టివాడే అయ్యుంటాడు. మన సూర్యం ఎలాగూ మొద్దేకదా... పోతే పంపించి చూడండి, అక్కడైనా బాగుపడ్తాడేమో..." అంది సిఫారసు చేస్తున్న ధోరణిలో.

"పంపుతాననే చెప్పేన్లే. అయినా వాళ్ళింకా ఆ కోచింగ్ సెంటరేదో ప్రారంభించాలిగా. ఓ ఇరవైమంది కుర్రాళ్ళన్నా పోగైతే తప్ప... ఆ ప్రయత్నం సాగుతుందో లేదో?" అనేశాడు మాధవరావు.

సాగితే బాగుణ్ణు... దయాసాగర్ ఆ కోచింగ్ సెంటరేదో ప్రారంభిస్తే బాగుణ్ణు... అనిపించింది లలితకి.

ఎందుకూ అంటే చెప్పలేం. మొత్తానికైతే అలా అనిపించింది లలితకి.

అన్నట్టు మొన్నటిదాకా అదేదో మెడికల్ షాపులో ఉద్యోగం చేస్తున్నాడని చెప్పిందికదా వరలక్ష్మి వదిన అదేమైనట్టు.

సందేహనివృత్తికోసం వేరేపనేమీ లేకపోయినా, నిరంజన్‌వాళ్ళ ఇంటికి దారితీసింది లలిత.

వెళ్ళగానే ఆరాతీయడం బాగుండదు కాబట్టి, కాసేపేదో పిచ్చాపాటీ మాట్లాడి... ఆ తర్వాత అసలు విషయం కదిపింది లలిత.

"ఇందాక అన్నయ్యగారూ, మీ మేడమీద బ్బాయి మా ఇంటికొచ్చారు. ఏదో కోచింగ్ సెంటర్ పెట్టాలనుకుంటున్నారటకదా? మా సూర్యాన్ని చేర్పించమని అడిగారు. మరతనేదో మెడికల్ షాపులో చేస్తున్నాడన్నావుగా అదేమైందీ?"

వరలక్ష్మి నవ్వింది "షరా మామూలే..."

"అంటే?"

"ఇదివరకో బ్రాందీషాపు పెట్టి ఆరిపోయాడని చెప్పేనుకదా... అలాగే దీన్నీ ఆర్పబోతే పన్లోంచి తీసేశారు..." అని ప్రారంభించి విషయం సవివరంగా చెప్పుకొచ్చింది.

అంతా విని "మొత్తానికి భలే కుర్రాడే" అంటూ నవ్వింది లలిత.

"అవును. ఇంటికొచ్చేయమని వాళ్ళమ్మావాళ్ళు ఎంత పోరుతున్నా వినిపించుకోవడంలేదు. పౌరుషం ఎక్కువే... ఎటొచ్చీ లోకజ్ఞానమే లేన్ది..." అంది వరలక్ష్మి జాలిగా.

ఆ సంభాషణను అలాగే సాగిస్తూ మాటల మధ్య దయాసాగర్ గురించి మరిన్ని వివరాలు అడిగి తెలుసుకుంది లలిత.

మర్నాడు రజితని కలిసి దయాసాగర్ గురించి తాను తెలుసుకున్నదంతా ఆమెతో చెప్పింది లలిత.

అదంతా విని ఫకాలున నవ్వి, "అదిసరే... అతన్ని గురించి నీ కెందుకే ఇంత ఇంట్రస్టు?" అంది రజిత.

వెంటనే సమాధానం చెప్పలేకపోయింది లలిత.

చెప్పడానికసలు ఆమెకు మాత్రం తెలిస్తే కదా?

"ఏంలేదు. ఈలోకంలో చెడ్డవాళ్ళని చెడ్డవా

ళ్ళుగా గుర్తించి అసహ్యించుకుంటాం. దూరంగా వుంచుతాం. అది బాగానే వుంది. కానీ మంచితనం మితిమీరిపోవడంవల్ల ఒక వ్యక్తి ఇలా అసమర్థుడిగా పేరుపడిపోవడం వుంది చూశావూ, అదే నాకు ఆశ్చర్యంగా వుంది...''

''అవును...'' అంది రజిత.

''అలాంటివాళ్ళు ఇక మారరంటావా?''

''ఏం? మార్చి నీవాడిగా చేసుకోవాలని పిస్తోందా?'' బుగ్గల్ని ఉబ్బించి నవ్వు దాచుకుంటూ అంది రజిత.

లలిత కోపగించుకోలేదు సరిగదా, సీరియస్‌గా అంది, ''ఓవర్ మంచితనం అనే డిస్‌క్వాలిఫికేషన్ వుండుండకపోతే అతను నావాడు అయ్యుండేవాడే! మా అమ్మానాన్నలు సంతోషంగా ఒప్పుకునుండేవాళ్ళే. నా కందుకే ఇదేదో స్ట్రేంజ్ విషయంగా అనిపిస్తోంది. నావాణ్ణి చేసుకుంటానా లేదా అన్నది అటుంచితే, మొత్తానికి అతనిలో మార్పు తేవడానికి ప్రయత్నించాలనే అనిపిస్తోంది నాకు...''

''ఆలోచన మంచిదే... కానీ ఒక్క సందేహం...''

ఏంటన్నట్టు చూసింది లలిత.

''అతనిమీద నీ కెందుకింత ఆసక్తి కలుగుతోంది? స్నేహితురాల్నికదా నాముందు దాపరికందేనికి? నిజం చెప్పు... నేనెవ్వరికీ చెప్పన్లే... నువ్వు అతన్ని ఇష్టపడుతున్నావుకదూ?''

''ఊహుఁ...'' బిడియంగా నవ్వుతూ అడ్డంగా తలాడించింది లలిత. ''ప్రస్తుతానికి నాలో అలాంటి ఊహలేమీ లేవు...''

''కానీ ముందుముందు చెప్పలేనంటావ్''

రజిత ప్రశ్నకు సిన్సియర్‌గానూ, సీరియస్‌గానూ జవాబిచ్చింది లలిత... ''అవును''.

''అమ్మదొంగా'' అన్నట్టు కళ్ళెగరేసింది రజిత.

★ ★ ★

నిర్ణయం గట్టిదైవుండాలేగానీ మనిషి సాధించలేనిది ఏముంటుంది?

ఓ వారం తిరిగేసరికల్లా నిరంజన్‌వాళ్ళ ఇంటిముందు 'దయాసాగర్ కోచింగ్ సెంటర్' అనే బోర్డొకటి వెలిసింది.

పదహారుమంది స్టూడెంట్స్‌తో ప్రారంభమైంది ఆ కోచింగ్ సెంటరు.

వాళ్ళందర్నీ తన ఇన్‌ఫ్లుయన్స్ ఉపయోగించి నిరంజనే సమీకరించాడు.

ఓ మంచి ముహూర్తం చూసి వరలక్ష్మిచేత టెంకాయా గట్రా కొట్టించి ప్రారంభోత్సవం చేశారు.

ప్రారంభించినవేళా విశేషమో ఏమోగాని... నిండా ఓ నెలైనా తిరక్కముందే మాంఛి ఊపందుకుంది దయాసాగర్ కోచింగ్ సెంటర్.

స్ట్రెంగ్త్ పదహారునుంచి ముప్పైఏడుకి పెరిగింది.

మెడికల్ షాపులో ఆ ఉద్యోగంకన్నా ఈ టీచింగ్ ప్రొఫెషన్ దయాసాగర్‌కి ఎంతో ఉల్లాసకరంగా వుంటోంది.

రోజులు హాపీగా గడిచిపోతున్నాయ్.

అయితే ఫీజు వసూళ్ళ విషయానికొచ్చేసరికల్లా దయాసాగర్ మళ్ళీ పాత పద్ధతిలోనే తన చేతగానితనాన్ని నిరూపించుకున్నాడు.

ఆ ఇన్‌స్టిట్యూట్‌లో ఫీజులు చెల్లించడానికి ఆఖరితేదీ ప్రతినెలా ఏడో తారీఖుగా నిర్ణయింపబడింది.

ఎనిమిదోతేదీన... ''ఏరా ఫీజులన్నీ వసూలయ్యాయా?'' అని నిరంజన్ అడిగితే బెబ్బెబ్బే అన్నాడు దయాసాగర్.

ఏవిటయ్యా సంగతీ అని ఆరాతీస్తే అప్పుడు తెలిసింది అసలు విషయం.

ఒకరోజు నిరంజన్ అందర్నీ ఫీజడుగుతుంటే... ఒకబ్బాయి ''మా నాన్న రిక్షాపుల్లర్ సార్! ఆరోగ్యం బాగోలేక ఈ నెల్లో సరిగ్గా బండెయ్యలేదు. ఇల్లు గడవడమే కష్టంగా వుంటోంది. అందుకని మీ ఫీజు ఈ నెలదీ పైనెలదీ కలిపి వచ్చేనెల్లో ఇచ్చేస్తా...'' అంటూ బీదముఖం పెట్టాట్ట.

దాంతో తన సహజలక్షణం కొద్దీ, ''మీరు మరీ అంత పేదవాళ్ళని నాకు తెలీదు చిట్టిబాబూ. సరే అలాగే కానివ్వులే...'' అనడమే కాకుండా... ''ఇకనుంచి నువ్ సగంఫీజు కట్టు చాలు'' అంటూ అప్పటికప్పుడే రాయితీ కూడా ప్రకటించేశాట్ట దయాసాగర్.

దాంతో మాష్టారి మెతకదనం కనిపెట్టి మరో



అయిదారుగురు కూడా ఏవేవో కుంటిసాకులు చెప్పి తప్పించుకున్నారు ఫీజు కట్టడం.

లలితావాళ్ళ పెదనాన్న కొడుకు సూర్యం ద్వారా తెలిసింది ఇదంతా నిరంజన్‌కి.

ఇలాగిలా జరిగిందటకదా అని దయాసాగర్‌ని నిగ్గదీస్తే బుకాయించడానికి వీల్లేక "అవున్రా" అంటూ ఒప్పేసుకున్నాడు.

నిరంజన్‌కి మామూలుగా ఏడ్వాలో, లేక దొర్లి దొర్లి ఏడ్వాలో అర్థంకాలేదు.

"ఇలాగైతే ఎలాగురా? అసలే నీ భవిష్యత్తంతా నువ్వు సంపాదించబోయే డబ్బుమీదే ఆధారపడివుంది. నువ్విలా రాయితీలూ అవీ ఇచ్చేస్తూ ఫీజులు సరిగ్గా కలెక్ట్ చేయలేకపోతే ఎలా? ఇలాగైతే నీ శపథం ఎప్పటికి నెరవేరాలీ?" అన్నాడు గట్టిగా మందలిస్తే మిత్రుడెక్కడ నొచ్చుకుంటాడోనని సున్నితంగానే మందలిస్తూ.

"ఏం చేయమంటావురా? నా మనస్తత్వం అలాంటిది..."

"మనస్తత్వమా గాడిదగుడ్డా? ఇదంతా సిమెతకదనం. లేదా పైత్యం. ఈ ప్రాక్టీస్ ఇలాగే కంటిన్యూ అయితే అతికొద్దికాలంలోనే ఈ కోచింగ్ సెంటర్ కాస్తా ఉచిత విద్యాబోధనా కేంద్రంగా మారిపోవడం ఖాయం! నువ్ నీ వంతాన్ని నెగ్గించుకోలేకపోవడమూ ఖాయం. మీ నాన్నముందు నువ్వు ఝుళ్ళి తలెత్తుకు నిలబడాలి అంటే ఈ పద్ధతి ఎంతమాత్రం పనికిరాదు. ఇకనుంచి ఫీజులు కలెక్ట్‌చేసే డ్యూటీ నీదికాదు. నేనో ఎవరమో టేకప్ చేస్తాం. వానికి నువ్ అంగీకరంచి తీరాలి" తనమాటకిహ తిరుగులేదన్నట్టుగా చెప్పాడు నిరంజన్.

"సరే" అనక తప్పలేదు దయాసాగర్‌కి.

దాంతో ఆ ప్రోబ్లమ్ కాస్తా సాల్వ్ అయ్యింది. ఆ పైనెల్లో ఫీజు వసూళ్ళ సంగతి వరలక్ష్మీ, నిరంజన్‌లు చూసుకున్నారు. ఫలితంగా ఏడో తారీఖు సాయంత్రానికల్లా రావాల్సిన ఫీజంతా వసూలయ్యింది- క్రిందటినెల్లో రావాల్సిన బకాయిల్తోసహా.

దయాసాగర్‌తో దగ్గర్లో వున్న ఓ బ్యాంకులో ఓ సేవింగ్స్ బ్యాంక్ అక్కౌంట్ ఓపెన్ చేయించి, వసూలైన మొత్తాన్ని అందులో జమ చేసి, పాస్‌బుక్‌ని అతగాడి జేబులో పెట్టాడు నిరంజన్.

"ఫర్వాలేదు. ప్రోగ్రెస్ బాగానే వుంది. ఇంకాస్త పికప్ అయితే నువ్వు నీ గోల్ రీచ్ కావడం కష్టం కాకపోవచ్చు..." అన్నాడు మిత్రుణ్ని ఉత్సాహపరుస్తూ.

మిత్రుడి మాట కాదనలేక ఫీజు వసూళ్ళ జోలికి మళ్ళీ అయితే పోలేదుగాని... మనసులో మాత్రం బాధగానే అనిపిస్తూండేది దయాసాగర్‌కి- బీదా గొప్పా అన్న తారతమ్యం చూపకుండా అందర్నుండీ గోళ్ళూడగొట్టి మరీ ఫీజులు వసూలు చేస్తున్నందుకు.

ఎలాగైతేనేం మొత్తానికి కోచింగ్ సెంటర్ సవ్యంగానే కాదు, రానురానూ ఉజ్వలంగా కూడా సాగిపోసాగింది.

దయాసాగర్ టీచింగ్ బాగా వుంటోందని పేరు రావడంవల్ల స్ట్రెంగ్త్ నానాటికీ పెరగసాగింది.

వాళ్ళూ వీళ్ళూ చెప్పగా ఇతగాడి ప్రయోజకత్వం గురించి రాయుడి క్కూడా తెలిసింది.

ముఖ్యంగా రాయుడి స్నేహితుడు కామేశ్వర్రావైతే బాగా ఇదిగా చెప్పాడు దయాసాగర్ గురించి.

"ఇన్నాళ్ళకి మీవాడో దార్లో పడ్డట్టున్నాడు. పూర్వంరోజుల్లో అయితే విద్యాదానం అనేవాళ్ళు. కానీ ఇవ్వాళా రేపూ విద్యాబోధన కూడా మాంచి గిట్టుబాటు వ్యాపారమైపోయింది. ఇనుముని వేడిగా వున్నపుడే వంచాలి. కాబట్టి నువ్ నీ బెట్టు తగ్గించుకుని వాణ్ణి ఇంటికి తీస్కొచ్చేసుకో. నువ్ కాస్త భారీ ఎత్తున పెట్టుబడి పెట్టి ఆ కోచింగ్ సెంటర్నే మంచి బిల్డింగ్‌లోకి మార్చి ఇంప్రూవ్ చేశావనుకో... సందేహం లేకుండా లక్షలే సంపాదించగల్గుతాడు నీ కొడుకు..." అంటూ అతగాడు బాగా తలకెక్కించడంతో, రాయుడు ఓ మెట్టు దిగొచ్చి తానే స్వయంగా వెళ్ళాడు తనయుడి దగ్గరికి.

"జరిగిందేదో జరిగిపోయింది... ఆ దేవుడి దయవల్ల నువ్వో మంచిదారిలో పడ్డావు. నువు ప్రయోజకుడివే అని అంగీకరిస్తున్నాలేగాని, ఇక మనింటి కొచ్చేసెయ్. నీక్కావలసినంత పెట్టుబడి నేనిస్తాను. ఈ కోచింగ్ సెంటరే భారీ ఎత్తున పెట్టి శుభ్రంగా బతుకుదువుగాని..." అంటూ నచ్చచెప్పబోయాడు కొడుక్కి.

కానీ దయాసాగర్ పట్టు విడవలేదు.

"నువ్విచ్చిన గడువు పూర్తికావడానికి ఇంకా మూడు నెలలకు పైగానే టైముంది. అది పూర్తవ్వాలి, అప్పటికి నేను ముప్పైవేలు సంపాదించగలగాలి, అప్పుడే తిరిగి నేను మళ్ళీ మనింటికి రావటం..." అంటూ భీష్మించుక్కూర్చున్నాడు.

చెప్పకేం? రాయుడు బాగానే ప్రాధేయపడ్డాడు. కానీ ఫలితం లేకపోయింది.

దాంతో ఆయనకు వెనుదిరక్క తప్పలేదు.



"సరిగ్గా చదివేడిస్తేగా? పద్ధాకా స్నేహితురాళ్ళూ షికార్లూనాయె!" అన్నాడు మాధవరావు కోపంగా.

లలిత తల దించుకంది.

"అదేం చేస్తుందండీ? పరీక్షల్లో జయాపజయాలు మన చేతుల్లో వుంటాయా ఏంటి? ఆ రజిత దీనికన్నా బాగానే చదువుతుంది మరి... అయినా ఆ పిల్లా తప్పిందిగా?" కూతుర్ని వెనకేసుకొస్తూ అంది జోగాంబ.

ఆరోజే లలితా వాళ్ళ రిజల్ట్స్ వచ్చాయి.

లలిత తప్పికూర్చుంది.

అదీ విషయం.

అయితే గుడ్డిలో మెల్లలా చెప్పుకోదగ్గ విషయం ఏవిటీ అంటే మొత్తం అన్నిసబ్జెక్ట్సూ తన్నేయలేదు. కేవలం ఒకేఒక్క సబ్జెక్టులో

పోయింది... ఎకనామిక్స్.

ఓ అరగంట తర్వాత రజిత వచ్చింది వీళ్ళింటికి.

ఆమెకు ఎకనామిక్స్‌తోపాటు పొలిటిక్స్ కూడా పోయింది.

"ఏమ్మాయ్... ఎలా రాశారూ అనడిగితే గంగిరెద్దుల్లా ఇద్దరికిద్దరూ బాగానే తల్లూపే రుగా? మరిదేవిటీ?" అన్నాడు మాధవరావు రజితతో.

"ఏమో అంకుల్..." అంది రజిత బిడియంగా తలదించుకుంటూ.

అంతలో ఏదో పనిమీద ఆ గదిలో కొచ్చిన సూర్యం- "పోనీ ఒకపని చెయ్యండిద్దరూ..." అన్నాడు.

"ఏంట్రా అది?" మాధవరావు అడిగాడు.

"మా మాష్టారు చాలా బాగా చెబుతారు బాబాయ్. వీళ్ళు కూడా మా కోచింగ్ సెంటర్లో గనక జేరితే సెప్టెంబర్లో పాసైపోవడం ఖాయం..." చెప్పాడు సూర్యం.

"వాళ్ళ సంగతిసరే. నీ సంగతి చెప్పు... ఈ సారైనా నువ్ పాస్ అవుతావా?"

"ఓ" అంటూ తలెగరేసి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు సూర్యం. చిన్నవాడైనా వాడిచ్చిన సలహా బాగానే వున్నట్టనిపించింది మాధవరావుకి.

"ఏంటమ్మాయ్? వాడేదో అంటున్నాడు మరి. మీ ఉద్దేశమేంటి? చేర్తారా దయాసాగర్ కోచింగ్ సెంటర్‌లో?" అడిగాడు ఇద్దర్నీ ఉద్దేశించి.

కాసేపు ఒకరిముఖం ఒకరు చూసుకుని... ముక్తకంఠంతో "చేర్తాం" అంటూ నిలువుగా తల్లాడించారు స్నేహితురాళ్ళిద్దరూ.

ఫలితంగా ఆ మర్నాడే వాళ్ళిద్దరూ దయాసాగర్ కోచింగ్ సెంటర్లో పాదాలు మోపేరు.

అప్పటికే ఆ కోచింగ్ సెంటర్‌లో ఓ ముగ్గురమ్మాయిలున్నారు. వీళ్ళతో కలిపి మొత్తం అయిదుగురయ్యారు.

★ ★ ★

లలిత తన కోచింగ్ సెంటర్లో చేరడం దయాసాగర్‌కేదో చెప్పలేని ఆనందాన్ని కలిగించింది.

కూడదనుకుంటూనే ఆమె విషయంలో ప్రత్యేక శ్రద్ధవహించి మరీ చెబుతుండేవాడు పాఠాలు.

లలిత మరీ అమాయకురాలేం కాదు.

మాష్టారు తన మీదేదో స్పెషల్‌లైకింగ్ చూపిస్తున్నాడని ఇట్టే గ్రహించేయగలిగింది.

రజిత కూడా అబ్జర్వ్ చేస్తూనే వుంది ఇదంతా.

సమయం దొరికినపుడల్లా లలితని ఉడికించడం కూడా చేస్తుండేదామె... "నీకేంటే? స్పెషల్ ఇంట్రస్ట్ తీసుకుని నీ తల్లోకి బాగా ఎక్కేదాకా నూరి పోసే మాష్టారు దొరికాడు. ఈసారి నువ్ పాసైపోవడం గ్యారంటీ. ఎటొచ్చీ నాదే లేటు కేసు..." ఇలాంటి మాటల్తో.

"అదేంలేదు.. మాష్టారికి అందరూ సమానమే. ఏం నీకు మాత్రం బాగా చెప్పట్లేదా?" అనేది లలిత అందులో నిజం లేదని తెలిసి కూడా.

"నాకేదన్నా డవుటొచ్చి రెండోసారడిగితే విసుక్కుంటారు. కానీ నిన్నెప్పుడైనా అలా విసుక్కున్నారా? బుకాయించినంత మాత్రాన్న నిజం దాగదేతల్లీ. పైకి తేలడం లేదుగాని, నువ్వంటే ఆయనకి మహా ఇది..." అంటూ ఏదో వంకర మాట జోడించేది రజిత.

రజిత అలా మాట్లాడ్డం లలిత కెందుకోగాని చాలా ఇష్టంగా అనిపించేది.

ముసుగులో గుద్దులాట లేకుండా చెప్పాలీ అంటే- లలితా, దయాసాగర్‌ల మధ్య ఏదో పరస్పరాకర్షణ లాంటిది ప్రారంభమైందనే చెప్పాలి.

రోజులలా దొర్లిపోతున్నాయి.

లలితా దయాసాగర్‌ల మధ్య ఏర్పడిన ఆకర్షణ ఓ దోబూచులాటగా వుండిపోయిందే తప్ప... మరే పేపూ తీసుకోలేదు.

కారణం... ఐలవ్‌యూ అని ఎదుటి వ్యక్తితో చెప్పడానికి ఇద్దరిలో ఏ ఒక్కరూ సాహసించలేకపోవడం.

స్త్రీ సహజమైన బిడియం లలితకి.

లలిత ఏమనుకుంటుందో? అందునా తన్నో అప్రయోజకుడిగా ఎంచి వాళ్ళమ్మానాన్నలు ఏనాడో తిరస్కరించేసిన కేసాయె తనది!

అలాంటప్పుడు లలిత ఎలా అంగీకరిస్తుంది? అన్న భయం దయాసాగర్‌ది.

★ ★ ★

ఒకరోజు... తండ్రికి బాగోలేదని అన్నగారి దగ్గర్నుండి లెటర్ రాగా ఆ ఊరికి ప్రయాణమయ్యాడు మాధవరావు.

అన్నగారంటే సూర్యం తండ్రి.

"అమ్మావాళ్లని చూసి చాలా రోజులైంది. నేనూ వస్తాను" అంటూ సూర్యం కూడా బయల్దేరి వెళ్ళేడాయన్తో.

ఓ మూడ్రోజుల తర్వాత మాధవరావ్ ఒక్కడే తిరిగొచ్చాడు.

"సూర్యం రాలేదేం?" అని జోగాంబ అడిగితే- "మా నాన్నకి చాలా సీరియస్‌గా వుంది. అందుకని అక్కడే వుంచేశాను..." అన్నాడు మాధవరావ్.

"మరి మీరు మాత్రం ఎందుకొచ్చారు? టెలిగ్రాం ఇచ్చుంటే నేనూ, అమ్మాయీ బయల్దేరి వచ్చేవాళ్ళం కదా?" అంది జోగాంబ.

"నేనక్కడుండి మాత్రం చేసేదేముందీ? అర్జంటుగా డబ్బు కావాలి. నాన్నకి కిడ్నీలు రెండూ పాడైపోయాయంట. వీలైనంత తొందరగా కిడ్నీ మార్పిడి ఆపరేషన్ చేయిస్తే తప్ప బతకడం కష్టమని చెప్పేరు డాక్టర్లు. చాలా ఖర్చుతో కూడుకున్న వ్యవహారం. సగం తాను భరిస్తాననీ మిగతాది నన్ను భరించమనీ అన్నాడు అన్నయ్య..." అంటూ తల పట్టుక్కూర్చున్నాడు మాధవరావు.

"ఎంతవుతుందేమిటి?"

"ఉత్త ఆపరేషన్‌కైతే ఓ పాతికవేలు సరిపోవచ్చు. కానీ కిడ్నీ ఇచ్చేవాడు దొరకాలిగా? పేపర్లో ప్రకటన వేయిస్తే డబ్బుకాశపడి ఎవరో ఒకరు ముందుకు రాకపోరు... కానీ ఎవరైనా సరే అధమ పక్షం యాభైవేలకి పైగానే అడుగుతారు..."

ఆ సమయంలో లలిత కూడా అక్కడే వుంది. తాతగారు ప్రాణాపాయ స్థితిలో వున్నందుకు ఆమెకూ బాధగానే వుంది.

"మరైతే ఏం చేద్దామనుకుంటున్నారు. అంత డబ్బంటే మనం మాత్రం ఎక్కడ్నించి తేగలం?"

"అలాగని చూస్తూ చూస్తూ నాన్నని పోగొట్టుకోమంటావా?"

"పోగొట్టుకోమని ఎవ్వరూ అనరు. కానీ అంత డబ్బు ఎక్కడి నుంచి తేగలరూ అంటున్నాను" లోలోన ఏదో సందేహిస్తూ అంది జోగాంబ.

ఆమె సందేహాన్ని నిజం చేస్తూ అన్నాడు మాధవరావ్... "ఏముంది... ప్రస్తుతం ఈ అవసరం గడవడం కోసం బ్యాంకులో వున్న డబ్బు వాడేద్దాం..."

"అది కాస్తా అవజేస్తే మరి అమ్మాయి పెళ్ళి?"

"అన్నింటికీ ఆ భగవంతుడే వున్నాడు. అంతగా అయితే ఇల్లుందిగా..."

"అమ్మి అమ్మాయి పెళ్ళి చెయ్యొచ్చంటారు..." మధ్యలో అందుకుంటూ అంది జోగాంబ. "ఆ తర్వాత మనం ఎక్కడుండాలీ? చెట్ల కిందా?"

"బాగుందే... సొంతిళ్ళులేని వాళ్ళంతా చెట్లకిందే వుంటున్నారా?"

"ఏమోనండీ, నాకు మీ వరసేం నచ్చలేదు..." అనేసింది జోగాంబ నిర్ద్వందంగా.

"మరైతే నన్నేం చెయ్యమంటావో నువ్వే చెప్పు..." అన్నాడు మాధవరావ్.

ఓ అయిదారు క్షణాలు ఆలోచించిన మీదట అమోఘమైన ఐడియా వచ్చింది జోగాంబకి.

"చంకలో పిల్లోడ్ని పెట్టుకుని ఊరంతా వెదికినట్టు ఉత్తినే ఎందుకండీ అలా వర్రీ అయిపోతారు? మన పక్కనే వున్నాడుగా వెర్రిబాగుల దయాసాగర్. అతన్నడగండి కాదనడు..." అంది చేటంత ముఖంతో.

"అతని దగ్గర అంత డబ్బెలా వుంటుందే? నిరంజన్ చెప్పేడుగా అతనేదో తండ్రితో గొడవ పెట్టుకుని ఇంట్లోంచి వచ్చేశాడని..." సాలోచనగా చూస్తూ అన్నాడు మాధవరావ్.

"అయ్యోరామ! అతన్ని డబ్బెవడడగమన్నాడండీ మిమ్మల్ని? కిడ్నీ... కిడ్నీ ఇస్తాడేమో అడగండి. అతన్ని గురించి మనం విన్నదాన్ని బట్టి, మీరడగాలేగాని అతను కాదనడనే అనిపిస్తోంది నాకు..." అదోలా నవ్వింది జోగాంబ.

లలితకు మతిపోయినట్టనిపించింది.

ఎంత అన్యాయం?

తండ్రి జవాబు కోసం చెవులు రిక్కించింది.

"నిజమేనేవ్" అన్నాడాయన ఆనందంగా. "భలే ఉపాయం తట్టింది నీకు. ఉండు... ఇప్పుడే వెళ్ళొస్తా!" అంటూ లేచి నిలబడ్డాడు.

లలిత సహించలేకపోయింది.

ఎంత మంచివాడయితే మాత్రం? ఆ మంచితనాన్ని మరీ ఇంతలా వాడుకోవడమా? నో... ఈ ప్రయత్నాన్ని తను సాగనివ్వకూడదు.

"ఇది చాలా అన్యాయం నాన్నా?" అంటూ దిగ్గున లేచింది కుర్చీలోంచి.

అర్థం కానట్టుచూశాడు మాధవరావ్.

"మీ నాన్నగారి ప్రాణం కోసం... అతను మనకేమవుతాడని అంత మూల్యం చెల్లించడానికి? అమాయకుడు కదాని అయిదో పదో అప్పడిగినట్టు ఏకంగా కిడ్నీ అడిగేయడమే? నేను దీన్ని సహించను..." అంది ఉద్రేకంగా.

"నీకేమన్నా మతిగాని పోయిందా ఏమిటే? ఇస్తేగిస్తే అతను కదా ఇచ్చేది, మధ్యలో నీకేంటి?" జోగాంబ విస్తుబోతూ చూసింది.

"అతను యువకుడు. ముందుముందు బోల్డంత భవిష్యత్తున్న వాడు. తాతయ్యగారికి డెబ్బై ఏళ్ళున్నాయ్. ఈ ఆపరేషన్ చేసినా మహా అయితే ఇంకో అయిదారేళ్ళు బతుకుతాడేమో. ఆ ముసలాయన జీవితాన్ని మరో నాలుగేళ్ళు పొడిగించడానికి అతని నిండు జీవితాన్ని నాశనం చేయాలని చూస్తారా? కిడ్నీ డొనేట్ చేయడం అంటే మాటలు కాదు. లైఫ్ రిస్క్‌తో కూడుకున్న వ్యవహారం..."

'సందేహం లేదు. దీనికేదో పిచ్చెక్కింది' అనుకున్నాడు మాధవరావ్.

లేకపోతే ఏంటి? సొంత తాతగారి ప్రాణంకన్నా అతగాడి ప్రాణం ఎక్కువన్నట్టుగా మాట్లాడ్తోందేం?

"చాలా విచిత్రంగా మాట్లాడుతున్నావమ్మలూ! అవతల చావుబతుకుల్లో వున్నది ఎవరో పరాయివ్యక్తి కాదు. మీ తాతగారు..." అంటూ ఇంకా ఏదో చెప్పబోయాడాయన.

ఖండిస్తూ అంది లలిత... "చావు బతుకుల్లో వున్నది ఎవరైనా కావచ్చు. కానీ ఒకరి బతుక్కోసం వేరొకరి చావును కోరుకోవడం అన్యాయం"

ఓ క్షణమాగి మళ్ళీతనే అంది... "అంతగా కావాలంటే నా పెళ్ళి సంగతి తర్వాత చూసుకోవచ్చు. డబ్బిచ్చి వేరే ఎవరి దగ్గరయినా కొనండి. అంతేగాని అతన్ని మాత్రం అడగబాకండి"

అదే ఆమె చేసిన పొరపాటు. మొదటిచ్చిన స్టేట్‌మెంట్‌కీ దీనికీ పొంతనెక్కడుంది?

వేరేవాళ్ళ దగ్గర కొన్నా ఆ వేరే వాళ్ళకీ లైఫ్ రిస్క్ వుంటుందికదా?

మాధవరావ్‌కి సన్నగా ఏదో అనుమానం వేసింది.

అదోలా చూశాడు కూతురివైపు.

"ఏం అతనంటే నీకెందుకంత ప్రత్యేకాభిమానం?"

తడబడింది లలిత. "అబ్బే... ఏం లేదు... ఆయన... ఆయన మా మాష్టారు కదా! అందుకని..."

కూతురి సమాధానం సంతృప్తికరంగా అనిపించలేదు మాధవరావుకి.

అంతలో జోగాంబ అంది, "అదేదో మతిలేక వాగుతోంది. దాని మాటలకేంటి? మీరు వెళ్ళిరండి ముందు..."

అలాగే అన్నట్టు తలూపి అక్కడ్నించి కదిలాడు మాధవరావ్.

ఆయన వెనకే లలిత కూడా బైటికి దారితీస్తుంటే "నువ్వెక్కడికే?" అంది జోగాంబ.

"రజితా వాళ్ళింటికి" అంటూనే వెళ్ళిపోయింది లలిత.

★ ★ ★

ఏనాడూ లేన్ది మాధవరావుగారు తన రూముకి రావడం చూసి ఆశ్చర్యపోయాడు దయాసాగర్.

"రండి సార్ రండి... ఏంటిలా వచ్చారు? కూర్చోండి" అన్నాడు మర్యాదపూర్వకంగా లేచి నిలబడి ఆయనకు కుర్చీ చూపిస్తూ.

"నీతో చిన్న పనుండొచ్చానోయ్..."

చిన్నపనా? ఇది చిన్నపనా?! కసిగా అనుకొంది తండ్రినే అనుసరించి వచ్చి తలుపు కావల నక్కి దాక్కున్న లలిత.

"చెప్పండి..." అన్నాడు దయాసాగర్ అమాయకంగా.

"నీ బ్లడ్ గ్రూప్ ఏమిటి?"

అసందర్భంగా తోచిన ఆ ప్రశ్నకు ఆశ్చర్య పోతూనే, చెప్పాడు దయాసాగర్ తన బ్లడ్ గ్రూపేమిటో.

"సో అయామ్ వెరీ వెరీ లక్కీ. ఫార్చునేట్‌గా బ్లడ్‌గ్రూప్ టాలీ అయ్యింది" సంతోషంగా చూస్తూ అన్నాడు మాధవరావ్.

దయాసాగర్‌కి విషయం కొద్దిగా బోధపడిన ట్టు అనిపించింది.

ఎవరికైనా బ్లడ్ అవసరమేమో?... తనని డొనేట్ చేయమని అడగటానికి వచ్చాడులా వుంది!

ఆ మాటే అడిగాడు.

"ఏం సార్? ఎవరికయినా బ్లడ్ కావాలా? నన్ను డొనేట్ చేయమని అడగటానికొచ్చారా?"

"అవును బాబూ! డొనేట్ చేయమని అడగ టానికే వచ్చాను... కానీ..." అంటూ అసంపూ ర్తిగా ఆపేశాడు మాధవరావ్.

ఆయన అడగడానికి మొహమాట పడుతు న్నాడేమోననుకుని... "విత్ ప్లెజర్ సార్! నేని లాంటి వాటికి ఎప్పుడూ ముందే వుంటాను. చెప్పండి... ఎప్పుడు రమ్మంటారూ, ఎక్కడికి రమ్మంటారూ?" అన్నాడు దయాసాగర్.

దాక్కునివున్న లలిత లబలబలాడిపో యింది మనసులో. ఈయనకిదేం పిచ్చి? సంగ తేమిటో తెలుసుకోకుండానే ఏంటా దూకుడు? అయ్యో మాష్టారూ మీరెంత పిచ్చివారూ? అను కుంది జాలిగా. అడుగు నాన్నా అడుగు. కానీ నేను నీ ఆటలు సాగనివ్వను అనుకుంది కసిగా.

పడింది పిట్ట! ఆనందంగా అనుకున్నాడు మాధవరావ్ మనసులో.

"థాంక్యూ బాబూ! నీ మంచితనం గురించి అందరూ చెప్పుకుంటుంటే ఏంటో అనుకున్నా ను. కానీ ఇప్పుడర్థమైంది నువ్ ఎలాంటి వాడివో..."

"దాందేముందండీ? ఈ పాటి దానికేనా?" అంటూ తేలిగ్గా నవ్వేశాడు దయాసాగర్.

"అలా అనకు బాబూ! నన్ను పూర్తిగా చెప్పనివ్వకుండానే నువ్ మరోలా అర్థం చేసు కున్నావు. అసలు సంగతి తెలిస్తే నువ్ వెను కంజ వేస్తావేమో..."

"నెవ్వర్... ఎదుటి వ్యక్తికి సహాయం చేయ డంలో నేను వెనుకంజ వేయడం ఎప్పుడూ జరగదు. చెప్పండి..." అన్నాడు దయాసాగర్.

అయ్యో ఖర్మ అనుకుంటూ చప్పుడు కా కుండా నెత్తి బాదుకొంది లలిత.

"ప్రాణాపాయ స్థితిలో వున్న మా తండ్రిని కాపాడుకోవడానికి నాకు నీ కిడ్నీ కావాలి..." పేల్చేశాడు మాధవరావు ఆటంబాంబుని.

"కిడ్నీనా?!" ఖంగుతిన్నట్టుగా చూశాడు దయాసాగర్.

"అవును బాబూ! కిడ్నీనే! అసలు నాదే ఇద్దామనుకున్నాగానీ... వయసు మీరిన వాడ్ని కావడంవల్ల నేనా ఆపరేషన్‌కి తట్టుకోలేనన్నా రు డాక్టర్లు. పోనీ మా సూర్యం దిద్దామా అంటే వాడిది మరీ లేత వయసు కాబట్టి పనికి రాదన్నారు. డబ్బిచ్చి కిడ్నీ కొనేటంత స్తోమత నాకు లేదు. అలాగని చూస్తూ చూస్తూ కన్న తండ్రిని చంపుకోనూ లేకపోతున్నాను..."

పాపం! అనిపించింది దయాసాగర్‌కి.

కన్నతండ్రికి ప్రాణాపాయం అంటే సామా న్యమైన విషయం కాదు. ఎంత కష్టం? ఎంత కష్టం?!

అయ్యయ్యో అనిపించింది దయాసాగర్‌కి.

"ఏం చేయాలో పాలుపోక నేను వర్రీ అవు తుంటే మా లలిత నీ పేరు చెప్పింది బాబూ! మా మాష్టారు సహృదయులు... కాదనరు... వెళ్ళి అడుగు... అంటూ నన్నిక్కడికి పంపించింది..." అసంకల్పితంగా అబద్ధం ఆడేశాడు మాధవరావ్.

దయాసాగర్ ముఖంలో ఏదో వెలుగు లాంటిది చోటు చేసుకుంది.

లలిత... లలిత తనని గురించి అంత గొప్పగా చెప్పిందా? నిజంగా ఇవ్వాళ ఎంత సుదినం?!

జన్మ ధన్యమైపోయినట్టే అనిపించింది దయాసాగర్‌కి.

అసలు మాధవరావ్ లలిత ప్రస్తావన తేకు న్నా తన కిడ్నీ ఇవ్వడానికి ముందు కొద్దామనే అనుకున్నాడు... అలాంటిది లలిత అలా అందని తెలియగానే అతనిలోని పరోపకారో త్సాహం ఏకంగా చిందులే వేయడం ప్రా

రంభించింది.

"డోంట్ వర్రీ సార్! మీ నాన్నగారి ప్రాణం నేన్నిలబెడతాను. ఒకటి కాదు అవసరమైతే నా రెండు కిడ్నీలూ ఇచ్చేయడానికైనా నేను సిద్ధమే!'' అన్నాడు సంబరంగా.

"ఇచ్చేసి నువ్వేమవుదామనుకుంటున్నావు పిచ్చినాయనా?'' అనుకుంది లలిత జాలిగా.

అసలామెకు తండ్రిలేనిపోనిది తన ప్రస్తావన తెచ్చి అబద్ధమాడినపుడే ఒళ్ళు మండిపోయింది. అబద్ధం! నేనలా అన్లేదు అని గట్టిగా అరుద్దామని కూడా అనుకొంది. కానీ ఏం జరుగుతుందో చూద్దామని తన్నుతాను సంభాళించుకొంది అతి కష్టం మీద.

"నువ్ నిజంగా రూపుదాల్చిన మంచితనానివి బాబూ! నీలాంటి వాళ్ళు లోకంలో కోటికొక్కరు కూడా వుండరు. థాంక్యూ... థాంక్యూ వెరీమచ్...'' అంటూ కృతజ్ఞతా పూర్వకంగా చేతులు జోడించబోయాడు మాధవరావ్.

"ఛఛ... అదేం పనండీ! మీరు పెద్దవారు. మీరు నాకు దండం పెట్టకూడదు...'' అంటూ వారించాడు దయాసాగర్. "అయినా ఇందులో నేను చేస్తున్న త్యాగమేముంది? నాకు రెండున్నాయి కాబట్టి ఇస్తానంటున్నాను. అదే ఒక్కటే గనక వుంటే ఇవ్వగలిగేవాడినా?'' అన్నాడు తన ఘనతను తానే తీసి పారేసుకుంటూ.

"మరైతే రేపే మనం బయలుదేరాల్సి వుంటుంది మా వూరికి...'' సిద్ధమేనా? అన్నట్టు చూశాడు మాధవరావ్.

"అయామ్ ఆల్వేజ్ రెడీ! మీరెప్పుడంటే అప్పుడే'' అన్నాడు దయాసాగర్.

నీ మొహం! నీ బొంద! నీ పిండాకూడు! అనుకుంది లలిత కోపంగా. దయాసాగర్ వెర్రితనానికీ, చైల్డిష్‌నెస్‌కీ నిజం చెప్పాలంటే అతగాడి చెంపలు పగలగొట్టాలన్నంత కోపంగా వుందామెకు.

మరి కాసేపటికి... "ఉంటాను బాబూ! ఈ శుభవార్త మా ఆవిడ చెవిన వేసి వస్తాను'' అంటూ లేచాడు మాధవరావ్.

"లలిత చెవిన కూడా వేయండి'' అన్నాడు దయాసాగర్ సంబరంగా.

"అలాగే'' అని తలూపి వెళ్ళిపోయాడు మాధవరావ్.

ఆయనలా వెళ్ళగానే సుడిగాలిలా ఆ గదిలోకి దూసుకొచ్చింది లలిత.

"ఎంత పిచ్చివారండీ మీరు? ఆయనడగ్గానే కిడ్నీ ఇచ్చేయడానికి ఎందుకొప్పుకున్నారు? మీకసలు మతుందా లేదా?'' అంది రావడంతోనే దయాసాగర్‌వైపు తీక్షణంగా చూస్తూ.

"నువ్వు... నువ్వు...''

"నేనీ పక్కనేవుండి అంతా విన్నాను. ఆయనడిగింది కిడ్నీ. పదో పరకో అప్పుకాదు. ఎందుకొప్పుకున్నారంత తేలిగ్గా?''

దయాసాగర్‌కి మతిపోయింది.

ఇదేంటి ఈమె ఇలా అంటోంది?

"మీ నాన్నగారికి నువ్వే చెప్పేవటగా నన్నడగమని?'' అన్నాడు అయోమయంగా చూస్తూ.

"అదంతా అబద్ధం... నేనలా చెప్పలేదు. ఒకవేళ నిజంగానే చెప్పానే అనుకోండి... అంత మాత్రానికే కిడ్నీ ఇచ్చేయడానికి సిద్ధ పడిపోతారా?'' బాగా దగ్గరికెళ్ళిపోయి ఇంచుమించు ముఖంలో ముఖం పెట్టి అడిగింది లలిత.

"నువ్ చెప్పేవనే కాదనుకో... ఆ పరిస్థితిలో ఇవ్వాలిగా మరి? ఎవరో ఒకరు ముందుకు రాకపోతే మీ తాతగారి ప్రాణం నిలబడేదెలా?''

"ఇవ్వాలిగా మరీ అంటే ఏంటి మీ ఉద్దేశం? ఇచ్చి తీరాలని ఎక్కడన్నా రూలుందా? ఇంత అమాయకత్వం అయితే ఎలా మాష్టారూ? కిడ్నీ ఇవ్వడం అంటే ఎంతో రిస్క్‌తో కూడుకున్న పని... ఒకవేళ మీకేవయినా అయితే? మీ సంగతి మీరాలోచించుకునే పనే లేదా?''

"అదేంటి లలితా అలా మాట్లాడ్తావ్? రిస్క్ వుందికదాని అవతల ఒక నిండు ప్రాణం పోతుంటే చూస్తూ ఊర్కోగలమా?'' వెర్రిచూపు చూశాడు దయాసాగర్.

లేదూ అది మంచి చూపే కావొచ్చుగానీ, లలితకి మాత్రం అలా అనిపించింది.

"గలమా? అని నన్ను కూడా కలపకండి. నేనయితే నాకు సంబంధంలేని ఓ అనామకుడి కోసం నా కిడ్నీ ఇవ్వడానికి ఎంత మాత్రం ముందుకు రాను. నేను కాదు... మీ స్థానంలో

ఎవరున్నా ముందుకు రారు. మంచితనాని క్కూడా ఓ హద్దంటూ వుండాలి మాస్టారూ దిసీజ్ టూమచ్. మీ కిడ్నీ ఇవ్వడానికి నేను చచ్చినా ఒప్పుకోను..." ఆవేశంగా అంది లలిత.

"అలా అంటే ఎలా లలితా... అవతల మీ తాతగారు..."

"పోతే పోతాడు. ఇవ్వాళ కాకపోతే రేప యినా పోవాల్సిన వాడే ఆయన. డెబ్బై ఏళ్ళ ఆ ముసలాయన కోసం మీరింత రిస్క్ తీసుకో వడం నేనెంత మాత్రం ఒప్పుకోను"

"లలితా!?" దిగ్భ్రమగా చూశాడు దయా సాగర్. "మీతాతగారి ప్రాణంకన్నా..." ఏదో అడగబోయాడుగాని గొంతు పెగల్లేదు.

"అవును మాష్టారూ! మా తాతగారికన్నా నాకు మీరే ముఖ్యం. మీ శ్రేయస్సే ముఖ్యం..." స్థిరంగా పలికింది లలిత. "వై బికాస్ యూ నో"

ఆశ్చర్యంగా చూస్తూన్నాడు దయాసాగర్. "బికాస్ అయ్ లవ్ యూ... అయ్ లవ్ యూ సోమచ్" అంటూ పూర్తిచేసి బిడియంగా అర చేతుల్లో ముఖం దాచుకొంది లలిత.

"లలితా..." అన్నాడు దయాసాగర్ సంభ్ర మానందాలు సమ్మిళితమైన గొంతుకతో.

లలిత... లలిత తనని ప్రేమిస్తోంది.

నిలువెల్లా పులకింత!

తీయని పానీయమేదో గొంతులోంచి క్రింది కి జాలువారుతూ నరనరాలకూ వ్యాపిస్తోన్న భావన... విచిత్రమైన అనుభూతి.

"ఎస్... ఐ లవ్ యూ" బిడియాన్ని తరిమి కొడ్తూ దయాసాగర్ చేతిని తన చేతిలోకి తీసు కుంది లలిత. "మీలోని ఎక్స్ట్రార్డినరీ మంచి తనం నన్ను ముగ్ధురాల్ని చేస్తోంది. అందుకే... నేను... మీరు నా మనిషి కావాలని కోరుకుంటు న్నాను... బట్ మీలోని మంచితనం కేవలం 'మంచితనం'గా మాత్రమే వుండాలి తప్ప- వెర్రిబాగులతనంగా గుర్తింపబడటాన్ని నేను సహించలేను. నా కోసమైనా మీరు తాతగారికి కిడ్నీ ఇవ్వడం మానుకోవాలి. దట్సాల్..."

హృదయం సంతోషంతో ఉక్కిరిబిక్కిరైపో తుంటే - 'అలాగే' అన్నట్టు నిలువుగా తలా డించిన దయాసాగర్ అంతలోనే స్పృహలోకొ చ్చి... "అదెలా సాధ్యం లలితా నేను మీ నాన్నగారికి మాటిచ్చేశానుగా?... నీ మాట కా దంటున్నందుకు నన్ను మన్నించు... ఇచ్చిన మాటని నేను వెనక్కి తీసుకోలేను" అన్నాడు నిస్సహాయుడికి మల్లేచూస్తూ.

"య్యూ ఫూల్ ఆఫ్ ఏన్ యాస్" అని తిట్టాలనిపించింది లలితకి.

ఆవేశంలో అంతమాటా అనేసుండేదేమో కూడా. కానీ అంతలో "ఏంటర్రా మీరిద్దరూ రహస్యమంతనాలాడుతున్నారు?" అంటూ వరలక్ష్మి అక్కడికి రావడంతో ఆగిపోయింది.

వరలక్ష్మి వచ్చేసరికి దయాసాగర్‌కి చాలా సమీపంగా నిలబడిందామె.

వరలక్ష్మిని చూస్తూనే ఒకింత ఎడంగా జరిగి బిడియంగా తల దించుకుంది.

"ఏం లేదొదినా? ... ఏదో చిన్న డవుటొస్తే నూ..."

అలాగా అన్నట్టు తలైతే ఆడించిందిగాని... వరలక్ష్మి మనసులో సందేహం మాత్రం రానేవ చ్చింది.

నిజానికారోజు ఆదివారం కాకపోయుంటే ఆ రూమ్‌లో ఆ సమయానికి ట్యూషన్ సాగు తూండాల్సిన మాట.

"వస్తానొదినా... వస్తాను మాష్టారూ..." ఇద్దరి కీ చెప్పి చకచకా అక్కడ్నించి వెళ్ళిపోయింది లలిత.

ఆమె వెళ్ళేక అడిగింది వరలక్ష్మి. "ఇందాక మాధవరావుగారొచ్చినట్టున్నారు... దేనికి?"

"ఏం లేదు చెల్లెమ్మా..." అని మొదలెట్టి విషయమంతా చెప్పుకొచ్చాడు దయాసాగర్. లలిత తనని వారిస్తోన్న విషయం కూడా చెప్పాడు. కానైతే ఆమె తనపట్ల ప్రేమను వ్యక్తంచేసిందన్న సంగతిమాత్రం బైటపెట్టలే దు.

వరలక్ష్మికి దయాసాగర్ మీద జాలేసింది.

హవ్వ! మరీ ఇంత అమాయకత్వమా?!

లలిత వారించబోయిందని చెప్పడంవల్ల అంతక్రితం ఆమెలో తలెత్తిన సందేహం మరి కాస్త బలపడింది.

లలిత దయాసాగర్‌ని ఇష్టపడుతోందన్న మాట!

ఇతని ఉద్దేశం ఏమిటో మరి?

ఇద్దరికీ నిజంగా జత కలవాలేగాని, జంట చూడచక్కగా వుంటుందనిపించింది వరలక్ష్మికి.

దయాసాగర్ చేయబోతున్న పిచ్చిపని (కిడ్నీ దానం) మాత్రం ఆమెకు బొత్తిగా నచ్చలేదు.

అయితే వొద్దని తను చెప్పడంకన్నా భర్తతో చెప్పిస్తే బాగుంటుందనిపించిందామెకు.

అందుకే విషయం తెలుసుకుని కూడా "మీ ఇష్టం అన్నయ్యగారూ" అని పొడిగా అనేసి వెళ్ళిపోయిందామె.

ఆ సమయంలో నిరంజన్ ఇంట్లోలేడు.

ఏదో పనిమీద బయటకు వెళ్ళాడు.

ఓ అరగంట తర్వాత నిరంజన్ ఇంటికి రాగా, దయాసాగర్ నిర్వాకం గురించి అతన్తో చెబుదామని వరలక్ష్మి ఇంకా అనుకుంటూనే వుండగా...

లలిత వచ్చి ఓ దుర్వార్త చెప్పింది.

వాళ్ళ తాతగారు పోయినట్టు టెలిగ్రాం వచ్చిందనీ, అందువల్ల తామంతా ఊరెళ్తున్నామనీ.

"తాతగారంటే?" అన్నాడు దయాసాగర్ కంగారుగా.

"మా నాన్న నాన్నే. మీరు కిడ్నీ ఇవ్వబోయిన శాల్తీయే" అంది లలిత.

ఆమెలో తాతగారు పోయారన్న బాధకన్నా దయాసాగర్ ఆయనకు కిడ్నీ ఇవ్వాల్సిన అవసరం తప్పిపోయిందన్న రిలీఫే ఎక్కువగా కనిపించింధి వరలక్ష్మికి.

"అరెరెఁ... ఎంత ఘోరం జరిగింది!!" బాధగా అన్నాడు దయాసాగర్. "మీ నాన్నగారు ఈ అడగడమేదో మరో పదిపదిహేను రోజులు ముందన్నా అడిగారుకాదు. పాపం మీ తాతగారు బతికుండేవారు..."

కిడ్నీ ఏమిటో, అడగడమేమిటో, అసలీ గొడవంతా ఏమిటో కొంచెం కూడా అర్థం కాలేదు నిరంజన్కి.

సంగతేమిటన్నట్టు భార్యని కళ్ళతో ప్రశ్నించాడు.

చెప్తానుండండి అన్నట్టు చేత్తో సైగ చేసింది వరలక్ష్మి.

లలిత దయాసాగర్వైపు చూస్తూ ఏదో అనబోయి మానేసింది.

"సరే నువ్ వెళ్ళు లలితా! అవతల అవీ ఇవీ సర్దుకోవాలేమోగా" అంది వరలక్ష్మి.

లలిత వెళ్ళిపోయాక భర్తతో టూకీగా విషయమంతా చెప్పింది వరలక్ష్మి.

దయాసాగర్ మూర్ఖమంచితనానికి, లేదా మంచి మూర్ఖత్వానికి నివ్వెరపోతూ- "ఒరేయ్, ఒరేయ్! - ఏమిట్రా ఈ పనీ? అసలు నీకేమాత్రమైనా జ్ఞానం వుందట్రా?" అని ఇంకా ఏదో అనబోయాడు నిరంజన్.

"పోనీలే వూరుకోండి. అయిపోయిన పెళ్ళికి బాజాలెందుకు? ఆ ముసలాయన దురదృష్టమో లేక ఈ అన్నయ్యగారి అదృష్టమో... మొత్తానికి ఆయన పోయాడు. చావుకబురు తెలిశాక కూడా వెళ్ళి పరామర్శించకపోతే బావుండదు. పదండి వాళ్ళింటికి వెళ్దాం" అంటూ మాట మార్చింది వరలక్ష్మి.

దాంతో అందరూ కలిసి మాధవరావుగారింటికి పరామర్శకు వెళ్ళారు.

వీళ్ళు వెళ్ళేసరికి సూట్కేసులూ అవీ చేతబట్టుకుని ప్రయాణానికి సిద్ధంగా వున్నారు వాళ్ళు.

వీళ్ళని చూడగానే... ముఖ్యంగా దయాసాగర్ని చూడగానే దుఃఖాన్ని అణచుకోలేక బావురుమన్నాడు మాధవరావు.

"నీ కిడ్నీతో మానాన్న మరో నాలుగైదేళ్ళన్నా బతుకుతాడని ఆశించానయ్యా! ఇంతలోనే ఇంత ఘోరం జరుగుతుందనుకోలేదు" అన్నాడాయన ముక్కు చీదుతూ

నేనూ అనుకోలేదండీ! నేనింకా రేపు మీతోకిడ్నీ ఇవ్వడానికి బయల్దేరే ప్రయత్నంలో ఉన్నాను" అన్నాడు దయాసాగర్.

"నీమొహం" అని మనసులో అనుకుని "ఊరుకోండి మాధవరావుగారూ! అందరం ఏదో ఒకనాడు పోవాల్సిన వాళ్ళమే..." అని అలాంటి సందర్భాలలో అందరూ ఉపయోగించే మాటల్నే వాడుతూ మాధవారావ్ని ఓదార్చబోయాడు నిరంజన్.

ఓ పది నిముషాల తర్వాత మాధవరావు

వాళ్ళని బయల్దేరదీసి, ఆ మీదట నిరంజన్ వాళ్ళు తమ ఇంటికి తిరిగొచ్చేశారు.

అయిపోయిన పెళ్ళికి బాజాలెందుకన్న భార్య మాటలు గుర్తొచ్చినా కూడా మరోసారి మిత్రుడ్ని తిట్టిపోయకుండా వుండలేకపోయాడు నిరంజన్.

అవును మరి.

ఆ ముసలాయన పోయాడు కాబట్టి సరిపోయింది లేకుంటే దయాసాగర్ పరిస్థితి.

★ ★ ★

ఓ పదిహేను రోజుల తర్వాత...

తాతగారి కర్మకాండాదుల అనంతరం ఆరోజే తిరిగొచ్చిన లలిత రాగానే రజితా వాళ్ళింటికి వెళ్ళింది.

"సారీనే! సడన్‌గా టెలిగ్రాం రావడంవల్ల నీకు చెప్పడానికి టైమ్ లేకపోయింది..."

"భలేదానివే... దీనికి సారీ చెప్పడం దేనికి? నాకు కోచింగ్ సెంటర్లో తెలిసింది. మాష్టారు చెప్పారు మీ తాతగారు పోయిన సంగతి. ఈ రోజేనా రావడం? అందరూ వచ్చేశారా?"

"ఆఁ... మా సూర్యంతోసహా అందరం వచ్చేశాం..." చెప్పి... ఓ క్షణం విరామం తర్వాత అడిగింది లలిత.

"అంతేనా? మాష్టారు ఇంకేం చెప్పలేదా?"

రజిత అర్థంకానట్టు చూసింది.

"ఇంకేం చెప్పలేదే?" అంది బుగ్గన వేలుంచుకుంటూ.

"నీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలి. అలా ఎక్కడికైనా బయటకెళ్దామా?"

"ఎందుకూ? ఇక్కడ మనకు కావాల్సినంత ఏకాంతం. అమ్మ కూడా ఇంట్లోలేదు. అలా డాబామీద కూర్చుందాం పద..."

"సరే..."

ఇద్దరూ డాబామీదకు వెళ్ళాక...

"నేను మన మాష్టార్ని ప్రేమిస్తున్నానే" అంది లలిత, ఏదో దేవరహస్యం చెబుతున్నదానికిమల్లే.

"గుడ్..." గమ్మత్తుగా నవ్వింది రజిత.

"నవ్వుతావేమే? నవ్వేలాటక్కాదు. నిజంగానే అంటున్నాను..." లలిత ముఖంలో నును సిగ్గుదొంతరలు.

"నవ్వక ఏడ్వమంటావా ఏంటే? నువ్విప్పుడు చెబుతున్నావ్‌గానీ... నేనీ విషయం ఏనాడో పసిగట్టేశాను. మంచిదే. మనిషి మంచివాడు కోతినాడించినట్టు ఆడించొచ్చు. ప్రొసీడ్... విష్ యూ గుడ్ లక్!" అంటూ స్నేహితురాలికి షేక్‌హేండ్ ఇచ్చింది రజిత.

"అది సరే ఇన్నాళ్ళూ నీ ప్రేమని గుండెల్లోనే దాచుకున్నదానివి ఇపుడిలా సడన్‌గా అనౌన్స్ చేసేయడానికి కారణం?"

చెప్పింది లలిత... తమ తాతగారు పోయారన్న వార్త రావడానికి ముందేం జరిగిందో.

"మాష్టారి మంచితనం... అమాయకత్వం... నా మనసుని కుదిపేశాయి రజితా! అందుకే నన్ను నేను కంట్రోల్ చేస్కోలేక ఈ విషయం ఆయన్తో కూడా చెప్పేశాను..." గోళ్ళు కొరుక్కుంటూ తల దించుకుంది లలిత.

"మంచిదేగా?" అంది రజిత.

"బట్..."

"ఊఁ..." చెప్పమన్నట్టు చూసింది.

"ఆయనకు ప్రాక్టికల్ అవుట్‌లుక్ లేకపోవడం నాకు బాధగా వుంది. మరీ అంత అతిమంచితనం పనికిరాదని ఆయనకెలా చెప్పాలో తోచడంలేదు. ఆయనలో మార్పురావడం అనివార్యం. లేకపోతే అలాంటి మనిషితో జీవితాంతం అడ్జస్ట్ అవ్వడం కష్టమే..."

"అఫ్‌కోర్స్... కానీ ఈ తెలివి అతన్తో 'అయ్ లవ్ యూ' అని చెప్పేముందే వుండాల్సింది. నువ్ నొచ్చుకుంటావని నేనన్లేదుగాని... అతన్లాంటి మనిషితో జీవితాంతం వేగడం మామూలు విషయంకాదు..."

"నేనివన్నీ ఆలోచించుకోకుండా ఓ నిర్ణయానికి రాలేదులేవే ఆయన్నెలాగైనా మార్చుకోగలనన్న నమ్మకం నాకుంది. కానీ ఎలాగూ అన్నదే తోచిచావడంలేదు..." నుదురు గీరుకుంటూ రజితవైపు చూసింది లలిత.

"ఎలా ఏముందీ? ఇది పద్ధతికాదు మహానుభావా అని నోరు నెప్పెట్టేదాకా చెప్పుకుంటూ పోవడమే..." నవ్వింది రజిత.

"ఈపాటి బోడిసలహాకోసమే అయితే నీ దగ్గరికి రావడం దేనికీ?" రవంత కోపంగా

అంది లలిత.

"అతను మాటల్తో మారేరకం కాదు. ఎంత చెప్పినా చెవిటివానిముందు శంఖం వూదినట్టే అవుతుంది..."

"అయితే ఏం చేద్దామని నీ ఉద్దేశం?" అడిగింది రజిత.

"అది తోచకనేకదా నీ దగ్గరికొస్తే!? బాబ్బాబూ... ఏదైనా ఉపాయముంటే చెప్పి పుణ్యంగట్టుకోవే..." బతిమాలుకున్నట్టు ముఖంపెట్టింది లలిత.

"ఏడ్చినట్టే వుందిది. కుక్కతోక వంకర వంకరే! దాన్ని సరిచేయడానికి ఉపాయాలేమీ వుండవ్" అంది రజిత- గొప్ప జీవితసత్యం చెబుతున్న దానికిమల్లే.

"అంతేనంటావా?" బేలగా అంది లలిత.

"ముమ్మాటికీ అంతే!" అనేసింది రజిత.

★ ★ ★

ఆ మర్నాడు-

క్లాస్ రూమ్‌లో దయాసాగర్‌కేసి కన్నెత్తి చూడ్డానికే బిడియంగా అనిపించింది లలితకి.

ఆడపిల్లయ్యుండీ తెగబడి తానే చెప్పేసిందాయె- అతన్ని ప్రేమిస్తున్నట్టు.

తను వెళ్ళాక అతను తనని గురించి ఏమనుకున్నాడో?

ఈ పిల్లకు మరీ ఇంత బరితెగింపేమిటనుకున్నాడేమో?! మనసులో గుంజాటన.

అయితే దయాసాగర్ ఇదేమీ పట్టించుకున్నట్టు లేదు.

ఎప్పుడూ పలకరించినట్టే మామూలుగా పలకరించాడు.

తాతగారు పోయినందుకు మరోసారి తన సానుభూతిని వ్యక్తంచేసి... "అక్కడన్నీ సవ్యంగా జరిగాయా?" అని కుశలమడిగాడు.

ఏవో పొడిపొడి మాటల్తో సమాధానాలు చెప్పి వూరుకొంది లలిత.

తనుకూడా మామూలుగానే వుందామని ఎంతగానో ప్రయత్నించిందిగాని... ఆమెకది సాధ్యంకాలేదు.

అతనారోజు ఆ కిడ్నీ రంధిలోపడి ఎస్ అనిగానీ, ఐటూ లవ్ యూ అని గానీ చెప్పనేలేదు.

ఇంతకీ అతను తన ప్రేమని అంగీకరించినట్టా, లేదా?

అంగీకరించకపోవడం ఎలా జరుగుతుందిలే?

నోరు విప్పి 'ఓకే' అనైతే అన్లేదుగాని... ఆ సమయంలో ఆ ముఖకవళికలూ... ఆ సంభ్రమం... అతనికీ ఇష్టమేనన్నట్టుగా వున్నాయ్ మరి!

ఆలోచనలు అలా అల్లిబిల్లిగా సాగిపోతుంటే పాఠంమీద ఏమాత్రం కూడా ధ్యాస నిలపలేకపోయింది లలిత.

ఆమె పరధ్యానాన్ని గుర్తించిన రజిత క్లాసైపోయాక ఆమెను ఉడికించింది...

"ఏమిటే ఈ రోజంతా అసలీలోకంలోనే వున్నట్టు లేవు? మీ కాబోయే శ్రీవారితో స్వప్నవిహారమా?" అంటూ.

"ఛ పోవే" అంటూ సిగ్గుపడింది లలిత.

ఆ రాత్రంతా బాగా ఆలోచించి ఆ మర్నాడు దయాసాగర్‌కి ఓ ఉత్తరం రాసింది లలిత.

"మైడియర్ దయాసాగర్! సారీ... మాష్టారూ!

ఆరోజు నేను మీతో నా ప్రేమను వ్యక్తంచేసినపుడు మీరు నాకేసమాధానమూ చెప్పలేదు.

అసలు నా గురించి మీరేమనుకున్నారో కూడా నాకర్థంకాలేదు. నన్ను సిగ్గులేని పిల్లగా భావించారా ఏమిటి కొంపదీసి? ఆ సమయంలో నాలోని ఉద్వేగాన్ని అణుచుకోలేక అలా బయటపడిపోయాను. నిజం మాష్టారూ మీ మంచితనం నన్నెంతగా ఆకట్టుకుంది. అందుకే మాష్టారూ... అందుకే నేను మిమ్మల్ని ప్రేమించడం.

మీ నిర్ణయం ఏమిటో తెలిసేదాకా నాలోని ఈ ఆదుర్దా సద్దుమణిగేట్టులేదు. అందుకే ఈ లెటర్ రాస్తున్నాను.

'ఐ టూ లవ్ యూ' అని మీరు చెప్తారని ఆశిస్తూ, లేదా అలా అని రిప్లయ్ అయినా ఇస్తారని ఆశిస్తూ...

మీ
లలిత"

రాసిన ఉత్తరాన్ని ఓమారు చదువుకునేసరికి సిగ్గుగా అనిపించింది.

ఇస్తే బావుండదేమోనన్న సంకోచం.

కానీ ఏ సంగతీ తేల్చేసుకోవడమే మంచిద న్న ఉద్దేశంతో ఆ సంకోచాన్ని జయించి ఆరోజు క్లాసునుండి వచ్చేసేటపుడు ఎవరికంటా పడ కుండా రహస్యంగా ఆ ఉత్తరాన్ని దయాసాగర్ చేతిలో పెట్టేసింది లలిత.

నోట్సు రాసుకుంటున్న నెపంతో అందరిక న్నా ఆఖర్న లేవడాన్న ఆమెకది సులభసా ధ్యమే అయ్యింది.

ఉత్తరం అతనిచేతిలో కుక్కిన తర్వాత, సిగ్గు ముంచుకు రావడంవల్ల మరొక్కక్షణం కూడా అక్కడ నిలబడలేకపోయిందామె.

ఆమె వెళ్ళిన దిక్కు ఆశ్చర్యంగా చూసి ఆ తర్వాత ఆ చీటీని విప్పి చదువుకున్న దయా సాగర్ హృదయంలో...

మల్లెపూల జడివాన కురిసింది.

అసంకల్పితంగానే అతనా ఉత్తరాన్ని ము ద్దుపెట్టుకున్నాడు.

★ ★ ★

ఉత్తరం దయాసాగర్‌కందించి ఇంటికి వెళ్ళి న లలితకి తన తండ్రితో ఏదో మాట్లాడుతోన్న లోకేశ్వరరావ్ కనిపించాడు.

ఆయన్ను చూడగానే ఎన్నడూ లేన్ది ఒళ్ళు మండినట్టుగా అనిపించింది లలితకి.

ఇతగాడు తనకి దయాసాగర్ సంబంధాన్ని సూచించినపుడు ఉన్నదున్నట్టు చెప్పేసుండక పోతే ఎంత బావుండేది?

పేద్ద పేరున్న పెళ్ళిళ్ళ పేరయ్య. కానీ ఏం లాభం? నూరబద్ధాలాడైనా ఓ పెళ్ళి జరిపించా లన్న ఇంగితం లేకపోయాక?

అలా అనుకుంటుంటే లోలోన నవ్వు లాంటిది కూడా వచ్చింది లలితకి.

ఇపుడంటే తను దయాసాగర్‌ని ప్రేమి స్తోంది గనక ఇలా ఊహించగలుతోంది. కానీ ఆ సమయంలో ఆ పేరయ్య చేసింది నిజానికి మంచిపనేకదా?

"ఏమ్మా బాగున్నావా?" లలితని పలక రించాడు లోకేశ్వర్రావ్.

"ఏదో... మీలాంటి పెద్దల దయవల్ల" అనేసి లోపలికి వెళ్ళిపోయింది లలిత.

ఓ అరగంట తర్వాత లోకేశ్వరరావ్‌ని సాగ నంపి వంటింట్లోవున్న భార్యదగ్గరికొచ్చాడు మాధవరావు.

"ఏవిటట విషయం?" జోగాంబ అడిగింది.

"ఏవుంది మామూలే. మళ్ళీ ఒక సంబంధం తెచ్చాడు. కుర్రాడు రెవెన్యూ డి పార్ట్‌మెంట్లో క్లర్కంట. చెప్పుకోదగ్గ ఆస్తి కాకపో యినా ఓ పెంకుటిల్లూ, స్వగ్రామంలో ఓ రెండె కరాల పొలమూ వున్నాయట. మగసంతానం ఇతనొక్కడేనట. పెళ్ళయిన ఓ అక్కా, ఇంకా పెళ్ళి కావాల్సిన ఓ చెల్లెలూ వున్నారట. వాళ్ళు యాభైవేల మీదున్నారటగానీ, బేరమాడితే నలభైకి దిగొచ్చంటున్నాడు..."

తండ్రి చెప్పుకుపోతుంటే అప్పటికప్పుడే ఒక నిర్ణయం తీసుకుంది ఆ ప్రక్కనే వున్న లలిత.

ఏదో తన ఆరాటంకొద్దీ అలా లెటర్ రాసిందే తప్ప, మాష్టారు ఇంచుమించు అంగీ కరించినట్టే.

అలాంటప్పుడు మళ్ళీ ఈ వేరే సంబంధా లూ, ఈ గొడవలన్నీ దేనికి?

"వొద్దు నాన్నా... నాకు సంబంధాలు చూడ బాకండి"

లలిత అలా అనేసరికి నివ్వెరపోతూ చూ శారా దంపతులు.

"అదేమిటే?!" జోగాంబ దవడలు నొక్కు కుంది. "మొన్నటి దాకా బాగానే వున్నావుగా. ఇంతలోనే ఏమొచ్చింది?"

"ఏం లేదు..." ఏం చెప్పాలో తోచక మాటనా న్చింది లలిత.

"కొంపదీసి ఎవర్నయినా ప్రేమిస్తున్నావా ఏంటి?" అడక్కూడదనుకుంటూనే నోరు జారి అడిగేశాడు మాధవరావ్.

దయాసాగర్‌ని కిడ్నీ అడగొద్దని ఆమె వారించినప్పటినుంచీ ఆయనకు లోపల్లోపల అనుమానంగానేవుంది.

అదే ఇపుడాయన్ను అలా అడిగేందుకు ప్రేరేపించింది.

తండ్రి ప్రశ్నకు నిర్ఘాంతపోయింది లలిత.

అంత సూటిగా, ఆయనలా అడుగుతాడని ఆమె ఊహించలేదు.

అవుననాలో కాదనాలో అర్థం కాలేదోక్షణం.

కానీ అంతలోనే మొండి తెగింపు.

ఎప్పటికైనా చెప్పాల్సిందేగా? ఇపుడీ అవకాశాన్ని మిస్ చేసుకుంటే మళ్ళీ ఇలాంటి సందర్భం రాకపోవచ్చు.

అందుకని ఏమైతే అయ్యింది లెమ్మని... "అవును... నేను మా మాష్టార్ని చేసుకోవాలనుకుంటున్నాను" అనేసిందామె నిర్భయంగా.

ఆ అమ్మాయి తెగింపుకి నిర్ఘాంతపోవడం ఈసారి ఆమె తల్లిదండ్రుల వంతయ్యింది.

"ఏమిటీ?! దీర్ఘం తీస్తూ అన్నాడు ఒకింత ముందుగా తేరుకున్న మాధవరావు. "మతి లేని మాటలు మాట్లాడబాకు. అతనెందుకూ పనికిరాని వాజమ్మ... తెలుసా? అతన్ని చేసుకుని ఏం సుఖపడదామని?"

"అవునే... అతనుత్త పనికిమాలిన వాడు..." ఆందోళనగా అంది జోగాంబ.

నిండా మునిగిపోయాక ఇంక చలేముందీ?

అమ్మానాన్నల్ని ఎదిరించడానికే నిర్ణయించుకొంది లలిత.

"తాతయ్యగారికి కిడ్నీ ఇవ్వడానికి ఒప్పుకున్నప్పుడు ఆయన్ని రూపుదాల్చిన మంచితనం అన్నారుగా? అదే వ్యక్తి ఇప్పుడు పనికిమాలిన వాడెలా అయ్యాడు?" నిగ్గదీస్తున్నట్టే అడిగింది.

"అది వేరు ఇది వేరు. అప్పుడు మన అవసరం కాబట్టి పొగిడాం. అతనికి సవ్యంగా బతకడానిక్కావలసిన తెలివితేటలు బొత్తిగా లేవు..." కోపాన్ని దిగమింగుకుంటూ ఏదో చెప్పబోయాడు మాధవరావ్.

అడ్డు తగుల్తూ అంది లలిత.

"అతన్ని నేను మార్చగలను. మార్చుకుంటాను..."

"ఏమిటే అర్థం లేకుండా మాట్లాడ్తావ్? కావాలని అడుసుతొక్కి కాళ్ళు కడుక్కుంటారా ఎవరైనా? తెలిసుండీ గోతిలో దిగుతానంటావేంటీ?!" జోగాంబ కోపంగా అంది.

"మీరేవన్నా అనుకోండి. నా నిర్ణయం మాత్రం మారదు..." స్థిరంగా పలికింది లలిత. "మీ అవసరానికి పనికొచ్చిన అతని మంచితనం అతనిపుడు అల్లుడిగా రావడానికి అనర్హతయ్యిందా? అసలు నేనతన్ని చేసుకోవాలనుకుంటున్నది అతని మంచితనాన్ని చూసే! ఎవరెన్ని చెప్పినా నన్ను మార్చలేరంతే! అవసరమైతే పెళ్ళయినా మానుకుంటానే తప్ప అతన్నిగాక ఇంకెవ్వర్నీ చేసుకోను..."

"అంతదాకా వచ్చావన్న మాట!" దాదాపు పళ్ళు నూర్తూ అన్నాడు మాధవరావు. "నీ బాగోగులు నీకు తెలుసా? మాకు తెలుసా? అంతగా అయితే నిన్నా ప్రశాంత్‌కైనా ఇస్తాను గాని... తెలిసి తెలిసి ఆ దద్దమ్మకి మాత్రం ఇవ్వను..."

జోగాంబ ముఖం వికసించింది.

"ఆ పని చెయ్యండి" అంది సంతోషంగా.

కూతుర్ని తన తమ్ముడు ప్రశాంత్‌కివ్వడం ఆమెకు మొదట్నుంచీ ఇష్టమే. ఏటొచ్చీ లలితే పొసగనివ్వడం లేదు.

మేనరికాలు మంచివి కావంటూ ఒక వంక. చిన్నప్పట్నుంచీ కలిసిమెలిసి పెరిగిన కారణంగా అతని మీద సోదర వాత్సల్యమే తప్ప అసలలాంటి భావమే లేదంటూ మరోవంక.

ఆమెకు మరీ అంతగా ఇష్టం లేనప్పుడు ఒత్తిడి చేయడం దేనికిలే అని మాధవరావ్ కూడా ఇన్నాళ్ళూ ఆమె అభిప్రాయాన్ని గౌరవిస్తూ వచ్చాడు. పరాయి సంబంధాల వైపే మొగ్గుచూపాడు.

అదీగాక ప్రశాంత్ చేసేది చెప్పుకోదగ్గ ఉద్యోగమేం కాదు. డిప్యూటీ ఇన్స్‌పెక్టర్ ఆఫ్ స్కూల్స్ ఆఫీసులో రికార్డ్ అసిస్టెంట్. ఎల్డీసీ క్యాడర్ కన్నా తక్కువ. పరోక్షంగా అదీ కొంత కారణమయ్యింది ప్రశాంత్ విషయంలో ఆయన కూతురి అభిప్రాయాన్ని గౌరవించడానికి.

అలాంటిదిపుడు కూతురు రొంపిలో దిగుతానంటుంటే అంతకన్నా ప్రశాంతే బెటరనిపించి ఆ మాటన్నారాయన.

"ప్రశాంత్ మావయ్యని నేను చేసుకోనని ఏనాడో చెప్పేనుగా?"

"ఏం ఈ దయాసాగర్‌కన్నా తీసిపోయాడా వాడు?" మంటగా అంది జోగాంబ. "వాడికి మనిషికుండాల్సిన తెలివితేటలన్నీ ఉన్నాయి. ముఖ్యంగా అక్కకూతురన్న అభిమానంతో ప్రేమగా చూసుకుంటాడు నిన్ను"

''అవసరం లేదు...'' చిరాగ్గా అంది లలిత.

''అంటే?'' కోపంగా చూసింది జోగాంబ.

''నా నిర్ణయమేంటో నేను స్పష్టంగా చెప్పాను. అది మారదుగాక మారదు. ఆ పైన మీ ఇష్టం...'' అనేసి విసురుగా వెళ్ళిపోయింది లలిత అక్కణ్ణించి.

ఆ తర్వాత మొగుడూ పెళ్ళాలిద్దరూ తర్జన భర్జన పడ్డారు.

''దీనికిదేం పిచ్చండీ?'' అంది జోగాంబ.

''అదే నాకూ అర్థం కావట్లేదే...'' అంటూ వాపోయాడు మాధవరావు.

''దాని మాటలు పట్టించుకోవద్దు మనం. అంతకన్నా మా ప్రశాంత్‌కివ్వడమే మంచిది''

''ఎలాగోలా చేద్దాంలే...'' అప్పటికప్పుడే ఓ నిర్ణయానికి రాలేక తాత్కాలికంగా విషయాన్ని వాయిదా వేశాడు మాధవరావు.

★ ★ ★

లలిత ఉత్తరానికి జవాబు రాయాలో వద్దో అర్థం కాలేదు దయాసాగర్‌కి.

మగాడయ్యుండీ ఉత్తరం రాయాల్సిన అవసరం తనకేంటి? ధైర్యంగా నోటితోనే చెప్పేస్తే పోలా?

ఆడపిల్లలు మగవాడిలో ధైర్యాన్నే కోరుకుంటారని ఎక్కడో చదివినట్టు గుర్తు. కాబట్టి అదే మంచి పద్ధతి అనిపించింది అతనికి.

ఆరోజు లలిత క్లాసుకి రాగానే ఆమెవైపు అదోలా చూస్తూ నవ్వాడు దయాసాగర్.

''అయ్ టూ లవ్ యూ లలితా'' అనే భావాన్ని ఆ చూపుద్వారా ప్రసరింపజేశాడు.

లలిత సిగ్గుగా నవ్వి తల దించుకుంది.

రజిత ఓరకంట గమనిస్తూనే వుంది ఇదంతా.

సో... ప్రేమముదిరి పాకాన పడిందన్న మాట అనుకుంది మనసులో.

అదేరోజు సాయంత్రం ఎలాగోలా లలితని ఒంటరిగా దొరకబుచ్చుకుని నోటితో కూడా చెప్పేశాడు దయాసాగర్, ''నీ ప్రేమను పొందగలగడం నా అదృష్టంగా భావిస్తున్నాను లలితా'' అంటూ.

''థాంక్యూ'' అనేసి వెళ్ళిపోయింది లలిత.

నిజానికది డ్యూయెట్ లీడే అయినా, అది సినిమా కాదు కాబట్టి, నిజజీవితం కాబట్టి వాళ్ళిద్దరూ వెంటనే ఏ పార్కుకో వెళ్ళి యుగళ గీతం పాడేసుకోలేదు.



''మా అమ్మానాన్నలతో దయాసాగర్ విషయం చెప్పేశానే'' అని లలిత రజితతో అన్నప్పుడు

''అరెం అప్పుడే ఎందుకు తొందరపడ్డావే?'' అంది రజిత గాభరాగా.

''సందర్భం కలిసొచ్చింది చెప్పేశాను. ఎప్పటికైనా చెప్పాల్సిందేగా?'' అంటూ జరిగిన విషయం వివరించింది లలిత.

''అయితే మీ అమ్మానాన్నలు అంతగా ఇష్టపడ్డం లేదన్నమాట?'' సాలోచనగా చూస్తూ అంది రజిత.

''అంతగా అనేముందీ, బొత్తిగానే ఇష్టపడడం లేదు. అయితే దాన్ని నేనో సమస్యగా అనుకోవడం లేదు. మొండికెత్తి... తిండీతిప్పలూ మానేసైనా సరే నేను వాళ్ళ నెలాగోలా లొంగదీస్తాను''

''మరంత ధైర్యమున్నప్పుడు ఇహనేం?''

''ప్రస్తుతానికి సమస్యంటూ ఏమీలేదు. కానీ ఆయన్ని మార్చడం ఎలాగా అన్నదే నాకు అంతుబట్టడం లేదు...''

''పెళ్ళయ్యాక మార్చుకోవచ్చులేవే బాబూ!'' రజిత నవ్వుతూ అంది. ''ఇప్పట్నించే దేనికి అనవసరంగా వర్రీకావడం?''

''అది కాదే అందరూ ఆయన్నో అప్రయోజకుడి కింద భావిస్తున్నారు కదా! అందుకని మార్చడానికి ప్రయత్నిస్తే బాగుంటుందని

పిస్తోంది...''

"సరే... ప్రియురాలి పలుకులు కలకంద పలుకులకన్నా తీయనంటారు. ఇన్నాళ్ళూ అందరూ చెప్పింది ఒక ఎత్తు. ఇప్పుడు నువ్ చెప్తే ఒక ఎత్తు. వీలు చూసుకుని అతను ఒంటరిగా దొరికినపుడు నీ శక్తి కొద్దీ నూరిపొయ్యి. బహుశా ప్రయోజనం వుండొచ్చు...'' చెప్పింది రజిత అంతకన్నా మరో ఉపాయమేదీ లేదన్నట్టు.

"మాటల్తో ఆయన మార్తాడంటావా?'' సందేహంగా అంది లలిత.

"మారినా మారకపోయినా మనం అంతకన్నా చెయ్యగలిగిందేముంది?'' అవునంతే కదా అనిపించింది లలితకి.

"ప్చ్...'' అంటూ నిట్టూర్చింది.

★ ★ ★

లలిత దయాసాగర్‌ని ప్రేమిస్తోందన్న విషయం తెలిసిపోయాక ఆమె నింకా ఆ కోచింగ్ సెంటర్‌కి పంపడం భావ్యమా కాదా అన్న విషయంలో మాధవరావూ, జోగాంబా వాదోపవాదాలు చేసుకున్నారు.

"ససేమిరా వీల్లే''దంది జోగాంబ.

"మధ్యలో మానిపించి చదువుపాడు చేయడం మంచిదికా''దన్నాడు మాధవరావు.

"పోనీ వేరే కోచింగ్ సెంటర్లో జేర్పిద్దాం'' అంది జోగాంబ.

"జేర్పించొచ్చు... కానీ మనం మధ్యలో ఇలా మాన్పిస్తే అందరికీ లేనిపోని సందేహాలు కలుగుతాయి. అయినా క్లాస్ రూమ్‌లో అందరి ముందు ప్రేమ పాఠాలేం చెబుతాడు అతను మాత్రం? అయినా నేననుకోవడం ఇది దీని పుర్రెన పుట్టిన బుద్ధేగానీ అతన్దేమీ వుండుండదు పాపం!'' అన్నాడు మాధవరావు.

"మీకేవన్నా తిక్కా చాదస్తమా? రెండు చేతులూ కలవందే చప్పట్లవుతాయా ఎక్కడైనా? ఇందులో అతని జోక్యమే లేనట్టు మాట్లాడ్తారేం?'' అంటూ కోపగించుకుంది జోగాంబ.

ఆలోచించ దగ్గ పాయింటే.

కానీ ఎటూ తేల్చలేకపోయాడు మాధవరావు.

అంతలో లలితను కేకేసి జోగాంబే చెప్పేసింది.

"నువ్ ఇవ్వాల్టినుంచి అతని దగ్గరికి ట్యూషన్‌కి వెళ్ళడానికి వీల్లేదు...''

"ఏం?'' అంది లలిత పెడసరంగా.

"ఏంటా పొగరుమోతుతనం? ఎందుకో తెలీదా నీకు?'' ఉరిమి చూస్తూ అంది జోగాంబ. "ఇప్పటికి జరిగింది చాలు. ఇంకేదో చేసి మా కొంప మీదకు తేకపోతే అదే పదివేలు...''

"అంటే ఏంటి నీ ఉద్దేశం? నేనేం అంత బలహీనురాల్ని కాను. నా హద్దులేంటో నాకు తెలుసు. పోతే నా నిర్ణయమేంటో స్పష్టంగా చెప్పాను. అందులో మార్పేమీ ఉండబోదింక. మీకు నా పెళ్ళి చేయాలనుంటే వెళ్ళి అతని అమ్మానాన్నల్తో మాట్లాడండి దట్సాల్!'' కుండ బద్దలు గొట్టినట్టు చెప్పేసి యమా స్పీడుగా వెళ్ళిపోయింది లలిత అక్కడినుంచి.

"చూస్తూ నిలబడతారేంటండీ! వెళ్లిదాన్నింట్లో కీడ్చుకు రండి'' అంది జోగాంబ కోపంగా.

కడుపు చించుకుంటే కాళ్ళ మీద పడుతుందన్న ఇంగితం ఆమెకా ఆవేశంలో కలగ లేదు.

కానీ మాధవరావ్ ఒకింత నిదానస్థుడు కావడంవల్ల తొందరపడకుండా ఆలోచించాడు.

"కన్నూ మనదే, కాలూ మనదే. ఈ పరిస్థితిలో మనం రభస చేసుకోవడం మంచిదికాదు. విషయం నలుగురికీ తెలిస్తే మనమే నవ్వుల పాలవ్వాల్సి వొస్తుంది...'' అన్నాడు శాంతంగా.

"అంటే ఏంటి మీ ఉద్దేశం? ఇలా చూస్తూ వూరుకుందామంటారా?''

"ఎలా వూరుకుంటాం? కానీ తొందరమాత్రం పనికిరాదంటున్నాను. జంకూగొంకూ లేకుండా అదంత ఖచ్చితంగా చెబుతోందీ అంటే గట్టి నిర్ణయానికే వచ్చినట్టుంది. మరీ ఆంక్షలు విధిస్తే తెగించి ఆ భక్తవత్సలం గారమ్మాయిలా ఏ కానివనో చేసిందనుకో... అపుడు మనమేం చేయగలం?''

భక్తవత్సలంగారు వీళ్ళకి తెలిసినాయన. ఆయన కూతురు కూడా ఇలాగే ఎవర్నో ప్రేమిస్తే వాళ్ళభ్యంతరం చెప్పగా, గుట్టు చప్పుడు

(నవల తరువాయి భాగం 88వ పేజీలో)

నిజంగానె బిడ్డనుకన్న ఫీలింగ్ వచ్చేలా తల్లిని భ్రమింప చెయడంలో బేబీలాండ్ సిబ్బంది మహా ఘటికులు






కనే (కొనే)ముందు మనకి కావల్సిన బిడ్డని ఎంపికచేసుకునే సువరావకాశం.

# నిజం తల్లులు బొమ్మపిల్లలు

పిల్లలు లేని దంపతులకోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన 'బేబీలాండ్ జనరల్ మెటర్నిటీ హాస్పిటల్' జార్జియా పట్టణంలో ఉంది. అక్కడకు వెళ్ళిన దంపతులంతా 'సంతానవంతులు'గానే తిరిగివస్తారు. మెడికల్ చెకప్లు, ఆపరేషన్లు వగైరాలు ఎన్ని జరిపినా పిల్లలు పుట్టని దంపతులకు బేబీలాండ్ హాస్పిటలే చివరిమార్గం. అక్కడికి వెళ్తే తల్లి దండ్రులవడం ఖాయం. అలాగని అక్కడేదో పిల్లల్ని సృష్టించే మాంత్రికుడున్నాడనో, పిల్లల్ని పుట్టించే యంత్రం ఉందనో మీరనుకుంటే పొరపడినట్లే! అక్కడ అలాంటివి ఏమీ ఉండవు. కేవలం అక్కడ పిల్లల సైజులో చక్కని ముద్దువచ్చే బొమ్మలుంటాయి. ఆ బొమ్మల్లో తమకు నచ్చినదాన్ని ఎంపికచేసుకొని తెచ్చుకోవడమే! అందుకుగాను 'బేబీలాండ్' యాజమాన్యానికి కొంత డబ్బు చెల్లించాలి. ఆపైన ఆ బొమ్మకే పాలుపడ్తూ, లాలపోస్తూ, లాలించుకుంటూ గడపడమే. ప్రేమానురాగాలు కురిపించడానికి ఓ పాపాయి బొమ్మని ఇవ్వడమే బేబీలాండ్ వారి లక్ష్యం.

కేవలం బొమ్మలు అమ్మే దుకాణమా? అని నిస్పృహపడి పోనక్కరలేదు. సంతానవంతులు కావాలనుకుంటున్నారా అని అడుగుతూ బొమ్మల్ని అంటకడ్తారా? అని కోపగించుకోకండి. ఇది ఒకరకం బిజినెస్సే! సంతానంలేని వారిపట్ల చులకనభావంతోగాక సానుభూతితో చేసేది. మామూలు దుకాణాల్లోలాగాక, లేబర్ రూమ్లో నొప్పులు వడ్డట్టు, ప్రసవించినట్లు తల్లులకు అనుభూతి కలిగించి ఆ తర్వాత ఈ బొమ్మని చేతిలో పెడతారు. అలా 'సెంటిమెంటు'ను ప్రయోగించడంవల్ల ఈ బేబీలాండ్ టెక్నిక్ సూపర్హిట్ అయింది.

కాకుండా అతన్తో లేచిపోయిందా అమ్మాయి. దాంతో ఆ కుటుంబం పరువు కాస్తా బజార్న పడింది.

భర్త మాటలకి జోగాంబ గుండెల్లో రాయిప డినట్టుగా అనిపించింది. "నిజమేనండీ! నేనంత దూరం ఆలోచించలేదు..." అంది బెంబేలెత్తిపోతూ.

"అందుకే చెబుతున్నాను తొందరపాటు పనికి రాదని. కొన్ని రోజులపాటు మళ్ళీ అమ్మాయి ముందు ఆ ప్రసక్తి తీసుకురాకుండా నెమ్మదిగావుండు. ఏం జరుగుతుందో చూద్దాం. అంతగా విషమిస్తే దానిష్ట ప్రకారమే కానిద్దాం. ఏం చేస్తాం? ఎవరి రాత ఎలా రాసిపెట్టుంటే అలా జరుగుతుందంతే..." అంటూ భార్యకు నచ్చజెప్పాడు మాధవరావు.

ఆ మాటలు అంతగా రుచించకపోయినా ఏమీ అన్లేక అప్పటికి వూరకుండిపోయింది జోగాంబ.

★ ★ ★

భార్యతో మాటవరసకి ఏదో అలా అన్నా అంత సీరియస్ విషయాన్ని కాలానికొదిలేసి మిన్నకుండిపోవడం మాధవరావుకే సాధ్యం కాలేదు.

ఈ కాలం కుర్రకారు పోకళ్ళు తెలిసిన వాడు కావడంవల్ల, ఆవేశంలో వాళ్ళెంతక యినా తెగిస్తారన్న జ్ఞానం వున్నవాడు కావడం వల్ల కూతుర్ని గట్టిగా మందలించడం అనే పిచ్చిపనైతే చేయలేదుగాని... ఆ ఇరకాట పరి స్థితిని ఎలా అధిగమించడమా అని ఒకటి రెండు రోజులు చాలా సీరియస్గా ఆలోచించా డు మాధవరావు.

ఎటుపోయి ఎటొస్తుందో? ఎందుకయినా మంచిదనిపించి లోకేశ్వర్రావ్ని స్వయంగా తానే వెళ్ళి కలిసి విషయం చూచాయగా చెప్పి... అంటే ప్రేమా గీమా లాంటి పదాలు దొర్లించకుండా అమ్మాయి అతనంటే ఇష్టపడు తున్నట్టుగావుంది అంటూ లోపాయికారిత నంగా మాట్లాడి... "ఓసారి వెళ్ళి ఆ రాయుడి గార్ని కదిపి చూడ్రాదూ?" అన్నాడు మాధవ రావ్.

"ఆనాడు కుదరదుగాక కుదరదని మళ్ళీ ఈ రూట్లోకొచ్చారేంటీ? సరే మీకభ్యంతరం లేనప్పుడు నాదేముంది? అలాగే వెళ్ళి మాట్లా డ్తానులెండి" అన్నాడు లోకేశ్వరరావ్.

ఆ మర్నాడే వెళ్ళి కలిశాడు రాయుడుగార్ని.

"ఆ బడుద్ధాయ్ ఇష్టపడితే నాదేం లేదు. కానీ వాడు ఇంటికి తిరిగి రావాలిగా? ఇంకా ఓ రెణ్ణెల్ల పదిహేను రోజులు గడువుంది. ఈలోగా వాడిటుకేసి చూస్తాడన్న ఆశగానీ, నమ్మకం గానీ లేవు. కాబట్టి ఆతర్వాత కలవండి. అప్పు డాలోచిద్దాం..." అనేశాడు రాయుడు.

ఆ పరిస్థితుల్లో ఆయనవద్ద అంతకన్నా వేరే సమాధానం లేకపోయింది.

ఆ మాటే మోసుకొచ్చి తిరిగి మాధవరావుకి చెప్పాడు లోకేశ్వరరావ్.

"మొత్తానికైతే సుముఖంగా వున్నట్టేకదా! నాకూ తొందరేం లేదు. అలాగేచేద్దాంలెండి" అనేశాడు మాధవరావు.

విషయాన్ని భార్యతో చర్చించి "అదీ సంగతి... అవసరమైతే అతనికే ఇచ్చి కట్టబెట్టే ద్దాం. అంతకన్నా ఏం చెయ్యగలం?" అన్నాడా మెతో.

"సరే కానీండి. ఎలా జరుగుతుందో ఏమో! అంతా ఆ భగవంతుడి నిర్ణయం!" అందామె.

దయాసాగర్ని చేసుకుంటే కూతురి బతుకే మవుతుందోనన్న దిగులు మనసులోవున్నా ప్ర స్తుత పరిస్థితి దృష్ట్యా అంతకన్నా ఏమీ అనలే కపోయిందామె!

వీళ్ళగోల ఇలా వుండగా లలిత తన పంథాలో తాను దయాసాగర్ని మార్చడానికి ప్రయత్నాలు ప్రారంభించింది.

కరవొద్దంటే సరేనని బుసకొట్టడం కూడా మానేసి ప్రాణం మీదకు తెచ్చుకున్న పాము కథ చెప్పిందతనికి.

మంచితనం అనేది ఉండొచ్చుగాని అది శృతిమించి స్వీయ వినాశనానికి దారి తీసేదిగా వుండకూడదని చెప్పింది.

అతని మంచితనాన్నీ జాలి గుణాన్నీ అపా త్రులు గనక దుర్వినియోగం చేసుకుంటే అది ఎలాంటి దుష్పరిణామాలకు దారి తీయవచ్చో సోదాహరణలతో సహా వివరించింది.

అన్నిటికీ ఊకొట్టి చివర్లో అతను "నువ్వేన్న యినా చెప్పు లలితా! ఎదుటివ్యక్తిని చూసి జాలిపడకుండా వుండలేను నేను. నేను చేయ

గలిగిన ఏ సహాయాన్నీ ఎవ్వరి విషయంలోనూ తిరస్కరించలేను" అనేవాడు.

'నిన్ను మార్చడం ఆ బ్రహ్మతరం కూడా కాదు నాయినా' అనుకుంది లలిత.

అంతకన్నా ఏం చెయ్యగలదామె మాత్రం?

చెప్పడంలో ఎన్ని విధాలున్నాయో అన్ని విధాలుగానూ చెప్పినా కూడా ప్రయోజనం లేకపోయిందాయె!

ఇవన్నీ చెప్పుకుంటూ కూర్చోవడానికి వాళ్ళ కంత ఏకాంతం ఎలా లభించిందన్నది ఇక్కడో పెద్ద ప్రశ్నకాదు.

మనసుంటే మార్గం అదేవుంటుంది.

తెగబడి పార్కులకీ, సినిమాలకీ తిరిగేసే టంతగా వాళ్ళ ప్రేమ అల్లుకుపోలేదుగాని... ఇద్దరి మధ్యా ఏర్పడిన సాన్నిహిత్యం దృష్ట్యా క్లాసై అందరూ వెళ్ళిపోయాక కూడా ఏదోక నెపంతో ఓ అయిదు నిముషాలో పది నిముషాలో అక్కడుండిపోయి అతనికలా సుద్దులు చెబుతుండేది లలిత.

అయితే ఇక్కడామెకు ఆశ్చర్యాన్ని కలిగించిన విషయం ఏమిటీ అంటే బుద్ధావతారంలా ఆ సుద్దుల్ని బుద్ధిగా వినడమే తప్ప లభించిన ఆ ఏకాంతాన్ని దయాసాగర్ ఏనాడూ దుర్వినియోగం చెయ్యకపోవడం.

కనీసం ఓ ముద్దైనా పెట్టిన పాపాన్న పోడేం అయ్యో పాపం! అనుకునేదామె జాలిగా.

అసలా మాట కొస్తే ముద్దుల దాకా ఎందుకు? కనీసం ప్రేమ కబుర్లుగానీ చిలిపి మాటలుగానీ ఏనాడూ చెప్పేవాడు కాదు దయాసాగర్.

పైగా లలిత ఆ ధోరణిలో మాట్లాడబోయినా ఖండిస్తూండేవాడు. "నేనంటే నీకిష్టం, నువ్వంటే నాకిష్టం దట్సాల్. మిగతావన్నీ తర్వాత. నేనొక ఆశయానికి కట్టుబడి ఇక్కడుంటున్నాను. మా నాన్నతో నేను చేసిన ఛాలెంజ్ నిలబెట్టుకున్నాకే ఇలాంటి విషయాలన్నీను" అనేవాడు సీరియస్‌గా.

లలిత అతని బ్యాంక్ బాలెన్స్ ఏ మేరకు పెరిగిందో ఎప్పటికప్పుడు అడిగి తెలుసుకుంటూండేది.

'ఫర్వాలేదు... ఇతను గెలుస్తాడు' అని పిస్తూండేది ఆమెకు.

ఎందుకంటే ఇన్‌స్టిట్యూట్‌తోపాటు అతని ఆదాయమూ పెరుగుతూంది.

ఇక్కడిదాకా బాగానే వుంది.

ఎట్నుంచి చూసినా కథ సుఖాంతంవైపు దారి తియ్యడానికే ఎక్కువగా ఆస్కారం కనిపిస్తోంది.

కానీ...

★ ★ ★

ఆరోజు...

దయాసాగర్ ఒంటరిగా తన రూమ్‌లో కూర్చుని ఏదో వీక్లీ చదువుకుంటున్నాడు.

మాంచి ప్రేమకథ.

అందులోనూ బహురసవంతమైన సన్నివేశం!

ఆ కథలోని హీరో హీరోయిన్ల స్థానంలో తననీ, లలితనీ ఊహించుకుంటూ అతనెక్కడికో తేలిపోతూ వుండగా-

"మే ఐ కమిన్ ప్లీజ్?" అంటూ వినిపించిందో స్వరం.

వీక్లీలోంచి తల పైకిలేపి చూశాడు దయాసాగర్.

గుమ్మం దగ్గర ఎవరో అపరిచిత వ్యక్తి. వయసు పాతిక్కిపైనా ముప్పైకి లోపుగా వుండొచ్చు బహుశా.

"రండి" అన్నాడు దయాసాగర్ తను లేచి మంచంమీద కూర్చుంటూ అతనికి కుర్చీ చూపించి.

"నా పేరు ప్రశాంత్" చెప్పాడా వ్యక్తి.

"అయామ్ దయాసాగర్!" అన్నాడు దయాసాగర్ కరచాలనం కొరకు చెయ్యి చాస్తూ.

ఆ చేతినందుకుంటూ అన్నాడు ప్రశాంత్ "తెలుసు... పేరుకి మాత్రమే కాదు. నిజంగానే మీరు దయాసాగరులనీ, ఎదుటివ్యక్తిమీద దయచూపడంలో మీకు మీరే సాటనీ తెలుసుకునే వచ్చాను మీ దగ్గరికి..."

అతని మాటతీరు ఒకింత గమ్మత్తుగా అనిపించింది దయాసాగర్‌కి.

"చెప్పండి... వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ?" అతను తననుండి ఏదో ఆశించి వచ్చాడని

తెలుస్తూనే వుంది కాబట్టి అలా అన్నాడు దయాసాగర్.

"నాది మీ నిర్ణయంతో ముడిపడి వున్న వ్యక్తిగత సమస్య. మీరు నాకు సహాయం చేస్తానని ప్రామిస్ చెయ్యాలి"

దయాసాగర్‌కి ఆశ్చర్యంగా అనిపించింది.

అతనెవరో తనకింతవరకూ తెలీనే తెలీదు. అలాంటిది అతని వ్యక్తిగత సమస్యకీ తనకీ సంబంధం ఏంటి?

"చెప్పండి... మీరు కోరేది నేను చెయ్యగలిగిన సహాయమే అయితే అదెలాంటిదైనా చేసే తీర్తాను" అన్నాడు ఆశ్చర్యం నుండి తేరుకోకుండానే అభయమిస్తూ.

"మాట తప్పరుగా?"

"నెవ్వర్..." దృఢంగా పలికాడు.

ప్రశాంత్ ఓ మారు గొంతు సవరించుకుని చెప్పాడు, "నేను మిమ్మల్ని కోరే కోరిక మీ గుండెకాయను కోసి ఇమ్మనడం లాంటిది. అయినా నా పరిస్థితి దృష్ట్యా అడక్క తప్పడంలేదు..."

విషయం చెప్పకుండానే కంగారు పెట్టేస్తున్న అతగాడి తీరు మరింత విచిత్రంగా అనిపించింది దయాసాగర్‌కి.

"ఫర్వాలేదు చెప్పండి" అన్నాడు తొణక్కుండా.

"మీరు లలితను ప్రేమించడం మానెయ్యాలి!" దయాసాగర్ ముఖంలోకి సూటిగా చూస్తూ చెప్పాడు ప్రశాంత్. అయితే అది అజ్ఞాపన కాదు. కంఠంలోనూ, చూపుల్లోనూ కూడా అర్థింపే!

"వాట్!!?"

అదిరిపడ్డాడు దయాసాగర్.

"ఎం... దు... కు? దానివల్ల మీకేంటి లాభం?" అడుగుతూంటే కంఠం కంపించింది.

"మీరలా చేస్తే నా ప్రాణం నిలబెట్టినవారవుతారు. లేకపోతే..." అంటూ ఆపేశాడు ప్రశాంత్.

"లేకపోతే?" వెర్రిచూపు చూశాడు దయాసాగర్.

నిజంగానే గుండెనెవరో రంపంతో కోస్తున్నట్టుగా అనిపించింది అతనికి.

"లేకపోతే నేనాత్మహత్య చేసుకుంటాను" ప్రశాంత్ ముఖం సీరియస్‌గా వుంది. ఆ సీరియస్‌నెస్ వెనుక అంతర్లీనంగా ఏదో చెప్పలేని బాధ.

"ఎందుకని? నాకేమీ అర్థం కావట్లేదు. దయచేసి సంగతేంటో స్పష్టంగా చెప్పండి..."

"చెబుతాను. కానీ మీరు నన్ను అర్థంచేసుకోవడానికి ప్రయత్నించాలి"

"అలాగే"

దయాసాగర్ తల వూపినమీదట చెప్పటం ప్రారంభించాడు ప్రశాంత్.

అతను లలితావాళ్ళ మావయ్య. చిన్నప్పట్నుంచీ లలితమీద ఎన్నెన్నో ఆశలు పెంచుకున్నాడు. అమెను తన భావిసతీమణిగా ఊహించుకుంటూ ఎన్నెన్నో మధురమైన కలలు గన్నాడు. ఆమెలేని జీవితాన్ని కలలో కూడా ఊహించలేనంతగా ఆమెను ప్రేమిస్తూ వచ్చాడు. అతని ఊపిరి లలితే! ఆమె లేని జీవితాన్ని ఊహించడంకన్నా మరణమే సుఖమతనికి. ఈ విషయంలో అతని నిర్ణయం తిరుగులేనిది. అయితే లలితకు అతన్ని చేసుకోవడం ఇష్టంలేదు. ఈ విషయం ఆమె తల్లిదండ్రులవద్ద స్పష్టంగా చెప్పేక కూడా అతనింకా బ్రతికే వున్నాడూ అంటే దానిక్కారణం- ఆమె ఎప్పటికైనా మనసు మార్చుకుంటుందన్న ఆశ. అయితే రెండు రోజులక్రితం అక్కగార్ని కలిసినపుడు తెలిసింది అతనికి- లలిత దయాసాగర్ అనే అబ్బాయిని ప్రేమిస్తోందన్న సంగతి. దయాసాగర్‌మీదనుంచి లలిత ధ్యానని మళ్ళించగలిగితే ఎలాగోలా ఆమెను ఒప్పించి ఆమె పెళ్ళి అతనితో జరిపిస్తానని ప్రమాణం చేసింది అక్కగారు. దయాసాగర్ దయార్ద్రహృదయుడని ఇతనికి చెప్పింది కూడా ఆవిడే. వెళ్ళి కాళ్ళమీద పడమని సలహా ఇచ్చింది కూడా ఆవిడే! ఈ విషయాన్నంతా తనపరంగా చెప్పుకొచ్చి- "లలిత లేకుండా నేను బ్రతకలేను. నా లలితను నాకొదిలేయండి ప్లీజ్. మీకూ లలితకీ మధ్య వున్నది కేవలం మూడు నెలల పరిచయం. కానీ నేనామెను ఊహ తెలిసినప్పటినుంచి ప్రేమిస్తున్నాను. ఆమెనే నా ఊపిరిగా భావిస్తున్నాను మీ మంచితనం గురించి మా అక్క

య్య చెబితే మీరు కాదనరన్న బలీయమైన నమ్మకంతో వచ్చాను. నాకు ప్రేమభిక్ష ప్రసాదించండి. నాకు ప్రాణభిక్ష ప్రసాదించండి... మీరేం చేస్తారో నాకు తెలియదు. కానీ లలితకు మీ మీద విరక్తి కలిగేలా చేయండి. మీ మీద ఆమెకున్న ప్రేమ అంతరించిపోయేలా చెయ్యండి. ఈ సహాయం మీరు చేస్తే చాలు... ఆమెధ్యాస మీనుండి మళ్ళిపోతే, ఆ తర్వాత మా అక్క సహాయంతో ఎలాగోలా ఆమెను నా దాన్ని చేసుకుంటాను...'' అంటూ చేతులు జోడించాడు ప్రశాంత్. అతని కళ్ళలో స్పష్టాస్పష్టంగా తడి.

దయాసాగర్ మనసు జాలితో కంపించిపోయింది. ఎట్‌ది సేమ్ టైమ్ ఆవేదనతో మెలికలు తిరిగిపోయింది.

గుండెల్లో అగ్నిపర్వతం బ్రద్దలవ్వడం అనే ఉపమానం తొలిసారిగా అనుభవంలోకి వచ్చిందతనికి.

''నో...'' అని బిగ్గరగా అరిచేద్దామా అనిపించింది.

కానీ అతను గరళకంఠుడే అయ్యాడు.

విషాన్ని మింగుతున్నంత కష్టంగా ఎంతో ప్రయత్నపూర్వకంగా ఆ అక్షరాన్ని గొంతులోకి దిగమింగాడు.

అతనికేదో ఒక సమాధానం చెప్పడంకన్నా తను కూర్చున్నచోట భూమి రెండు బద్దలుగా విచ్చిపోయి తానందులో కూరుకుపోతే బావుణ్ణనిపించిందతనికి.

''మీరు నాకు ప్రామిస్ చేశారు...'' తడికళ్ళతోనే చూస్తూ గుర్తు చేస్తున్నట్టుగా అన్నాడు ప్రశాంత్.

''అవును...'' అతిభారంగా అన్నాడు దయాసాగర్.

''మాట తప్పరుకదూ?'' దీనంగా చూశాడు ప్రశాంత్.

''నిజంగా... నిజంగా లలిత లేకుండా మీరు బతకలేరా?''

''లలిత వేరొకరి సొత్తు అయిన మరుక్షణం నేను చనిపోవడం ఖాయం. అంత గాఢంగా, అంత పిచ్చిగా ప్రేమిస్తున్నానామెని. లలిత నాది అనే భావన నా చిన్నప్పుడు మొలకెత్తి నాతోపాటే పెరుగుతూ వచ్చి ఇపుడు నా మనసులో ఓ మహావృక్షమైపోయింది. ప్లీజ్ ట్రై టూ అండర్‌స్టాండ్ మీ. అదిపుడు కూకటివేళ్ళతో సహా పెళ్ళగించుకుపోతే- ఆ తాకిడికి నా మనసు ఎన్ని ముక్కలైపోతుందో మీరే ఊహించండి...'' రెండు చేతుల్తో కణతలు నొక్కేసుకుంటూ తల దించుకున్నాడు ప్రశాంత్. ''మీరు నాకీ సహాయంచేస్తే దానికి ప్రత్యుపకారంగా మీరు నా శరీరం లోంచి ఏ భాగాన్నడిగినా కోసిస్తాను. కానీ నాకు లలిత కావాలి. లలిత లేకుండా నేను జీవించలేను...''

తల రెండు చేతులమధ్యా వుండిపోవడంవల్ల అతని ముఖమైతే కనిపించడం లేదుగానీ... అతను రోదిస్తూన్నాడని మాత్రం గ్రహించగలిగాడు దయాసాగర్.

సముద్రంలో అలల్లా అతని హృదయంనిండా జాలి.

ఒక మగవాడయ్యిండీ అతనేడుస్తున్నాడూ అంటే నిజంగా అతని ప్రేమ ఎంత గొప్పది?

లలితను తనూ కోరుకుంటున్న మాట నిజమే అయినా- అతనన్నట్టు లలితతో తన పరిచయం, లేదా ప్రేమ వయసు కేవలం మూడునెలలే!

కానీ అతనో... ఊహ తెలిసినప్పట్నుంచి ప్రేమిస్తున్నాడామెను.

ఆమె లేకపోతే జీవించలేనంత గాఢమైనది అతని ప్రేమ.

లలిత తనకసలు పరిచయమై వుండకపోతే తానేం చేసుండేవాడు?... మరో సీతనో, సుజాతనో, ఎవర్నో... ఎవర్నో ఒకర్ని పెళ్ళాడేవాడే కదా?!

లలిత కోసం తానైతే ప్రాణత్యాగానికి సిద్ధపడగలిగేవాడా?

ఏమో?... ఎటూ తేల్చుకోలేని ఊగిసలాట!

అంతలో ప్రశాంత్ ముఖంమీంచి చేతుల్ని తప్పించి తలపైకెత్తి చూశాడు దీనంగా.

''చెప్పండి మిస్టర్ దయాసాగర్! ఎంతో ఆశతో మీ దగ్గరికొచ్చాను. మీ నిర్ణయం మీదే నా జీవితమాధారపడుతుంది''

'ఇంతేనా మీ ఔదార్యం?' అని అతని కళ్ళు తనని ప్రశ్నిస్తున్నట్టుగా అనిపించి తల

దించుకున్నాడు దయాసాగర్.

అంతలోనే గుండెను రాయి చేసుకుంటూ మళ్ళీ వెంటనే తల పైకెత్తాడు.

"డోంట్‌వర్రీ మిస్టర్ ప్రశాంత్..."

దయాసాగర్ చెయ్యి ప్రశాంత్ భుజంమీద పడింది.

"నాకు మీ బాధ అర్థమైంది అలాగే... మీరు చెప్పినట్టే చేస్తాను. పోతే మరో విషయం. నా మంచితనాన్ని చూసో, మరి దేన్ని చూసో లలిత నామీద ఇష్టాన్ని వ్యక్తం చేసిందే తప్ప అంతకుమించి మేమేం అడ్వాన్స్ అవ్వలేదు. ఇంతవరకూ మా మధ్యున్నది గురుశిష్యుల అనుబంధమే తప్ప ఇంకేమీ కాదు. కాబట్టి మీరు లలితని నిస్సంకోచంగా చేపట్టొచ్చు. ఐ విష్ యూ ఆల్ ది బెస్ట్..."

ఈ మాటలంటుంటే గొంతు తడారిపోతున్నట్టు అనిపించింది దయాసాగర్‌కి. అయినా ఆ చెప్పడం మాత్రం మనస్ఫూర్తిగానే చెప్పాడు.

తన పని ఇంత సులభసాధ్యమవుతుందని ఊహించని ప్రశాంత్ నిర్ఘాంతపోయాడు.

ఎంత త్యాగధనుడీ అబ్బాయి?

నిజంగా ఇలాంటివాళ్ళు ఎక్కడయినా వుంటారా అసలు?

కళ్ళుతోపాటు మనసూ ఆర్ద్రమైంది.

"థాంక్యూ మిస్టర్ దయాసాగర్! థాంక్యూ వెరీ మచ్. నిజంగా మీకెలా కృతజ్ఞతలు చెప్పాలో అర్థంకావడంలేదు..." అంటూ దయాసాగర్ రెండు చేతులూ పట్టుకుని కళ్ళకు అద్దుకున్నాడు ప్రశాంత్.

"ఇట్స్ ఓకే..." భారంగా నవ్వి అన్నాడు దయాసాగర్- "పరిస్థితులు మీకు అన్నివిధాలా అనుకూలించాలనీ, మీ కోరిక నెరవేరి లలితతో మీరు కలకాలం సుఖంగా జీవించాలనీ మనసారా కోరుకుంటున్నాను..."

ఇతను మనిషి కాదు. నిజంగానే మూర్తీభవించిన మంచితనం!! అనుకున్నాడు ప్రశాంత్.

ఆ తర్వాత మరి కొద్దిసేపు అక్కడే వుండి, తనకొచ్చిన భావనంతా ఉపయోగిస్తూ దయాసాగర్‌కి మరోసారి కృతజ్ఞతలు చెప్పుకుని వెళ్ళిపోయాడు ప్రశాంత్.

అతను వెళ్ళిన తర్వాత దయాసాగర్ మనసులో శూన్యమే మిగిలింది.

★ ★ ★

"ఏంటి మాష్టారూ, పొద్దుట్నించి గమనిస్తున్నాను. ఎందుకు ఇవ్వాళ మీరింత డల్‌గా వున్నారు? ఏదైనా పర్సనల్ ప్రాబ్లమా?" మర్నాడు సాయంత్రం క్లాసై అందరూ వెళ్ళిపోయాక దయాసాగర్‌ని ఒంటరిగా దొరకబుచ్చుకుని అడిగింది లలిత.

"ఏంలేదు లలితా..." అని నవ్వబోయి విఫలుడయ్యాడు దయాసాగర్.

"ఎందుకు మాష్టారూ అబద్ధమాడ్తారు? మామూలుగా అయితే మీరెలా వుంటారో నాకు తెలియదా? ఎందుకు నా నుండి దాస్తారు? చెప్పండి... దేనికి మీరు బాధపడుతున్నారు?"

లలిత అలా రెట్టించి అడుగుతుంటే ఆమెను కౌగలించుకుని బిగ్గరగా ఏడ్చేయాలనిపించింది దయాసాగర్‌కి.

కానీ బలిమిన నిగ్రహించుకున్నాడు.

అతని కళ్ళముందు ప్రశాంత్ తడికళ్ళు మెరిశాయి.

"లలితా! నీతో కొంచెం ఏకాంతంగా మాట్లాడాలి. ఎక్కడ వీలవుతుంది?"

"అమ్మయ్య... ఇన్నాళ్ళకో దార్లో పడ్డారన్నమాట. నాతో ఏకాంతం కావాలని ఇన్నాళ్ళకనిపించిందా అబ్బాయిగారికి?" అతని హృదయంలో చెలరేగిపోతున్న ఆందోళనా, అలజడీ, అశాంతీ తెలియని లలిత తన ధోరణిలో తమాషాగా అంది.

"సారీ లలితా! నేను నీతో మాట్లాడాలనుకుంటున్నది చాలా సీరియస్ విషయం..." బాధగా అన్నాడు దయాసాగర్.

"చెప్పండి..."

"ఇక్కడ కాదు... ఒకింత తీరుబాటుగా మాట్లాడాలి"

"సరే... ఎక్కడికి రమ్మంటారో మీరే చెప్పండి..."

దయాసాగర్ ఒకింతసేపు ఆలోచించి చెప్పాడు.

"రేపు ఆదివారం కదా! ఎలాగూ క్లాసుండదు. ఉదయం పదిగంటలకి మన వీధి మొద

ట్లో వున్న బస్టాపుకి రా. నేనక్కడ వెయిట్ చేస్తూంటాను. అక్కడినుంచి అలా నడుచు కుంటూవెళ్తూ మాట్లాడుకుందాం...''

''సరే మీ ఇష్టం'' అంగీకారం తెలిపి వెళ్ళి పోయింది లలిత.

ఆ రాత్రి దయాసాగర్ ముఖం కళావిహీ నంగా వుండటం చూసి నిరంజన్ కూడా అడిగాడు ''అదేంట్రా అలా వున్నావ్? ఒంట్లో గాని బాగోలేదా?'' అని.

''అబ్బే ఏంలేదు. బాగానే వున్నానే?'' అన్నా డు దయాసాగర్.

''లేదు... నీలో ఏదో మార్పు కనిపిస్తోంది'' అంటూ నిరంజన్ తరచితరచి ప్రశ్నించినా లాభం లేకపోయింది.

''నువ్వేదో ఉత్తుత్తిదే ఊహించుకుంటు న్నావ్. అంతే తప్ప నేను బాగానే వున్నాను'' అనేశాడే తప్ప మిత్రుడితో తన బాధని పంచు కోవడానికి సాహసించలేకపోయాడు దయాసా గర్.

లలితా దయాసాగర్‌ల విషయం నిరంజన్ దంపతులకు ఏనాడో తెలును. వరలక్ష్మి ఒక సారి భర్తవద్ద సందేహాన్ని వ్యక్తంచెయ్యగా, నిరంజన్ దయాసాగర్‌ని గుచ్చిగుచ్చి అడిగిన మీదట -''ఆమె నేనంటే ఇష్టపడుతోంది. నాకూ తనంటే ఇష్టమే! ప్రస్తుతానికి ఇంతే. పెళ్ళి ఆలోచన ఇప్పట్లో లేదు. ముందు నా పంతం నెరవేర్చుకోవాలి...'' అంటూ క్లుప్తంగా సంగతి చెప్పేశాడు అతను.

నిరంజన్ దంపతులకన్నా తనకి ఆప్తులెవ రున్నారు? వాళ్ళవద్ద దాపరికం దేనికి? ఒకవేళ రేపీ విషయంలో వాళ్ళ సహాయం అవసర మైనా కావచ్చు అన్న ఉద్దేశంతో వాళ్ళముందు తన ప్రేమ గురించి బయట పడిపోయాడు.

''లలిత మంచి అమ్మాయి. మీ ఇద్దరి జంటా బావుంటుంది'' అంటూ ఆనాడు వరల క్ష్మి అభినందించింది కూడా.

నిరంజన్ కూడా ఫేవరబుల్‌గానే మాట్లా డినా ''ఈ రంధిలోపడి నీ లక్ష్యాన్ని మర్చిపో బాకు'' అంటూ ఓ చిన్న హెచ్చరికలాంటిది చేశాడు.

అలాంటిదిపుడు తన ప్రేమత్యాగం గు రించి అతన్తో చెప్తే దుమ్మెత్తిపొయ్యడూ?

అంతేకాదు తనని పిచ్చివాడిలా అనుకు న్నా ఆశ్చర్యంలేదు. ఆ భయంతోనే దయాసా గర్ నిరంజన్‌కి నిజం చెప్పలేకపోయాడు.

మర్నాడు ముందుగా నిర్ణయించుకున్న ప్ర కారం బస్టాప్‌లో కలుసుకున్నారు లలితా, దయాసాగర్‌లు.

''ఇక్కడే నిలబడి మాట్లాడుకుందామా?'' బస్టాప్‌లో అట్టే జనం లేకపోవడం చూసి అన్నాడు దయాసాగర్ ''ఎవరైనా చూసినా బస్‌కోసం వెయిట్ చేస్తున్నాం అనుకుంటా రు...''

''సరే అయితే'' అనబోయి ''వద్దులే అలా నడుస్తూ మాట్లాడుకుందాం'' అంది లలిత.

ఎవరైనా చూస్తే ఏదో కొంప మునుగుతుంద న్న భయం ఆమెకు బొత్తిగా లేదు.

తల్లిదండ్రులముందే సాహసించి విషయం చెప్పేసిందాయె!

అలాంటిది ఎవరికో భయపడాల్సిన అవ సరం ఏమిటి?

''సరే...'' అన్నాడు దయాసాగర్.

ఓ ఇరవై అడుగులు వేశాక ఓ మలుపు.

''ఈ దార్లో వెళ్దాం. జనం అట్టే వుండరు'' అంది లలిత.

ఇద్దరూ ఆ దారిగుండా వెళ్ళడం ప్రా రంభించారు.

''ఊఁ చెప్పండి మాష్టారూ...''

ఆమెను రమ్మనడమైతే అన్నాడుగాని తీరా చెప్పబోయే సరికల్లా విషయం ఎలా ప్రా రంభించాలో అర్థంకాలేదు దయాసాగర్‌కి.

తను చెప్పేది విని లలిత ఏమను కుంటుందో?

తిట్టిపోస్తుందేమో?... ఏడుస్తుందేమో?

రకరకాల సందేహాలు వాటితోపాటు మనసు నిండా దిగులు.

''ఏదో చెప్పాలన్నారుగా? మాట్లాడరేంటి మాష్టారూ?''

లలిత రెట్టించడంతో ఇహ తప్పనిసరై నోరు విప్పాడు దయాసాగర్.

''అయామ్ సారీ లలితా! నేను నిన్ను ప్రేమించలేను. నువ్ నన్ను మర్చిపోవాలి''

బాధని అణచిపెట్టుకుంటూ చెప్పాడు.

"జోక్ చేస్తున్నారా?" నుదుటిమీద జీరాడుతున్న జుట్టు పాయల్ని చేత్తో పైకెగదోసుకుంటూ అడిగింది లలిత.

"కాదు లలితా! నిజంగానే చెబుతున్నాను..."

లలిత ఓ క్షణం ఆగి విస్మయంగా చూసింది అతనివైపు.

"ఎందుకని?" సూటిగా అడిగింది.

"ప్లీజ్... నన్ను కారణాలు అడగొద్దు. నీ మనసుని గాయపరుస్తున్నానని తెలుసు. అయినా నిజం చెప్పక తప్పదు. నేన్నిన్ను ప్రేమించలేను..." చెబుతుంటే నాడులు తెగిపోతున్న ఫీలింగ్.

"ఎందుకని? మొన్నటిదాకా నా ప్రేమని పొందడం మీ అదృష్టం అన్నవారు సడన్‌గా ఎందుకిలా మారిపోవాల్సి వచ్చింది?"

ఆమెవైపు చూసేందుకు సాహసించలేకపోయాడు దయాసాగర్. ఎటో చూస్తూ చెప్పాడు. "కారణం అడగొద్దు... కానీ నువ్ నన్ను మర్చిపోక తప్పదు. దట్సాల్!"

లలిత ఠక్కున నిలబడిపోయింది.

"అంతా మీ ఇష్టమేనా? మీరు తల్చుకున్నప్పుడు అవుననడానికీ లేనప్పుడు కాదనడానికీ ప్రేమంటే ఒక నవ్వులాట అనుకుంటున్నారా? ఆషామాషీ వ్యవహారం అనుకుంటున్నారా? నో... మీరు కారణం చెప్పి తీరాలి. చెప్పందే మిమ్మిల్నిక్కడ్నించి ఒక్క అడుగు కూడా ముందుకు వేయనివ్వను..." ముక్కుపుటాలు అదురుతుండగా అతనివైపు తీక్షణంగా చూసింది.

దయాసాగర్ కళ్ళు వాల్చుకున్నాడు.

"కారణం... కారణం..." నసిగాడు.

"అవును. నాకు నిజమేంటో తెలియాలి. తెలిసి తీరాలి..."

నడిరోడ్డుమీద తామలా నిలబడిపోయి మాట్లాడుకోవడం బావుండదనిపించి... "సరే చెప్తాను. నడుస్తూ మాట్లాడుకుందాం పద..." అన్నాడు దయాసాగర్.

సరేనన్నట్టు తలూపి లలిత ముందుక్కదిలింది.

ఏం చెప్పాలీ! ఎలా చెప్పాలీ?! ... దీన్ని గురించి అతను క్రితం రాత్రంతా మధనపడుతూనే గడిపాడు. ఎన్నో ఉపాయాలు (సాకులు) ఆలోచించి పెట్టుకున్నాడు కూడా.

వాటిలోంచే ఏదో ఒకటి చెప్పాలి.

కానీ ఆ చెప్పే కారణం సిల్లీగానో అతకనట్టుగానో వుంటే లలిత ఊరుకోదు.

అదీగాక ఒకసారి ఆమెముందు తను కూడా తన ప్రేమను వ్యక్తంచేసే వున్నాడు కాబట్టి ఇప్పుడు అల్లాటప్పా కారణం ఏది చెప్పినా ఆమె నిగ్గదీసే అవకాశం వుంది.

సో... అతనికి తోచిన ఉపాయాల్లోకెల్లా మోస్ట్ సూటబుల్ అనిపించినదాన్నే చెప్పడానికి నిశ్చయించుకున్నాడు.

"నిజమే లలితా! కారణమేంటో నీకు చెప్పాల్సిన బాధ్యత నాకుంది. నేను చెప్పేది విని నువ్ నన్ను సవ్యంగానే అర్థంచేసుకుంటావని ఆశిస్తున్నాను" అన్నాడు చిన్నసైజు ఉపోద్ఘాతంలాంటి దానితో ప్రారంభిస్తూ.

లలిత ఏ భావాన్నీ వ్యక్తం చెయ్యకుండా ఓరకంట చూసింది.

"నువ్వు మీ తాతగారు పోయిన సందర్భంలో వూరెళ్ళినపుడు అనుకోకుండా నా జీవితంలో ఓ చేదు సంఘటన జరిగిపోయింది. పేరూ వివరాలూ చెప్పలేనుగానీ క్లుప్తంగా జరిగిందేమిటో చెప్తా విను. ఒకమ్మాయితో, ఒక పెళ్ళికాని అమ్మాయితో నేను పొరపాటు చేశాను. అనుకోకుండా కలిసొచ్చిన ఏకాంతం... క్షణికావేశంలో మంచీచెడుల విచక్షణా జ్ఞానాన్ని కోల్పోవడంవల్ల ఆ పొరపాటు జరిగిపోయింది. నెపం ఆమె ఒక్కదానిమీదకే నెట్టలేను. అందులో ఇద్దరికీ భాగముంది..."

అతన్ని పూర్తిగా చెప్పనివ్వకుండానే అడ్డుతగిలింది లలిత. "ఎవర్తది? కొంపదీసి రజిత కాదుగదా?"

"ఛఛ కాదు కాదు..." కంగారుగా అన్నాడు దయాసాగర్. "ఆ అమ్మాయిని నేనో చెల్లెలిగా భావిస్తాను. ఆమెమీద నాకెప్పుడూ అలాంటి అభిప్రాయం కలగదు."

"మరైతే ఎవరు? శరణ్యా, గోమతా, ప్రియంవదా?" దయాసాగర్ కోచింగ్ సెంటర్లో తాముగాక మిగిలిన ముగ్గురమ్మాయిల పేర్లు

లిస్టు చదివించి లలిత.

"దయచేసి నన్ను పేరడక్కు. ఆ అమ్మాయికి ఇప్పటికే నేను చాలాద్రోహం చేశాను. పేరు బైటపెట్టి ఆమెనింకా అల్లరిపాలు చేయదల్చుకోలేదు..."

"సరే ఎవతో ఒకతి. ఇంతకీ మీరనేదేంటి? అసలిలాంటి దౌర్భాగ్యపు పనిచేసినవాళ్ళు మరి నేను ఊర్నుండి తిరిగొచ్చాక నా ప్రేమను అంగీకరిస్తున్నట్టుగా ఎందుకు చెప్పారు? అనాడే చెప్పేసుండాల్సిందిగా ఈ విషయం?"

లలిత అలా నిగ్గదీస్తుంటే తత్తరపడ్డాడు దయాసాగర్.

"నిజమే లలితా! పొరపాటే! ఆ అమ్మాయితో నేను చేసిన తప్పుని ఆమె మెళ్ళో తాళికట్టడంద్వారా సరిచేసుకోవాలన్న మంచి ఆలోచన అప్పట్లో నాకు కలగలేదు. కలక్కపోవడం కాదులే. ఆమెకన్నా నువ్వందమైనదానివి కావడంవల్ల నా మనసు నీవైపే మొగ్గింది. ఆ తప్పునలా గాలికి వదిలేద్దామనుకున్నాను. అందుకే నీ ఉత్తరం చూశాక నీకు నా అంగీకారాన్ని తెలిపాను. కానీ చేసిన తప్పు గుండెనో మూల దొలుస్తూవుంటే ఇన్నాళ్ళూ నేను చాలా అంతర్మధనానికి లోనయ్యాను లలితా! క్షణికావేశంలో జరిగినా ఎలా జరిగినా తప్పు తప్పే. దాన్ని సరిదిద్దుకునే అవకాశం వుండగా ఆమెకు అన్యాయం చెయ్యడం నాకు భావ్యంగా అనిపించడంలేదు. పశ్చాత్తాపం నన్ను దహించేస్తోంది. అందుకే నీతో ఈ విషయం చెప్పి..."

"నా హృదయాన్ని ముక్కలుచేసి ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నారు?" మధ్యలో అందుకుని చిరువ్యంగ్యాన్ని జోడిస్తూ అడిగింది లలిత.

"అవును లలితా. దీనివల్ల నీ మనసుకు కొంత బాధ కలగొచ్చు. కానీ నేనిలాంటివాడినని తెలిశాక నువ్ నన్ను మర్చిపోవడం ఏమంత కష్టం కాబోదు. కాగా నేనూ తప్పు దిద్దుకున్న వాణ్ణవుతాను. నా కారణంగా తన శీలాన్ని కోల్పోయిన ఆ అమ్మాయికీ న్యాయం జరుగుతుంది. దయతో పరిస్థితినర్థంచేసుకో. ప్లీజ్ లలితా నన్ను మర్చిపో..."

లలిత విరక్తిగా నవ్వింది.

"మీకు నిజంగా ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకునే ఉద్దేశం వుందా, లేక నన్నొదిలించుకోవడానికి ఏదో అల్లి చెబుతున్నారా?"

"లేదు లలితా! నేనామెను పెళ్ళిచేసుకుంటాను..."

"మరి ఎలాగూ పెళ్ళిచేసుకునే ఉద్దేశం వున్నప్పుడు ఆమె పేరు చెప్పడానికి మీకభ్యంతరందేనికి?"

"సారీ లలితా! ఇలాంటి విషయాలు పెదవిదాటితే ఊరుదాటుతాయ్! మా అమ్మానాన్నల్ని ఒప్పించి ఆమెను నేను పెళ్ళిచేసుకోడానికి బహుశా కొంత సమయం పట్టొచ్చు. ఈలోగా పేరు చెప్పి ఆమెను నీ దృష్టిలో ఓ సోకాల్డ్ కళంకినిగా ముద్రవేయడం దేనికి? ఒకవేళ నా చేతుల్లోలేని ఏ కారణాలవల్లేనా మా పెళ్ళి జరక్కపోవచ్చు. అప్పుడు కూడా నీలో ఆ ముద్ర అలాగే వుండిపోతుందికదా? కాబట్టి ఆమె వివరాలడక్కు. జరిగింది మాత్రం ఇది..."

చెప్పదల్చుకున్నది చెప్పేశాక బాధతోపాటు విచిత్రంగా ఏదో రిలీఫ్‌లాంటి భావన కూడా కలిగింది దయాసాగర్‌లో.

"సంతోషం" వ్యంగ్యంగా అంటూ రెండు చేతులూ జోడించి నమస్కరించి గిరుక్కున వెనుదిరిగింది లలిత.

ఆమె విసవిసా వెళ్ళిపోతుంటే ఆమెనే చూస్తూ నిల్చుండిపోయిన దయాసాగర్ కళ్ళు మసకబారాయి.

ఆవేదన గుండెను చీలుస్తుంటే ఆ తాకిడ్ని తట్టుకుని నిలబడుతూ ఏదో తృప్తి ఫీలవసాగాడు.

కాగా విచిత్రం ఏమిటీ అంటే-

తానొక పిచ్చివాడేమోనన్న అనుమానం అతనిలో ఆ సమయంలోనైనా కలగకపోవడం!

★ ★ ★

దేని విలువయినా మనిషికి తెలిసొచ్చేది అతడు దాన్ని కోల్పోయిన తరువాతే!

ఆ మర్నాడు లలిత క్లాసుకటెండ్ అయినా, తనవైపు కనీసం కన్నెత్తైనా చూడకపోవడం దయాసాగర్ని అమితంగా బాధించింది.

ప్చ్... ఒక్కరోజులో ఎంత మార్పు?!

చేతులారా తనే చేసుకున్నాడిలా!

ఆ ప్రశాంత్ తనకేమవుతాడని అతన్ని గురించి తానింత త్యాగంచేసినట్టు? అదే తొలిసారి... దయాసాగర్‌లో ఆ రకమైన ఆలోచన కలగడం.

అయితే గమ్మత్తుగా అలా అనుకున్నందుకు అంతలోనే అతను సిగ్గుపడ్డాడు.

పాపం ప్రశాంత్! కానీ త్యాగం చేసుండకపోతే అతని పరిస్థితి?

లలిత లేకుండా అతను జీవించలేడు.

లలితే అతని ఊపిరి.

అతని ప్రాణం నిలపడంకోసం తాను చేసిన ఈ పని ఏమంత గొప్ప త్యాగమని?

స్వతఃసిద్ధమైన జాలి గుండె నావరించుకోగా మళ్ళీ పూర్వపుటాలోచనా విధానంలోకి వచ్చేశాడు దయాసాగర్.

తాను చేసింది రైటేననిపిస్తోందతనికి.

లలిత ఆరోజంతా ముభావంగా గడిపి కనీసం వెళ్ళేముందైనా చెప్పకుండా వెళ్ళిపోయింది క్లాసునుండి.

"ల...లి...తా..." ఆమె వెళ్ళిపోతుంటే దయాసాగర్ నాలుక చివరిదాకా వచ్చిన పిలుపు ఏదో బ్రేక్ వేసినట్టు సడన్‌గా ఆగిపోయింది.

పిలుస్తాడు...

ఒకవేళ ఆగుతుంది...

కానీ తామిద్దరిమధ్యా ఇంకా ఏం మిగిలిందని మాట్లాడుకోవడానికి?

తానిపుడామె దృష్టిలో మునుపటి మంచివాడు కాదు. ... సమయమూ, అవకాశమూ కలిసొస్తే కన్నెపిల్లల జీవితాలతో ఆడుకోగల ఒక నీచుడు!

'అలాంటి' తనతో ఇపుడామెకేం మాటలుంటాయ్? -ఛ, ఛీ లాంటి ఒంటి అక్షరపు ఛీత్కరింపులే తప్ప?

ఆమె మెట్లుదిగి కనుమరుగయ్యేవరకూ అలాగే చూస్తూ నిలబడి, ఆ తర్వాత బరువెక్కిన గుండెతో తన రూమ్‌లోకి వెళ్ళిపోయాడు దయాసాగర్.

★ ★ ★

ఓ వారం రోజులు అతిభారంగా దొర్లిపోయాయి.

ఎంత నిగ్రహంగా వుందామనుకున్నా ఆవేదన మనసుని కుదిపేస్తుంటే తనకు తెలియకుండానే నానాటికీ కృంగిపోసాగాడు దయాసాగర్.

ముఖంలో కళాకాంతులనేవి అంతరించిపోయాయి.

మనిషిలో ఉత్సాహమనేది మచ్చుకైనా లేకుండాపోయింది.

ఎప్పుడూ పరధ్యానంగా వుండడం.

శూన్యదృక్కులు.

దానికితోడు ప్రతిరోజూ నీట్‌గా షేవ్ చేసుకునేవాడల్లా గడ్డం మాసినా పట్టించుకోకపోవడం.

"కొంపదీసి వీడికెవరైనా చేతబడిగాని చెయ్యలేదుగదా?" అనిపించింది నిరంజన్‌కి దయాసాగర్‌ని ఆ స్థితిలో చూస్తుంటే.

"ఏంట్రా ఇలా వుంటున్నావ్?" అని ఎన్నిసార్లడిగా దయాసాగర్ బయటపడితేకదా?

"మామూలుగానే వున్నాను కదా?" అంటూ నవ్వబోయేవాడు గాని ఆ నవ్వులోనూ జీవముండేది కాదు.

"కొంపదీసి నీ పంతంగాని నెగ్గదేమోనని బెంగపెట్టుకున్నావా ఏంటి? ఇప్పటికే ఇరవైవేలు క్రాసైపోయింది నీ బ్యాంక్ బాలెన్సు. ఏవన్నా తక్కువ పడితే నేను సర్దుతాను లేరా..." అని నిరంజన్ అంటే-

"అలాగే"నని తలూపి వూరుకోవడమే తప్ప, తన బెంగకు కారణం అదేననిగానీ, అది కాదనిగానీ చెప్పేవాడు కాదు దయాసాగర్.

"అన్నయ్యగార్ని చూస్తుంటే నాకేంటో భయంగా వుందండీ! మనసులో ఏదో పెట్టుకుని కుమిలిపోతున్నాడులా వుంది. అదేమిటో తెలుసుకుంటే తప్ప లాభంలేదు" అని వరలక్ష్మి భర్తవద్ద రోజూ పోర్తుండేది.

"నేనడుగుతూనేవున్నాను. వాడు చెబితేగా?"

నిజం అంతేగా మరి!

"లలితకూ నీకూ ఏమన్నా బెడిసిందా?" అని కూడా అడిగాడు నిరంజన్ ఒకరోజు.

"అబ్బే అలాంటిదేంలేదు..." అని బుకాయించేశాడు దయాసాగర్.

మిత్రుడితో అంతా చెప్పేసి హృదయాభారాన్ని దింపుకోవాలనిపించినా... భయం. ఎక్కడ తాటాకులు కడ్తాడో, ఎక్కడ తలవాచేలా చీవాట్లు వేస్తాడోనని. తను వేసింది వెనక్కి తీసుకోలేని అడుగు. అలాంటప్పుడు ఎవరికి చెప్పుకుంటే మాత్రం ఏం లాభమన్న నిరాశ కొంత.

తనది స్వయంకృతాపరాధం అని ఒకపక్క తెలుస్తూనే వుంది.

అయినా దాన్ని అపరాధంగా అంగీకరించలేకపోవడమూ జరుగుతూనే వుంది.

తప్పో ఒప్పో... ప్రశాంత్‌కి మేలు జరగాలన్న కోరికతో లలితతో తానో ఘోరమైన అబద్ధం ఆడేశాడు.

ఇలా ముందుకు సాగిపోవాలే తప్ప, ఇప్పుడిహ వగచేం ప్రయోజనం?

అలా అనుకోవడం తేలికే.

కానీ మనసుకు కళ్ళెం వేయడమే కష్టం.

ముఖ్యంగా తనకైతాను చేసుకున్న చెరుపు ఏ మనిషినీ ప్రశాంతంగా వుండనివ్వదు.

ఆనాటినుండి ఈనాటివరకూ లలిత తిరిగి తనతో ఒక్కమాట కూడా మాట్లాడలేదు...

క్లాస్‌లో పాఠ్యాంశాలకు సంబంధించిన ప్రశ్నలేమైనా అడిగితే -ఎంతవరకు జవాబు చెప్పాలో అంతవరకే! కనీసం అలాంటి సమయాల్లో కూడా తనవైపు చూడ్డం మానేసింది.

పోనీ మాటలవసరంలేదు. సాదాసీదాగా ఒక్క చూపైనా చూస్తే ఎంత బాగుణ్ను?!

అనుక్షణం అలా తపించిపోతూండేది దయాసాగర్ మనసు.

కానీ మరో వారంరోజులు గడిచిపోయినా అది అత్యాశగానే మిగిలిపోయింది.

అవును మరి!

లలిత స్థానంలో ఎవరున్నా అలాగే ప్రవర్తిస్తారు.

★ ★ ★

ఆరోజు...

దయాసాగర్‌ని చూడ్డంకోసం నిరంజన్ వాళ్ళింటికొచ్చింది అతని తల్లి అఖిలాండేశ్వరి.

దయాసాగర్ తన 'త్యాగం' ఫలితంగా కృంగిపోవడం మొదలెట్టేక అదే తొలిసారి ఆమె అక్కడికి రావడం.

కొడుకు అవతారం చూసి బావురుమందామె.

"ఏంట్రా ఇది?! ఏమైందిరా నీకు?! ఒంట్లో బాగుండడంలేదా?" ఏడుస్తూనే కొడుకు ఒళ్ళంతా నిమిరింది.

"ఏమిటోనండీ! రోజురోజుకీ పాడైపోతున్నారు అన్నయ్యగారు! కారణం అడిగితే ఏమీ చెప్పడంలేదు... మీరైనా కనుక్కోండీ" అంది పక్కనే వున్న వరలక్ష్మి.

"ఈ వెధవిలా తయారైతే మాకెందుక్కబురు చెయ్యలేదమ్మా?" వరలక్ష్మితో అంది అఖిలాండేశ్వరి. పైకి తేలకపోయినా ఒకరకంగా అది నిష్ఠూరమే!

అది గమనించి అన్నాడు దయాసాగర్. "నాకేమైందనమ్మా ఈ గోల? నాకేం నేను బాగానే వున్నాను. కానైతే బద్ధకంవల్ల, గడ్డం గీసుకోకపోవడంవల్ల నీకంటికి రోగిష్ఠిలా కనిపిస్తున్నానేమో!" అదేదో ఓ జోక్‌లా నవ్వడానికి కూడా ప్రయత్నించాడు ... కానీ ఆ ప్రయత్నం పూర్తిగా ఫలించలేదు.

తనయుడి మాటల్ని పట్టించుకోకుండా అంది అఖిలాండేశ్వరి. "వెళ్ళి ఒకసారి అద్దంలో చూసుకుని రారా... నువ్విలా వున్నావో నీకే బోధపడుతుంది..."

"మరీ విచిత్రంగా మాట్లాడ్తావమ్మా! ఏం నేను రోజూ చూసుకోవడం లేదా?" అనేశాడు దయాసాగర్ తేలిగ్గా.

కానీ ఎంతయినా తల్లి. అంత తేలిగ్గా వదిలిపెడుతుందా?

సమాధానపడలేకపోయింది అఖిలాండేశ్వరి.

రకరకాలుగా ప్రశ్నించింది కొడుకుని.

అయితే అడిగి అడిగి ఆమె నోరు నెప్పెట్టిందే తప్ప, కొడుకునుండి ఏమీ రాబట్టలేకపోయింది.

"నేను బాగానే వున్నాను మొర్రో అంటుంటే వినిపించుకోవేం" అన్నాడు దయాసాగర్ చివ

ర్లో రవంత విసుగ్గా.

కొడుకు విసుక్కున్నంత మాత్రాన్న కన్నతల్లి చిన్నబోతుందా?

"ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ఇంటి కొచ్చేసెయ్‌రా! మీ నాన్నగారు నిన్ను పన్నెత్తు మాటన్నా నా ప్రాణం అడ్డేస్తాను..." అంటూ ప్రాధేయపడింది అఖిలాండేశ్వరి.

"ఈనగాచి నక్కల పాలన్నట్టు... ఇన్నాళ్ళూ ఒర్చుకున్నవాడ్ని ఇంకో నెలా పదిహేను రోజు లాగలేనా?... గడుపు పూర్తయ్యిందాకా నేను రానుగాక రాను" అనేశాడు దయాసాగర్.

ఇతన్ని బతిమాల్తూ ఆ పూటంతా అక్కడే గడిపిందావిడ.

అయినా ఫలితం లేకపోయింది.

ఇంటికెళ్ళి భర్తతో ఆవిడ ఏం మొత్తుకుందో ఏమో, ఆ మర్నాడు రాయుడొచ్చాడు దయాసాగర్‌ని చూడ్డానికి.

కొడుకుని చూసి ఆయన కూడా కన్నీరు నింపుకున్నాడు.

ఇంటి కొచ్చేయమని చేతులు పట్టుకుని వేడుకున్నాడు.

కానీ దయాసాగర్ తన పట్టు వదల్లేదు.



**మ**రో మూడ్రోజుల తర్వాత-

ప్రశాంత్ మళ్ళీ వచ్చాడు దయాసాగర్ దగ్గ రికి.

అతన్ని చూస్తూనే ఒక్కక్షణం మంటగా అనిపించినా తన్నుతాను నిభాయించుకున్నాడు దయాసాగర్.

"రండి... ఏంటి మళ్ళీ వచ్చారు? ఎలా వుంది మీ ప్రోగ్రెసు?" అనడిగాడు పేలవంగా నవ్వుతూ.

"అయామ్‌సారీ మిస్టర్ దయాసాగర్" అంటూ తల దించుకున్నాడు ప్రశాంత్.

"దేనికి?"

"నేనేదో భ్రమలోపడి ఉత్తపుణ్యానికి మీ మనసులో అల్లకల్లోలం రేపాను..."

విషయం అర్థంకాలేదు దయాసాగర్‌కి.

"అంటే?" అన్నట్టుగా చూశాడు.

"నా ప్రయత్నంలో నేను పూర్తిగా ఓడిపోయాను మిస్టర్ దయాసాగర్! లలిత నన్ను చేసుకోవడానికి ఎంత మాత్రం అంగీకరించడం లేదు..."

"మీ అక్కయ్యగారు నచ్చజెబుతారన్నారుగా... ఆవిడ..."

దయాసాగర్ మాట పూర్తికాకముందే అందుకున్నాడు ప్రశాంత్. "ఆవిడ ప్రయత్నాలు ఆవిడా చేసింది. ఎన్నివిధాలుగా చెప్పినా లలిత మా అక్కయ్య మాట వినడం లేదట..."

"అరెరె... మరి ఎలా ఇప్పుడు?" ప్రశాంత్ ముఖంలోకి జాలిగా చూశాడు దయాసాగర్.

లలితని ఒప్పించే బాధ్యత తనమీద మోపడానికి వచ్చాడేమో ప్రశాంత్ అనిపించింది అతనికి.

కానీ తనకది సాధ్యమా?

లలిత తనతో మాట్లాడ్డమే మానేసింది. అలాంటిది ఇతని విషయంలో తానామెను కన్విన్స్ చెయ్యడమంటే... జరిగేపనేనా అది?

దయాసాగర్ ఆలోచనలిలా సాగుతుండగా-

ప్రశాంత్ చెప్పాడు. "నేను బాగా ఆలోచించాను దయాసాగర్‌గారూ! నా మీద ఏమాత్రం ఇష్టంలేని ఆ అమ్మాయిని చేసుకుని నేను మాత్రం ఏం సుఖపడగలను? పెళ్ళంటే నూరేళ్ళ పంటంటారు. ఇష్టంలేని భార్యతో జీవితమంతా ఒక తంటాగా మార్చుకునేకంటే పూర్కోవడమే ఉత్తమంగా అనిపిస్తోంది... అందుకే నేనిపుడు మనసు మార్చుకున్నాను. మా మారుటక్కయ్య కూతురు వసంతకి నేనంటే ప్రాణం. నన్ను ద్వేషించే లలిత చుట్టూ తిరిగి ప్రాధేయపడ్డంకన్నా- నన్ను ప్రేమించే వసంతని చేసుకోవడం అన్నివిధాలా మంచిదనిపిస్తోంది..."

ఆకాశం ఘనీభవించి ముక్కలు ముక్కలుగా విరిగి తన నెత్తిన కూలుతున్నట్లుగా అనిపించింది దయాసాగర్‌కి.

ఏమిటిది?

ఓ ఇరవైరోజుల క్రితం ఇతను చెప్పిన మాటలన్నీ ఏమైపోయినట్టు?

లలిత లేని తన జీవితాన్ని కలలో కూడా ఊహించలేనన్నాడే? అలాంటివాడు ఇపుడేమంటున్నాడు?

లలిత కాకపోతే మరో వసంత...

ఛ! ఇంత అల్పమైనదా ఇతని ప్రేమ?

ఇలాంటి వ్యక్తి కోసమా తానింత త్యాగానికి పాల్పడింది?

తనది త్యాగమే అయితే అదిపుడు బూడిదలో పోసిన పన్నీరైపోయినట్టేగా?!

దయాసాగర్‌కి జుట్టు పీక్కోవాలనిపించింది. తనని తాను రక్కుకోవాలనిపించింది.

"మరి మరి లలిత లేకుండా మీరు బతకలేనన్నారుగా?" హీనస్వరంతో ప్రశ్నించాడు.

"అప్పుడలా అనిపించింది. కానీ నన్ను ఇష్టపడని వ్యక్తిమీద నాకు మాత్రం ఎందుకంత ఇష్టముండాలి? నా తప్పేమిటో ఇప్పుడు తెలిసొచ్చింది నాకు. ఇంకా ఆమెకోసం పాకులాడి నన్ను నేను ఓ వెధవగా మార్చుకోదల్చుకోలేదు. మిమ్మల్ని కోరరాని కోరిక కోరి అనవసరంగా ఇన్నాళ్ళూ క్షోభ పెట్టాననుకుంటా! అయామ్ వెరివెరీ సారీ! లలిత నాకింక అవసరంలేదు. మీదారినుండి అడ్డుతప్పుకుంటున్నాను. ఆమెతో మీ ప్రేమాయణాన్ని మీరింక నిరభ్యంతరంగా కొనసాగించవచ్చు. ఐ విష్ యూ ఆల్‌ది బెస్ట్..."

ప్రశాంత్‌నేం చేసినా పాపం లేదనిపించింది దయాసాగర్‌కి.

'నా జీవితాన్ని సర్వనాశనం చేశావు కదురా' అని మనసులో అనుకోకుండా వుండలేకపోయాడు.

ఇంకెక్కడి ప్రేమ?

ఇతని మాటలు నమ్మి నిష్కారణంగా తన గొయ్యి తానే తవ్వుకున్నాడు. లేనిపోని కట్టుకథ కల్పించి చెప్పి ఆమె దృష్టిలో తానొక హీనుడైపోయాడు.

ఇపుడింక ఎన్ని చెప్పినా ఆమె మనసు మారుతుందా?

ఆమెను మళ్ళీ తనవైపు తిప్పుకోవడం తనకిహ సాధ్యమా?

ఇంపాజిబుల్!

కింది పెదవిని కొరుక్కుంటూ అచేతనంగా కూర్చుండిపోయిన దయాసాగర్ భుజంమీద చెయ్యివేస్తూ అన్నాడు ప్రశాంత్.

"ఏంటి దయాసాగర్‌గారూ అలా మౌనంగా వుండిపోయారు? జరిగినదానికి నేనెంతో బాధపడుతున్నాను. పశ్చాత్తాపం చెందుతున్నాను. నన్ను క్షమించలేరా?"

"నేను మిమ్మల్ని క్షమించినా క్షమించకపోయినా మీకు పెద్దగా బాధ కలిగేదేంలేదు. ఇప్పుడు సమస్య అదికాదు..." అంటూ అతనికోసం తానెంత త్యాగానికి పాల్పడ్డాడో చెప్పి- "ఇప్పుడు నన్నేం చేయమంటారో మీరే చెప్పండి. కోల్పోయిన ఆమె ప్రేమను తిరిగి పొందడం ఎలా? ఆమె మళ్ళీ నన్ను నిర్దోషిగా గుర్తించాలీ అంటే నేనేం చెయ్యాలి?" అన్నాడు దయాసాగర్ ఆవేదనగా.

ప్రశాంత్ తల దించుకున్నాడు.

"నాకోసం మీరలా అబద్ధం చెప్పినట్టు లలితకిపుడు నిజం చెప్పేయండి. అంతకన్నా చెయ్యగలిగిందేముంది?"

"చెబితే లలిత నమ్ముతుందా?"

"మీ అతిమంచితనం ఆమెకు కొత్తకాదు కాబట్టి నమ్ముతుందనే అనుకుంటున్నాను మరి..." అనేసి లేచి నిలబడ్డాడు ప్రశాంత్.

"వస్తానండీ..."

"మంచిది..." పళ్ళబిగువున కోపాన్ని దాచుకుంటూ చెప్పాడు దయాసాగర్.

ప్రశాంత్ ప్రశాంతంగా వెళ్ళిపోయాడు దయాసాగర్‌లో అశాంతిని మిగిల్చి.

అతను వెళ్ళిపోయాక జరిగిందంతా పునశ్చరణ గావించుకున్న దయాసాగర్‌కి తొలిసారిగా అనిపించింది... తానొక పిచ్చివాడేమోనని!

పిచ్చిపిచ్చి ఆలోచనలు... చిక్కులు పడిన దారంలా.

తన ఖర్మకొద్దీ ఇలా జరిగిందిలెమ్మని ఇంత టితో లలితను మర్చిపోవడమా, లేక ఆమెను నమ్మించే ప్రయత్నాలు చెయ్యడమా?

ఎటూ తేల్చుకోలేకపోతున్నాడు.

బుర్ర గోడకేసి బాదుకోవాలనిపించింది.

తనకి పిచ్చెక్కిపోవడం ఖాయమని పించింది.

ఎలా? ఎలా ఈ పరిస్థితిని ఎదుర్కోవడం?

ఎవరైనా వచ్చి ఏదైనా మార్గం సూచిస్తే బావుండుననిపించింది.

తన మార్గంలో తానే పల్లేరుకాయలు చల్లు కున్నాడు. ఎవరో వచ్చి వాటిని ఏరిపారేస్తారని ఆశించడం ఎంత అవివేకం?!

పొద్దుగుంకేదాకా ఆ గదిలోంచి బయటికి రాకుండా అలా ఆలోచిస్తూనే వుండిపోయాడు దయాసాగర్.

అందరికీ వున్నట్టే అతనికీ ఓ అంతరాత్మ వుంది.

అయితే ఇన్నాళ్ళూ అతను దాన్ని నోరెత్తని చ్చేవాడు కాదు.

అలాంటిది ఇప్పుడతను బలహీనుడైపోవ డంతో అది కాస్తా తెగబడి అతన్ని చూసి పరిహసించడం ప్రారంభించింది.

★ ★ ★

ఆ రాత్రంతా బాగా ఆలోచించి జరిగింది జరిగినట్టు లలితకి వివరించడమే మంచిద న్న నిర్ణయానికొచ్చాడు దయాసాగర్.

ఆ మర్నాడు-

'నీతో చాలా చాలా ముఖ్యమైన విషయం మాట్లాడాలి. దయచేసి ఓ పదినిమిషాలు అవ కాశం ఇవ్వు' అని ఓ చిన్న చీటీమీద రాసి ఎలాగోలా దాన్ని లలితకి అందజేశాడు దయా సాగర్.

ఆ సాయంత్రం క్లాసైపోయి అందరూ వెళ్ళిపో యాక కూడా ఇంకా అక్కడే వుండిపోయి దయాసాగర్‌ని అడిగింది లలిత.

"ఏంటి మీ ఉద్దేశం? ఇంత జరిగాక్కూడా ఇంకా మీరు నాతో మాట్లాడాల్సిందేం మిగి లింది?"

"నీతో అసలు నిజం చెప్పాలి..." భయపడు తూనే అన్నాడు దయాసాగర్.

లలిత అదోలా నవ్వింది.

"నిజాల్లో అసలు నిజాలూ నకిలీ నిజాలూ అని రెండు రకాలుంటాయా?"

ఇదివరకటిలా ఇపుడు లలితని ఎక్కడికైనా రమ్మంటే వచ్చే అవకాశం లేదు.

వున్న సమయాన్నే సద్వినియోగం చేసుకో వాలి.

అందుకు నేరుగా అసలు విషయంలోకి వచ్చేశాడు దయాసాగర్.

"నేను ఆరోజు నీతో చెప్పిందంతా అబద్ధం లలితా! నేను ఎవ్వరితోనూ ఏ తప్పూ చేయలే దు. అసలు నేనింతవరకూ కనీసం ఏ స్త్రీనీ అలా తాకనైనా తాకలేదు. నువ్ ఆవేశపడ కుండా వినేట్టయితే జరిగిందేంటో చెప్తాను..."

లలిత వ్యంగ్యంగా నవ్వింది. నవ్వుతూనే అంది - "బాగుంది. బ్రహ్మాండంగా వుంది. మీరు తడవకో కోత కోస్తుంటే నమ్మడానికి నేనేం చెవిలో పువ్వెట్టుకున్నాననుకున్నారా?"

"ప్లీజ్ లలితా! అలా తేలిగ్గా తీసిపారెయ్య బాకు. అసలు సంగతి చెప్పడానికి నాకో అవ కాశం ఇవ్వు... ప్లీజ్..." అర్థింపుగా చూశాడు దయాసాగర్.

లలిత ఏమనుకుందో ఏమో, "సరే చె ప్పండి" అంది ఓ బెంచీమీద కూర్చుంటూ.

ప్రశాంత్ తన దగ్గరికి తొలిసారిగా వచ్చినప్ప ట్నుంచి ఇప్పటిదాకా జరిగిందంతా ఆమెకు వివరంగా చెప్పాడు దయాసాగర్. "నేనొక వెర్రి వెధవని లలితా! అతని దీనావస్థకు కరిగి పోయి నామీద నీకు విముఖత ఏర్పడాలని ఆరోజలా చెప్పాను. కానీ నిన్ను దూరం చేసుకు న్నందుకు ఇన్నాళ్ళూ నేనెంత బాధపడ్డానో ఆ భగవంతుడికే తెలుసు. నిన్న మీ ప్రశాంత్ మావయ్యొచ్చి అలా చెబుతుంటే నాకతన్ని చంపెయ్యాలనిపించింది తెలుసా? నన్ను మన్నించు లలితా! నాకు నువ్వు కావాలి. తిరిగి నీ ప్రేమ కావాలి..." అన్నాడు చివర్లో దేబిరింపు ముఖం పెట్టి.

"ఎక్సలెంట్‌గా వుంది మీ కట్టుకథ. ప్రయ త్నిస్తే మీరు చాలా మంచి రచయిత కాగలుగు తారు. ట్రై చెయ్యండి..." అంది లలిత సీరి యస్‌గా.

''లలితా!'' అన్నాడు దయాసాగర్ బాధగా.

''ఏవిటీ?'' వ్యంగ్యంగా దీర్ఘం తీసింది లలిత. ''ఇదంతా నన్ను నమ్మమంటారు.నేనే వద్దన్నా పిచ్చిదాన్ననుకుంటున్నారా - మీ నిజ స్వరూపమేంటో ఒకసారి తెలిశాక కూడా ఇంకా మీ మాటలు నమ్మడానికి?''

''నేనే పిచ్చివాడ్ని లలితా!'' బాధగా తల దించుకుంటూ అన్నాడు దయాసాగర్.

''నువ్విలా మాట్లాడ్తావని నేను ముందుగానే ఊహించాను. అయినా నీమీద ప్రేమను చంపుకోలేక సిగ్గు చంపుకుని నీకిదంతా చెప్పాను. నిన్ను నమ్మించడానికి నన్నేం చెయ్యమంటావో చెప్పు లలితా... పోనీ... పోనీ మీ ప్రశాంత్ మావయ్యతో రుజువిప్పించనా?''

''ఎందుకూ?'' ఎదురుగా వున్న డెస్క్‌మీద చిన్నగా గుద్దుతూ అంది లలిత. ''ఒకవేళ మీరు చెప్పిందంతా నిజమే అయినా, నేనిపుడు మళ్ళీ మనసు మార్చుకుని మిమ్మల్ని ప్రేమించడానికి సిద్ధపడలేను. అసలు ప్రేమంటే ఏంటో తెలుసా మీకు?''

''తె... తెలును...''

''ఏమిటి?''

బదులివ్వలేకపోయాడు దయాసాగర్.

మహామహా కొమ్ములు తిరిగిన రచయితలే ప్రేమంటే ఏమిటో సరిగ్గా నిర్వచించలేకపోయారు. వాళ్ళతో పోలిస్తే ఆఫ్టరాల్ ఇతగాడే పాటి?

''మీరు చెప్పలేరు. ఎందుకంటే మీకు ప్రేమంటే అర్థం తెలీదు గనుక...''

''అదికాదు లలితా...'' అంటూ ఏదో చెప్పబోయాడు దయాసాగర్.

''ఏది కాదు?'' అంటూ ఖండించిందామె. ''నాకే రుజువులూ సాక్ష్యాలూ అక్కర్లేదు. మీరు చెప్పింది నిజమే అయినా నేనిపుడు మిమ్మల్ని అసహ్యించుకుంటానేతప్ప, ప్రేమించలేను. మీలో మంచితనమో, వెర్రిబాగులతనమో ఏదో వుంటే వుండొచ్చు. కానీ దానికోసం ప్రేమించిన అమ్మాయినే వొదులుకుంటారా ఎవరైనా? మీ దృష్టిలో ప్రేమించిన అమ్మాయి ఓ పెన్నో కర్చీఫో, తుండుగుడ్డో అన్నమాట - ఎవరడిగితే వాళ్ళకిచ్చేయడానికి?! ఇపుడు నేను మళ్ళీ మీ ప్రేమనంగీకరిస్తే రేపింకొకడు తటస్థపడతాడు నన్ను ప్రేమిస్తున్నానంటూ. తమరిగారి జాలి గుండె అప్పుడుమాత్రం కరిగిపోదని గారెంటీ ఏంటి? మళ్ళీ మీరు మొదటికే రారని గారంటీ ఏంటి?''

ఆమె అలా అడుగుతుంటే హృదయం తూట్లుపడుతున్నట్టుగా అనిపించింది దయాసాగర్‌కి.

''లేదు లలితా... మళ్ళీ ఇంకెప్పుడూ ఇలాంటి పొరపాటు చెయ్యను. ప్రపంచం తిరగబడిపోయినాసరే నేనింక నిన్నొదులుకోను. ప్లీజ్ నన్ను నమ్ము...'' అన్నాడు మాటలు కూడగట్టుకుంటూ.

''బట్ యు ఆర్ టూ లేట్. ఒక ఆడపిల్ల మనసులో ప్రేమ జనించడానికి ఎంతసేపు పడుతుందో అందులో వెయ్యోవంతుచాలు ఇలాంటి సందర్భాలలో మనసు విరిగిపోవడానికి. ఏ మంచితనాన్ని చూసైతే మిమ్మల్ని ఒకప్పుడు ప్రేమించానో, అదే మంచితనాన్ని చూసి ఇప్పుడసహ్యించుకుంటున్నాను. నేను మంచితనాన్నీ మానవత్వాన్నీ ప్రేమించగలనే తప్ప వెర్రిబాగులతనాన్ని ప్రేమించలేను. అయామ్ సో సారీ మిస్టర్ దయాసాగర్! ఇంకెప్పుడూ నావద్ద మళ్ళీ ఇలాంటి ప్రస్తావన తేబాకండి. గుడ్‌బై!''

దిగ్గున లేచి విసురుగా వెళ్ళిపోయిందామె.

''లలితా!'' అంటూ అతను వెనుకనుంచి పిలిచాడుగాని ఆమె ఆ పిలుపును ఖాతరు చేయలేదు.

దయాసాగర్‌కి ఏడుపొక్కటే తక్కువయ్యింది.

★ ★ ★

మంచితనానికి అవధులు లేకపోతే ఏం జరుగుతుందో ఇపుడు బాగానే తెలిసొచ్చింది దయాసాగర్‌కి.

కానీ ఏం లాభం?

చేతులు కాలేక ఆకులు పట్టుకున్నా ప్రయోజనమేముంటుంది?

'మీరు చెప్పిందంతా నిజమే అయినా నేనిపుడు మిమ్మల్ని అసహ్యించుకుంటానే తప్ప ప్రేమించలేను...'

'మీ దృష్టిలో ప్రేమించిన అమ్మాయి ఓ

పెన్నో కర్చీఫో, తుండుగుడ్డో అన్నమాట - ఎవరడిగితే వాళ్ళకిచ్చెయ్యడానికి...'

'ఏ మంచితనాన్ని చూసైతే మిమ్మల్ని ఒక పుడు ప్రేమించానో, అదే మంచితనాన్ని చూసి ఇప్పుడసహ్యించుకుంటున్నాను. నేను మంచితనాన్ని మానవత్వాన్నీ ప్రేమించగలనే తప్ప వెర్రిబాగులతనాన్ని ప్రేమించలేను...'

లలిత మాటలు చెవుల్లో గింగురు మంటుంటే తట్టుకోలేకపోతున్నాడు దయాసాగర్.

ఈ ఒక్కసారికీ లలిత తనని మన్నిస్తే ఇకనుండి తానూ అందర్లా ఇంగితమెరిగి ప్రవర్తించడానికి సిద్ధమే!

అంతేకాదు... లలితకోసం... ఆమెగనక కోరితే జీవితంలో అసలే మంచిపనీ చెయ్యకుండా వుండడానికి కూడా సిద్ధమే!

కానీ అలా అని లలితని నమ్మించడం ఎలా?

తనపట్ల ఆమె మనసు విరిగిపోయిందని చాలా స్పష్టంగా చెప్పింది.

తననిపుడు అసహ్యించుకుంటున్నట్టు కుండబద్దలు గొట్టినట్టు చెప్పింది.

అలాంటిది ఇంకా ఆమెను ఎన్నివిధాలుగా ప్రాధేయపడినా ఫలితముంటుందా?

వుండదు. వుండదుగాక వుండదు.

దిక్కుమాలిన మంచితనంకొద్దీ తనవేలితో తన కన్నే పొడుచుకున్నాడు.

ఇపుడెంత విచారించి మాత్రం లాభమేమిటి?

తనమీద తనకే జాలి పుట్టింది దయాసాగర్‌కి.

తన వెర్రితనంమీద తనకే ఏవగింపు కలిగింది దయాసాగర్‌కి.

సరిగ్గా అదేసమయంలో 'రజితకు తను చేసిన సహాయం' కూడా వెర్రితనంకిందకే వస్తుందేమోననిపించింది దయాసాగర్‌కి.

ఇది జరగడానికి సరిగ్గా నాలుగురోజుల క్రితం రజితకు తనో సహాయం చేశాడు.

అది కూడా ఇపుడు చేయగూడని సహాయమేనేమో అనిపించింది తనకి.

'ఆ విషయం ఏమయ్యిందో రేపు రజితనడిగి తెలుసుకోవాలి' అనుకున్నాడు మనసులో.

అంతలోనే అతని మనసు మళ్ళీ లలితమీదకు డైవర్ట్ అయింది.

రజిత విషయం తర్వాత చూసుకోవచ్చు.

ముందు తను వెంటనే పరిష్కరించుకోవాల్సిన సమస్య - లలిత ప్రేమను తిరిగి పొందడం ఎలా? అన్నది.

విషయం అంతా చెప్పేసి నిరంజన్నీ, వరలక్ష్మినీ సలహా అడిగితేనో?

అవును... వాళ్ళకన్నా శ్రేయోభిలాషులెవరున్నారు తనకి? తన ముదనష్టపు మంచితనాన్ని ఎగతాళి చేస్తూ ముందు నాలుగు మాటలన్నా ఆ తర్వాతైనా తన బాగునే కాంక్షిస్తారు వాళ్ళు. తనకేదో ఒక మార్గం చెప్పకపోరు.

తనుగా మళ్ళీ ఒకసారి లలితను ప్రాధేయపడినా ఫలితముంటుందన్న నమ్మకం లేదు. నమ్మకం కాదు అసలా ఆస్కారమే లేదు.

తప్పనిసరిగా మూడోవ్యక్తి ప్రమేయంతోనే ఈ సమస్య పరిష్కరింపబడాలి. అంతకన్నా గత్యంతరం లేదు.

అవడానికి స్నేహితుడి భార్యే అయినా, వరలక్ష్మి తనని సొంత అన్నయ్యకన్నా మిన్నగా చూసుకొంటోంది. నిరంజన్ లలితతో ఎక్కువగా మాట్లాడడుగానీ, వరలక్ష్మైతే బాగా సన్నిహితంగానే వుంటుందికదా ఆమెతో.

ఇది చెల్లెమ్మా నా పరిస్థితి అని చెబితే వరలక్ష్మి తన తరపున లలితతో తప్పకుండా రాయబారం జరుపుతుంది. ఆమెను కన్విన్స్ చెయ్యడానికి శతవిధాలా ప్రయత్నిస్తుంది. అందులో సందేహంలేదు.

ఇలా అనుకునేసరికి దయాసాగర్ ముఖంలో రవంత కళలాంటిది వచ్చింది.

ఫలితం ఏమయినా కానీ - ముందు ప్రయత్నంకదా ముఖ్యం? అనుకుని ఆ రాత్రి భోజనాల అనంతరం నిరంజన్ దంపతుల్నిద్దర్నీ కూర్చోబెట్టి - "నేనొక వెర్రివాజమ్మనని ముందే అంగీకరిస్తున్నాను. కాబట్టి ఆ సంగతి మళ్ళీ మళ్ళీ గుర్తుచేస్తూ నన్ను తిట్టిపొయ్యకుండా నా సమస్యకు మీరో పరిష్కారమార్గం చూపాలి" అంటూ శ్రీకారం చుట్టాడు తన గోడు వెళ్ళబోసుకోవడానికి.

విషయం బోధపడక ఆ దంపతులిద్దరూ

ఆశ్చర్యంగా చూశారు.

"నువ్వేం చెప్పబోతున్నావో నేనూహించలేక పోతున్నాను గాని - మొత్తానికి చల్లకొచ్చి ముంత దాస్తున్నట్టుగా వుంది నీ వ్యవహారం. ముందే హామీ తీసుకుంటున్నావూ అంటే నువ్వేదో తిక్కపని చేశావనే అర్థం. సరే తిట్టంలే... కానియ్..." అన్నాడు నిరంజన్ పచ్చజెండా ఊపుతూ.

దయాసాగర్ వరలక్ష్మివైపు బిడియంగా చూశాడు. "వాడొక్కడూ హామీ ఇస్తే చాలదు. చెల్లెమ్మా నువ్ కూడా ఇవ్వాలి" వరలక్ష్మి నవ్వింది.

"భలేవారే అన్నయ్యగారూ! నేనెప్పుడైనా మిమ్మల్ని తిట్టేనా ఏంటి? మీ స్నేహితుడంటే ఏదో చనువుకొద్దీ అంటుంటారు..."

"నిజమేననుకో చెల్లెమ్మా! కానీ ఎవడి కొంపని వాడే తగలబెట్టుకుని మళ్ళీ ఆర్పమని వేరేవాళ్ళని సహాయమడిగితే తిట్టరా ఏంటి?" అన్నాడు దయాసాగర్.

"తిట్టడంకాదు. చావదంతారు. కానీ మేమంత పని చెయ్యంలే... చెప్పు" నిరంజన్ అన్నాడు - 'వీడేదో పీకలమీదకు తెచ్చుకున్నాడులా ఉంది' అని మనసులో అనుకుంటూ.

"ఫర్వాలేదులే చెప్పండన్నయ్యగారూ!"

వరలక్ష్మి కూడా అలా అన్నమీదట చెప్పడం ప్రారంభించి దాపరికం లేకుండా అంతా... మొత్తం చెప్పేశాడు దయాసాగర్ దేభ్యంముఖం పెట్టుకుని.

విషయం తెలుసుకున్న ఆ దంపతులకి అతన్నేవనాలో తోచలేదు. తిట్టబాకండని ముందే మాట తీసుకున్నాడాయె!

అయినా ఊరుకోలేకపోయాడు నిరంజన్.

"మరీ ఇంత మెదడులేని చేష్టలు చేస్తే ఎలాగురా?" అంటూ ప్రారంభించి ఒకింత సున్నితంగానే మరో నాలుగు చీవాట్లు వేశాడు.

"పోన్లే ఊరుకోండీ..." అంది వరలక్ష్మి.

"ఎన్ని తిట్టినా పడతాను. కానీ ఎలాగోలా నా సమస్యని పరిష్కరిస్తే చాలు..." దీనంగా ముఖంపెట్టి అన్నాడు దయాసాగర్.

"నేను లలితతో మాట్లాడతాను. ఎలాగైనా ఒప్పిస్తాను. మీరేం బాధపడకండన్నయ్యగారూ!"

దయాసాగర్ దీనవదనాన్ని చూసి చలించిపోయిన వరలక్ష్మి అలా హామీ ఇచ్చేసింది. ఆ సమయంలో సాధ్యాసాధ్యాల్ని గురించి ఆమె ఆలోచించలేదు.

"ఏమని మాట్లాడ్తావ్ ఆ అమ్మాయితో?" నిరంజన్ అన్నాడు.

"నిన్నుమాత్రం తిట్టిపొయ్యదని గారంటీ ఏంటి?"

"తిట్టదులెండి. చెప్పేవిధంగా చెబితే ఎవర్నయినా మార్చొచ్చు. మీకెందుకు, అదంతా నాకొదిలేయండి నేన్చూసుకుంటాను..." కాస్త ధీమాగానే అంది వరలక్ష్మి.

"అవున్రా! నీకెందుకు, నువ్వొదిలేయ్. అదంతా చెల్లెమ్మ చూసుకుంటుంది..." అన్నాడు దయాసాగర్ కంగారుగా.

నిరంజన్ వరలక్ష్మికి అనవసరంగా అడ్డుపుల్లలు వేస్తున్నాడేమోననిపించింది. అతన్లో ఆ కంగారు పుట్టింది.

"సరే చూద్దాంగా" అనేశాడు నిరంజన్. మిత్రుడి కంగారు చూస్తుంటే అతనికి నవ్వొచ్చింది. అయినా అణిచిపెట్టుకున్నాడు. వరలక్ష్మి లలితని ఒప్పించగలుగుతుందన్న నమ్మకం అతన్లో ఏకోశానా కలగలేదు. కానీ మిత్రుడి పరిస్థితి చూస్తూ అశుభం పలకడం దేనికిలే అని ఆ మాట పైకనలేదు.

దయాసాగర్ వరలక్ష్మికేసి మరింత దీనంగా చూస్తూ అన్నాడు. "చెల్లెమ్మా నన్ను నీట ముంచుతావో పాలముంచుతావో నీదే భారం!"

"నా ప్రయత్నం నేను చేస్తానన్నయ్యగారూ! మంచే జరుగుతుందని ఆశిద్దాం..." అంది వరలక్ష్మి.

దయాసాగర్ ఆమెకేసి కృతజ్ఞతాపూర్వకంగా చూశాడు.

చేతులు కూడా జోడిద్దామనుకున్నాడుగాని, బావుండదని మానేశాడు.

★ ★ ★

సాగర్‌కిచ్చిన మాట నిలుపుకునేందుకు వరలక్ష్మి ఆ మర్నాడుదయమే లలితావాళ్ళింటికి వెళ్ళడమైతే వెళ్ళిందిగాని...

ఈమె వెళ్ళేసరికి లలిత ఇంట్లో లేదు.

ఎక్కడికెళ్ళిందీ అని ఆరాతీయగా - లలిత

ఇంట్లోనేకాదు అసలు ఊళ్లోనే లేదని తెలి సింది.

విషయం ఏమిటయ్యా అంటే

సూర్యం చెల్లెలు పెద్ద మనిషయిందట. ఆ సందర్భంగా లలితా, సూర్యం కలిసి ఊరెళ్ళా రట క్రితం రాత్రే!

ఓ వారం తర్వాతగాని తిరిగి రాదని చె ప్పింది జోగాంబ. "అసలు అందరం కలిసి వెళ్ళాల్సిన వాళ్ళమే! కానీ మీ అంకుల్‌కి ఒంట్లో బాగోకపోవడంవల్ల దాన్ని పంపించి మేముండిపోయాం" అందావిడ.

"అరెఁ... నాతో లలిత మాటవరసకైనా చెప్ప లేదే? అది సరే అంకుల్‌కేమైందీ? జ్వరమా?!" అంది వరలక్ష్మి.

"బంక విరేచనాలు. బాగా నీరసించిపో యారు..." అంది జోగాంబ.

దాంతో ఒకసారి మాధవరావ్‌గారి దగ్గర క్కూడా వెళ్ళి ఆయన్ని పరామర్శించి- "వస్తా నాంటీ! లలితని రాగానే నన్నోసారి కలుసుకో మని చెప్పండి. కొంచెం మాట్లాడాలి..." అంటూ జోగాంబవద్ద శలవు తీసుకుని తిరిగి ఇంటికొచ్చేసింది వరలక్ష్మి.

ఆమె రాగానే "కాయా? పండా?" అన్నట్టు ఆశగా చూశాడు దయాసాగర్.

సంగతి చెప్పి "కాబట్టి మరో వారం రోజుల దాకా ఆగాల్సిందే అన్నయ్యగారూ!" అంది వరలక్ష్మి.

దయాసాగర్‌కి నిలువునా నీరసం ముంచుకొ చ్చేసినట్టనిపించింది.

అసలీ ఆడపిల్లలు ఉన్నట్టుండి పెద్ద మను షులెందుకవుతారో? అయ్యారుపో దానికో ఫంక్ష న్నూ, ఆ ఫంక్షన్‌కి బంధువులు రావడం పోవడం ఇవన్నీ దేనికో? గోంగూర! గోంగూర పచ్చడి!' అనుకున్నాడు మనసులో కోపంగా.

"సరేలే చెల్లెమ్మా" అనేశాడు పైకి.

ఏడు రోజులు అంటే ఏడూ ఇంటూ ఇరవై నాలుగ్గంటలూ ఇంటూ అరవై నిముషాలు, ఇంటూ అరవై సెకండ్లు అయ్య బాబోయ్ ఎప్పటికి గడుస్తాయో అనుకున్నాడు భారంగా.

సరే ఈ ఏడు రోజులూ ఏడుస్తూ కూర్చో వడం దేనికి?

ఈలోగా రజిత విషయం తేల్చేసేయాలి అనుకున్నాడు అంతలోనే.

ఆ సాయంత్రం క్లాసయ్యాక అందరితోపాటే రజిత కూడా వెళ్ళిపోబోతుంటే "నీతో కొంచెం మాట్లాడాలి. ఆగు రజితా!" అన్నాడు దయాసా గర్.

ఆగింది.

అందరూ వెళ్ళిపోయి తామిద్దరే మిగిలేక అడిగింది. "ఊఁ చెప్పండి మాష్టారూ! ఏంటి?!"

"అదే... ఆ సంగతి ఏం చేశావ్?" నసిగాడు దయాసాగర్.

"ఏ సంగతి?" అర్థం కానట్టుగా ముఖం పెట్టింది రజిత.

"అదే రజితా! డబ్బు విషయం! మీ అమ్మ గారింకా ఊరెళ్ళి రాలేదా?" గుర్తు చేశాడు దయాసాగర్.

"డబ్బా?! డబ్బేంటీ?!! మా అమ్మగారు ఊరెళ్ళి రావడం ఏంటి?!!" రజిత ముఖంలో ఆశ్చర్యం, అయోమయం!

నడినెత్తిన పిడుగు పడినట్టుగా అని పించింది దయాసాగర్‌కి.

ఆమె ముఖంలోని ఆశ్చర్యాన్నీ అనుమానా న్నీచూసి ఇతగాడు కూడా అదే అవస్థకు లోనవ్వాల్సి వచ్చింది.

ఎంత నాటక మాడుతోంది?!!

ఆడపిల్లల్లో కూడా ఇంత తెగింపు వుంటుందా?

ఆడపిల్లలు కూడా ఇంతగా మోసం చే స్తారా?

"అదేంటి రజితా అలా అంటావ్? డబ్బు... నా డబ్బు... నేన్నీకిచ్చిన డబ్బు..." అన్నాడు కంగారుగా.

"మీరు నాకు డబ్బివ్వడమేంటీ?! ఎప్పుడి చ్చారూ?!" తొణుకూ బెణుకూ లేకుండా ఎదు రు ప్రశ్నవేసింది రజిత.

దయాసాగర్‌కి ఆమెను జుట్టుపట్టుకుని రెండు చెంపలూ వాయగొట్టాలనిపించింది. కానీ చూస్తూ చూస్తూ ఆడపిల్ల మీద ఎలా చెయ్యి చేసుకోవడం?

అతి బలవంతాన్న తన కోపాన్నీ ఆవేశాన్నీ

కంట్రోల్ చేసుకున్నాడు.

"ఇది చాలా అన్యాయం రజితా! నేను ఏ పరిస్థితుల్లో నీకా డబ్బిచ్చానో తెలిసి కూడా నువ్విలా బుకాయించడం... ఇంతకన్నా ద్రోహం ఇంకేవన్నా వుంటుందా?"

అలా అంటుంటే దయాసాగర్ కంఠం వణికింది.

నిజానికి బావురుమని ఏడ్చేయాల్సినంత ఘోరమైన పరిస్థితి అది.

"మీరేవంటున్నారో నాకర్థం కావట్లేదు. మీరు నాకు డబ్బివ్వడమేంటి?" మళ్ళీ అదే పాట పాడిందామె.

దయాసాగర్‌కి ఆమెనేం చేసినా పాపముండదనిపించింది.

కానీ ఏం చెయ్యగలడు తను?

ఆమె తనని మోసగించడానికే నిశ్చయించుకుందని స్పష్టంగా తెలిసిపోతూ వుంది!

రుజువా, సాక్ష్యమా, ఆమెకు తను డబ్బిచ్చినట్టు?!

నిజమేమిటో ఆమె అంతరాత్మకే తెలును.

అలాంటిది ఇంత ఘోరంగా డబాయిస్తుంటే ఏం చెయ్యాలామెను?

ఎవరితోనైనా చెప్పుకున్నా తన మాట నమ్మాలనేముంది?

ఎవరైనా రుజువడుగుతారు.

తన దగ్గర ఏముంది రుజువు? ఏం చెప్పి నమ్మించగలడు ఎవర్నయినా?

తననితానే పీక పిసికేసుకోవాలనిపించింది దయాసాగర్‌కి.

ఛీ! ఎంత చవటాయి తను?! ఎంత మూర్ఖుడు తను?!

"నువ్వు నన్నింత మోసం చేస్తావని నేను కల్లో కూడా అనుకోలేదు రజితా! ఆరోజు నువ్‌చెప్పిందంతా నమ్మి, మీ అమ్మగారి పరిస్థితికి జాలిపడి నేనంత సహాయం చేస్తే... దానికి ఇదా నాకు లభించిన ప్రతిఫలం. డబ్బుపోయినందుక్కాదు రజితా నా బాధ. నీ చర్యవల్ల నాకు మంచితనం మీదే నమ్మకం పోయింది. దయాగుణం మీదే నమ్మకం పోయింది. సరే ఆఖరుసారిగా అడుగుతున్నాను. నా డబ్బు నాకు తిరిగిచ్చే ఉద్దేశం నీకుందా లేదా?" అన్నాడు నిస్సహాయంగా ఆమెవైపు చూస్తూ.

"మీరు మళ్ళీ మొదటికే వస్తున్నారు మాష్టారూ! అసలు డబ్బేంటీ, మీరు నాకు ఇవ్వడమేంటి?!"

ఆమె అలా అంటుంటే ఇలాంటివాళ్ళు నలుగురూ చూస్తుండగా హత్య చేసి నెత్తురోడుతున్న కత్తిని చేత్తో పుచ్చుకుని మరీ దబాయించగలరేమో ననిపించింది దయాసాగర్‌కి.

"ఛీ!" అన్నాడు అసహ్యంగా.

"మర్యాదగా మాట్లాడండి మాష్టారూ! మీకు మతిభ్రమించి ఏదో మాట్లాడుతున్నార్లే అని ఇంత సేపూ సహించాను. ఊరుకున్నాను కదాని ఛీత్కారింపుల్లోకి దిగుతున్నారు. అసలేమనుకుంటున్నారు నన్ను?" అంటూ ఎదురు తిరిగింది రజిత.

గుండెలు తీసిన బంటని ఇలాంటివాళ్ళనే అంటారు కాబోలనిపించింది దయాసాగర్‌కి.

తన అజ్ఞానం తననే వెక్కిరిస్తున్నట్టుగా అనిపించింది దయాసాగర్‌కి.

ఆమె పూర్తిగా తెగించేసింది. అందుకే ఇలా ఎదురుతిరగ గలుగుతోంది. తానిపుడామెను ఏమీ చేయజాలడు. తన డబ్బుకి నీళ్ళొదులుకోవడం మినహా.

జరిగింది ఎవరితోనైనా చెప్పుకుంటే తనకే తాటాకులు కడతారు తప్ప... ఒకవేళ కట్టకపోయినా ఎవరు మాత్రం తనకి న్యాయం చేకూర్చగలరు?

రుజువూ పత్రమూ లేకుండా ఆ అమ్మాయికి అంత డబ్బు ఎలా ఇచ్చావని అడిగితే తన వద్ద సమాధానమేముంది?

"సర్లే రజితా! నేను నీకే డబ్బూ ఇవ్వలేదు. యూ కెన్‌గో" అనేశాడు తనలాంటి సన్నాసికిలాంటి శాస్తి జరగాల్సిందేలే అని మనసులో అనుకుంటూ.

"వస్తాను... ఇంకెప్పుడూ ఇలా తిక్కతిక్కగా మాట్లాడబాకండి" అంటూ వార్నింగిచ్చి విసవిసా వెళ్ళిపోయింది రజిత.

"ఛీ!" అనుకున్నాడు దయాసాగర్.

* * *



రజితకు తాను డబ్బిచ్చి మోసపోయిన సంగతి నిరంజన్‌కి చెప్పకూడదనే అనుకున్నాడు దయాసాగర్.

చెప్పుకున్నా లాభమేముందీ?

తనని మోసగించడమే ఆమె ఉద్దేశమైనప్పుడు ఆమెను ఎవ్వరూ అడ్డుకోలేరు.

విషయం నలుగురి నోళ్ళలోనూ పడితే నాలుగు రకాలుగా చెప్పుకుంటారు. అంతే తప్ప... ఎవ్వరూ తనకి న్యాయం చెయ్యలేరు.

అసలే లలిత విషయం అలావుందంటే దానికి తోడు పుండుమీద కారంలా ఇదొకటి!

అన్నివిధాలా సర్వనాశనం అయిపోయాడు తను.

ఇంచుమించు ఓ ఊబిలో కూరుకుపోయాడు తను. దాన్నొంచి బయటపడ్డం ఇహ తన వల్లకాదు.

లలిత విషయం అలా వుంచినా రేపొద్దు న్న కనీసం తండ్రి ముందైనా తలెత్తుకు నిలబ డలేని పరిస్థితి ఏర్పడిపోయింది తనకి.

ఇన్నాళ్ళూ తాననుభవించిన కష్టాలన్నిటికీ ఫలితం లేకుండా పోయింది.

ఒకటి కాదు... రెండు కాదు... పదిహేను వేలు! పదిహేను వేలు తీస్కెళ్ళి గుడ్డిగా ఆ రజిత చేతిలో పోశాడు తను.

ఆ పని చేసే ముందు నిరంజన్‌తో కనీసం మాట వరసకైనా ఒక్కముక్క చెప్పుంటే ఎంత బావుండేది?

నిరంజన్ అయితే అసలివ్వనిచ్చేవాడే కా దు.

ఇలా తనలోతానే బాధపడతూ ఆ రోజంతా గడిపేశాడు.

అయితే అనుకోకుండా ఆ మర్నాడే అతని బండారం బయటపడిపోయింది.

నిరంజన్ తన పాత స్కూటర్ని అమ్మేసి కొత్త స్కూటర్ కొనాలనుకుంటున్న సంద ర్భంగా ఓ ఎనిమిదివేలు తక్కువపడి "నెక్స్ట్ మంత్ ఫస్ట్ వీక్‌లో నాకు లోను శాంక్షనవు తుంది. అప్పుడిచ్చేస్తాగానీ నీ అకౌంట్‌లోంచి డ్రా చేసి ఓ ఎనిమిదివేలు సర్దరా" అని అడిగాడు దయాసాగర్‌ని.

దయాసాగర్‌కి పచ్చివెలక్కాయ గొంతులో అడ్డుపడ్డట్టుగా అయ్యింది.

నిరంజన్‌కి తెలిసి తన అకౌంట్‌లో ఇరవై వేల రెండువందలకు పైగా వుండాలి.

కానీ రజిత పుణ్యమా అని ఇపుడంత లేదు.

ఎలా మరి?

దయాసాగర్ రాయిలా బిగుసుకుపోవడం చూసి ఆశ్చర్యపోయాడు నిరంజన్.

ఎవరైనా అడగడమే ఆలస్యం గుండెన యినా చీల్చి ఇచ్చేసే ఈ బడుద్ధాయ్ ఇలా మాట్లాడకుండా వుండిపోయాడేంటి?

కొంపదీసి వాడికి గడువు దగ్గరపడుతోంది. కాబట్టి ఇవ్వడానికి సంకోచిస్తున్నాడా ఏంటి?

"ఏంట్రా మాట్లాడవ్!? నేన్నీకేం ట్రబులివ్వ న్లే... వచ్చే నెల పదోతారీఖుకల్లా నీ డబ్బు మళ్ళీ నీకు పువ్వుల్లో పెట్టి తిరిగిచ్చేస్తా..." అన్నాడు నవ్వుతూ.

"అబ్బే... నువ్ ఇవ్వవని కాదు కానీ..." అంటూ మాటనాన్చాడు దయాసాగర్.

ఒకవేళ నా లోన్ శాంక్షన్ కాకపోతే ఎలా అనా నీ సందేహం? నైన్‌టీనైన్ పాయింట్ నైంటీనైన్ పర్సంట్ అలా జరగదు. ఒకవేళ జరిగినా అవసరమైతే వరం మెళ్ళోని నెక్లెస్ అమ్మేనయినా సరే నీ బాకీ తీర్చేస్తాను. అంతే తప్ప నిన్ను రిస్క్‌లో పెట్టను. సరేనా?" అన్నా డు నిరంజన్.

అతనలా అంటుంటే కళ్ళనీళ్ళ పర్యంత మైంది దయాసాగర్‌కి. "అయామ్‌సారీరా! నా అకౌంట్లో అంత బాలన్స్ లేదు..." అన్నాడు నిజం చెప్పేయడానికే సిద్ధపడి తల దించు కుంటూ.

తృళ్ళిపడ్డాడు నిరంజన్.

"ఏమైంది? కొంపదీసి ఏ తలమాసిన వెధ వకైనా ధర్మం చేసేశావా?" అన్నాడు గాభరాగా.

అవును కాదులకు మధ్యస్తంగా తలూపి నేల చూపులు చూస్తూండిపోయాడు దయాసా గర్.

"ఎవరికిచ్చేవ్‌రా? కనీసం నాతో మాట మాత్రంగానైనా చెప్పకుండా ఎందుకిచ్చేవ్? ఇంతకీ అది తిరిగొచ్చే బాపతేనా లేక గంగలో కలిసిపోయినట్టేనా?" అన్నాడు నిరంజన్ గాభ రాకి కోపాన్ని కూడా జోడిస్తూ.

దయాసాగర్ ఉలకలేదు పలకలేదు.

"మాట్లాడవేరా? చెప్పు... ఎవరికిచ్చేవ్?" ఇంచుమించు గద్దించినట్టుగానే అడిగాడు నిరంజన్.

"అయామ్ సారీరా! నన్ను మన్నించు. నేను మరోసారి వెర్రి వెధవనైపోయాను..."

"నువ్ వెర్రివెధవ్వి కానిదెప్పుళ్ళే. గాని ఏం జరిగిందో చెప్పు ఎవరికిచ్చేవో చెప్పు..."

ఒక రెండు క్షణాలు తటపటాయించినా గుండె దిటవు చేసుకుని నిజమే చెప్పేశాడు దయాసాగర్.

"మైగాడ్! అప్పుగానా ఉదారంగానా?"

"ఉదారంగా ఇవ్వడానికి నేనేం వెర్రివెధ వనా?" అనబోయి అంతలోనే మానేశాడు దయాసాగర్. కారణం అలా మాట్లాడే అర్హత తనకు లేదని తనే గుర్తించడంవల్ల.

"ఇవ్వడం అప్పుగానే ఇచ్చాను కానీ..."

అంటూ తల పైకెత్తి బెదురుగొడ్డులా బిత్తరచూపులు చూశాడు.

ఆ చూపులు చెప్పకనే చెబుతున్నాయి అతనేదో టోకరా తినేశాడని.

తానేమాత్రం గట్టిగా మాట్లాడినా మిత్రుడు ఏడ్చేసేలా వున్నాడని గుర్తించి దయాసాగర్‌ని నెమ్మదిగా బుజ్జగించి మెత్తమెత్తని మాటలతో మొత్తం విషయమంతా కూపీ లాగాడు నిరంజన్.

రజితా వాళ్ళమ్మ ఒకరోజు ఏదో ఫంక్షన్‌కి వెళ్తూ పక్కింటామె నగొకటి అడిగి తీసుకుని మెళ్ళో వేసుకుని వెళ్ళిందట. తీరా ఇంటికొచ్చి చూసుకునేసరికి ఆ నగకాస్తా ఆమె మెళ్ళో లేదట. ఆ విషయం భర్తకు తెలిస్తే చంపేస్తాడన్న భయంకొద్దీ ఇంట్లో పొక్కకుండా ఆ పక్కింటామెనే వెళ్ళి బతిమాలిందట. సదరు పక్కింటామె ఆ నగ ఖరీదుని పదిహేను వేలుగా తేల్చి, అర్జంటుగా నగైనా ఇవ్వండి లేదా డబ్బయినా ఇవ్వండి. లేకుంటే నా భర్త నన్ను చంపేస్తాడు అంటూ గొంతు మీద కూర్చుందట. ఆ పరిస్థితుల్లో ఏం చేయాలో పాలుపోని రజితా వాళ్ళమ్మ అర్జంటుగా పుట్టింటికి వెళ్ళి తండ్రితో పరిస్థితి చెప్పుకుని రోదించగా ఓ నెల్రోజుల్లో పొలం తాలూకు డబ్బేదో వస్తుందనీ అప్పుడు సర్దుబాటు చేస్తాననీ చెప్పాడట ఆయన. రజితా వాళ్ళమ్మ పక్కింటామెకు ఆ విషయం చెప్పినా ఆవిడ వూరుకోలేదట. ఉన్నపళంగా డబ్బివ్వాల్సిందే, లేకపోతే రభస చేస్తానంటూ బెదిరించిందట.

ఈ కథంతటినీ దయాసాగర్‌కి యధాతథంగా వినిపించి "మా నాన్న అసలే కోపిష్టి మనిషి. ఆయనకి జడిసి మా అమ్మ ఏ బావిలోనో దూకేసేలావుంది. ఈ గడ్డు పరిస్థితిలో నాకు మీ మంచితనం గుర్తొచ్చి మీ సహాయం కోసం వచ్చాను. మీరో పదిహేనువేలు సర్దితే మా అమ్మ ఈ ఆపదనుండి బయటపడగలుగుతుంది. మళ్ళీ ఓ నెల్లోపల మా అమ్మ వూరెళ్ళి రాగానే మీ డబ్బు స్వయంగా నేనే తీస్కొచ్చి మీ చేతుల్లో పెడతాను. మాష్టారూ ఇవిచేతులు కావు కాళ్ళనుకోండి" అంటూ ప్రాధేయపడిందట రజిత. "ఈ విషయం మనిద్దరి మధ్యేవుండనివ్వండి..." అని కూడా వేడుకొందట.

దాంతో మనవాడి మనసు కరిగి నీరై, ఆ మర్నాడే బ్యాంకులోంచి పదిహేను వేలు డ్రా చేసి ఆమె చేతిలో పోసేశాట్ట.

"ఏదో అవసరం గడుపుతున్నాననుకున్నానే తప్ప, ఆ అమ్మాయి నన్ను మరీ ఇంతలా డిసీవ్ చేస్తుందనుకోలేదురా..." అంటూ ముగించి ఏడుపు ముఖం పెట్టిన దయాసాగర్‌ని ఏమనాలో అర్థం కాలేదు నిరంజన్‌కి.

ఇప్పటివరకూ రిలీజైన తెలుగు సినిమాల్లోని బూతులన్నిటినీ కలిపేసి దయాసాగర్ మీద ప్రయోగించినా తప్పులేదనిపించింది.

కోపాన్ని బలిమిన అణిచిపెట్టుకుంటూ "ఇంత జరిగినా కూడా నాతో చెప్పకుండా దాచిపెట్టావన్న మాట!" అన్నాడు నిరంజన్ నిష్ఠూరంగా.

"చెబుదామనే అనుకున్నాన్రా... కానీ ఎవరు మాత్రం చెయ్యగలిగిందేముందీ? అందుకనీ..." అంటూ నసిగాడు దయాసాగర్.

"అయితే ఆ డబ్బుమీద ఇంక ఆశ వదిలేసుకున్నట్టేనా?"

"అంతేగా మరి..." అన్నాడు నీరసంగా.

"నీ బొంద. రేపు నేనూ, వరం కలిసి నిగ్గదీస్తాం. ఆ అమ్మాయి ఎలా ఇవ్వదో, ఎందుకివ్వదో చూస్తాం" పళ్ళు నూర్తూ అన్నాడు నిరంజన్. "మరీ ఇంత అన్యాయమా? పోతే పోయిందిలెమ్మని ఊరుకోవడానికి పదో పరకోనా? పదిహేను వేలు! ఎందుకూరుకోవాలి?"

"ఆ అమ్మాయి తననలు తీస్కోనేలేదని దబాయించేస్తోంది. మనమేం చెయ్యగలం?"

"చెయ్యలేం అనుకుంటే ఏమీ చెయ్యలేం. చెయ్యాలీ అనుకుంటే ఏమైనా చెయ్యొచ్చు. నువ్వింకేం నోరు మెదపబాకు ఈ విషయంలో. ఆ పిల్లకి ఎలా బుద్ధి చెప్పాలో మేం చూసుకుంటాం" అనేసి అక్కడ్నించి లేచి చకచకా భార్య దగ్గరికెళ్ళి ఆమె ముందు మళ్ళీ ఈ రికార్డంతా ఓసారి ప్లే చేశాడు నిరంజన్.

"రజిత అంత పని చేసిందా? నమ్మలేకపోతున్నానండీ" అంది వరలక్ష్మి ఆశ్చర్యంగా.

"దయాసాగర్ ఉత్త వెర్రివెధవ! వాడబద్ధం చెబుతున్నాడంటావా అయితే?" అన్నాడు నిరంజన్.




# మగాళ్ళు చేస్తున్న ఆడ డాన్సులు

ఫంక్షన్స్ నందర్భంగా మిలిటరిబాండ్ వాద్యానికి అనుగుణంగా అడుగు కలుపుతూ విన్యాసాలు చేయడం ఒకప్పుడు కేవలం అమ్మాయిలకే పరిమితమైన విద్య. అయితే ఆ సంప్రదాయాన్ని త్రోసిరాజని అబ్బాయిలూ ఈ రంగంలోకి వచ్చేశారు. అచ్చం అమ్మాయిల్లాగే బ్లూ టాప్స్, తెల్లని మినీ స్కర్టులు, బూట్లు, మేజోళ్ళు, దర్వాన్ టోపీలు ధరించి చేతిలో ఉన్న బెత్తాల్ని ఊపుతూ వారు చేస్తున్న ఈ తరహా నృత్యవిన్యాసాలు ఫ్రాన్స్‌లో ఇప్పుడు చాలామందిని ఆకట్టుకుంటున్నాయి. 'కొత్తపుంతలు తొక్కడంలో ఫ్రాన్స్ ఎప్పుడూ ముందే ఉంటుంది' అనడం ఇందుకేనేమో!

"చఛ... అన్నయ్యగారు అబద్ధం చెప్పడ వేంటి?!" అంది వరలక్ష్మి చిన్నగా చెంపలేసుకుంటూ.

"వాడి వెర్రిబాగుల తనాన్ని బాగా కేష్ చేసుకుందా అమ్మాయి. ఆమెను మనం వదల కూడదు..." అన్నాడు నిరంజన్.

అలాగే అన్నట్టు తలాడించింది వరలక్ష్మి.

అనుకోవడమైతే అలా అనుకున్నారుగాని తీరా రంగంలోకి దిగేసరికల్లా తామేమీ చెయ్యలేమని అర్థమైపోయింది వాళ్ళక్కూడా.

ఆంజనేయుడి ముందా కుప్పిగంతులన్నట్టు ఆ మోసగత్తె మీద వీళ్ళ అరుపులూ పెడబొబ్బలూ ఏమీ పని చేయలేదు.

"అతను నాకు డబ్బివ్వడమేంటీ? అతనేదో కల్పించి చెబితే మీరు నా మీదకు రావడమేంటీ?" అంటూ ఆడపులిలా మీదకు దూకింది.

"మా అమ్మకే మొయ్యలేనన్ని నగలున్నాయ్. అలాంటిది పక్కింటామె నగ అడిగి తీస్కోవాల్సిన ఖర్మ తనకేం పట్టిందీ? మీ ఇంట్లో వుంచుకుని మేపుతున్నారు కాబట్టి అతగాడంటే మీకు ముద్దు కావచ్చు. అంతమాత్రాన్న అతనేదో కథల్లి చెప్తే మా కుటుంబ గౌరవం ఎలాంటిదో కూడా చూడకుండా, ఆడపిల్లనని కూడా ఎంచకుండా నా మీద దొంగతనం మోపుతారా?" అంటూ సింహగర్జన చేసింది.

"పదండి ఎవరి దగ్గరిక్కావాలంటే వాళ్ళ దగ్గరికి వెళ్దాం. ఎవరిది న్యాయమో పెద్దమనుషులే తేలుస్తారు?" అంటూ మదపుటేనుగులా ఘీంకరించింది.

"అసలీ దిక్కుమాలిన కోచింగ్ సెంటర్లో చేరడం నాదే బుద్ధి తక్కువ" అంటూ కాండ్రించి ఊసింది.

ఆమె చిందులూ విన్యాసాలూ చూస్తుంటే ఆమెకు బుద్ధి గరపాలనుకున్న వాళ్ళల్లా తామే భయానికిలోనై గుండెలు గుప్పెట్లో పెట్టుకోవాల్సి వచ్చింది నిరంజన్ దంపతులకి.

రజిత వాళ్ళనంత తేలిగ్గా వదిలిపెట్టలేదు.

"పొరపాటేనమ్మా మాది పొరపాటే" అని వాళ్ళిద్దర్నీ చెంపలేసుకునేట్టు చేసిన మీదట గాని ఆమె శాంతించలేదు.

ఆమెను నలుగుర్లోకి లాక్కెళదామనుకున్నారుగానీ నలుగురూ తమకే గడ్డిపెట్టే అవకాశం వుందనిపించి అంత సాహసానికి పూనుకోలేకపోయారా దంపతులు.

అవతల వ్యక్తికి నోరు లేకపోయుంటే అదో దారి... కానీ ఆమె తన నోటితో ప్రపంచాన్నే జయించేసేటట్టుగా వుందాయె!

ఆమెతోతలపడి గెలవడం కష్టమని తేలిపోయింది వాళ్ళిద్దరికీ.

నోరున్నవాడిదే రాజ్యమని ఊరికే అన్నారా?



అక్కడికి మనసాగక నిరంజన్‌తో అంది వరలక్ష్మి...

"పోనీ నన్ను వాళ్ళింటికెళ్ళి వాళ్ళమ్మతో మాట్లాడి రమ్మంటారా?" అని.

"ఏ ముఖం పెట్టుకుని వెళ్తావ్? వెళ్ళి ఏమని అడుగుతావ్? ఈ పిల్ల తంతే ఇలా వుంటే ఇంక ఆవిడ భాగోతమెలా వుంటుందో? చీపురుకట్ట తిరగేసినా ఆశ్చర్యం లేదు..." అంటూ ఆ ప్రతిపాదన్ని కొట్టిపారేశాడు నిరంజన్.

"అయినా నేననుకోవడం ఇదంతా ఆ పిల్ల తన సొంత తెలివితేటల్తో జరిపిన వ్యవహారమే అయ్యుంటుంది. ఇందులో పెద్దల ప్రమేయం వుండుండదు..."

"అయితే ఇంక ఆ డబ్బుమీద ఆశొదిలేసుకోవాల్సిందేనంటారా? మరి అన్నయ్యగారి పరిస్థితి?"

"ఏమో... ఏ గంగలో దూకుతాడో దూకనీ. చేసుకున్న వాడికి చేసుకున్నంత మహదేవా అన్నారు. అయినా బుద్ధి, జ్ఞానం వుండక్కర్లా?

అసలు వీడిలాంటి వెధవ పని చేస్తాడని తెలిసుంటే ఆ అకౌంటేదో మా బ్యాంక్‌లోనే మా బ్రాంచ్‌లోనే ఓపెన్ చేయించుండేవాడ్ని! అప్పుడైతే ఇలా జరిగుండేది కాదు... ప్చ్..." అన్నాడు నిరంజన్.

"సరే లెండి... అయిపోయినదానికి ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు? ఇపుడాయన గట్టెక్కే ఉపాయమేదయినా ఆలోచించండి..."

"ఏం ఆలోచించమంటావ్? ఓ అయిదారు వేలు తక్కువ పడితే ఎలాగోలా సర్దుదామనే అనుకున్నాను. కానీ వెధవ మొదటికే మోసం తెచ్చుకున్నాడాయె. గడువులోగా వాడి చేతిలో ముప్పై వేలుండాలీ అంటే మనం కనీసం ఇరవై వేలన్నా సర్దాల్సుంటుంది. ఎక్కడ్నుంచి తేగలం?"

"పోనీ మీ స్కూటరమ్మిన డబ్బుందిగా... అదీ రేపు మీకు రాబోయే లోనూ కలిపి అన్నయ్యగారికిచ్చేయండీ! తర్వాత సంగతి తర్వాత చూసుకోవచ్చు..." అంది వరలక్ష్మి జాలిగా.

"చూద్దాంలే" అనేశాడు నిరంజన్ అయిష్టత ధ్వనిస్తోన్న కంఠంతో. ఒక్షణం తర్వాత అతనే అన్నాడు మళ్ళీ.

"కానీ ఈ విషయం వాడితో చెప్పబాకు. ధీమా పడిపోతాడు. కొన్నాళ్ళ పాటైనా వాడీ క్షోభ అనుభవించాలి. వాడికి తన తప్పేంటో తెలిసిరావాలి."

"అలాగే" అంది వరలక్ష్మి.

ఈ మంతనాలయ్యాక దయాసాగర్ గదిలోకి వెళ్ళారు వాళ్ళిద్దరూ.

వీళ్ళు వెళ్ళేసరికి దయాసాగర్ మంచంమీద బోర్లగా పడుకుని వున్నాడు.

వీళ్ళొచ్చిన అలికిడికి లేచి కూర్చున్నాడు.

"రజిత గట్టిగా డబాయించేస్తోంది. పైగా ఎదురు తిరిగి మిమ్మల్నే నిందిస్తోంది. ఏమో అనుకున్నాంగాని చాలా కరోడా మనిషి. ఆమెను నయాన్నగానీ భయాన్నగానీలొంగదీయడం అసాధ్యం. నీ డబ్బు ఇంక దిబ్బలో పోసినట్టే అనుకో. మరిపుడేం చెయ్యాలనుకుంటున్నావ్?" అంటూ ప్రారంభించాడు నిరంజన్ సంభాషణ.

"నేనుత్త పనికిమాలిన సన్నాసినని మా నాన్నముందుకెళ్ళి తలదించుకోవడంతప్ప వేరే మార్గంలేదు" అన్నాడు దయాసాగర్ నిరాశగా.

"అయితే నువ్వందుకు సిద్ధంగా వున్నట్టేనా?"

"అంతకన్నా ఏం చెయ్యాలి మరి? ఏం చెయ్యగల్ను?"

అంతలో ఆరు నెలలు సావాసం చేస్తే వారు వీరవుతారన్న సామెతను నిజం చేస్తూ అంది వరలక్ష్మి. ఆ సమయంలో ఆమెకు దయాసాగర్ బీదముఖాన్ని చూస్తుంటే అంతకు ముందు భర్త తనతో అన్న మాటలు గుర్తుకురాలేదు.

"కావాలంటే నా మెళ్ళో ఈ నెక్లెసుందన్నయ్యగారూ! మీ అవసరం తీర్తుందీ అనుకుంటే అమ్మేసుకోండి. తర్వాత మీ వీలునుబట్టి మళ్ళీ నాకు చేయించి ఇద్దురుగాని..."

నిరంజన్ క్రీగంట కోపంగా చూశాడు భార్యకేసి - 'నేను చెప్పిందేంటీ? నువ్ చేస్తున్నదేంటి?' అన్నట్టు.

తప్పేనన్నట్టు చిన్నగా నాలుక్కరుచుకొని తల దించుకొంది వరలక్ష్మి.

అయితే దయాసాగర్ ఇదేం పట్టించుకోలేదు.

"వొద్దులే చెల్లెమ్మా! నా స్వార్జితంకాని సొమ్ముతో మా నాన్నదగ్గరికెళ్ళే ఉద్దేశమే వుంటే ఏదో ఒకటి చెయ్యరా అని మీ ఆయన్నే అడిగుండేవాణ్ణిగా? మిమ్మల్నీ ఇబ్బంది పెట్టి, అటు మా నాన్ననీ వంచించి నేను బావుకునేదేముందీ? నేనొక అప్రయోజకుణ్ణని నాకిపుడు స్పష్టంగా తెలిసిపోయింది. నా ఓటమిని అంగీకరించడానికి నేను సిద్ధంగా వున్నాను" అన్నాడు నిర్లిప్తంగా.

'అయితే నువ్వీరూట్లో వున్నావన్నమాట?!' అనుకున్నాడు నిరంజన్ మనసులో.

"మరిక లలిత సంగతి?"

"చెల్లెమ్మేదో రాయబారం నడుపుతానంటోందిగా... చూద్దాం. ఇంకెంత? ఇంకో అయిదారు రోజులు. అదీ బెడిసికొడితే ఆ ఆశా వదిలేసుకోవడమే..."

"ఆ తర్వాత?"

"ఏమో!" అంటూ శుష్కహాసం చేశాడు

దయాసాగర్.

★ ★ ★

ఓ ఆరురోజుల అనంతరం...

లలిత ఊర్నుండి తిరిగొచ్చింది.

ఆ విషయం తెలిసిన వెంటనే వరలక్ష్మి, వాళ్ళ ఇంటికి వెళ్ళి లలితను తమ ఇంటికి తీసుకువచ్చింది - "నీతో మాట్లాడాలి. పనుంది, రా" అంటూ.

లలితను కూర్చోబెట్టి కాఫీ గ్లాసు ఇచ్చి, ఆ తర్వాత నెమ్మదిగా ప్రారంభించింది వరలక్ష్మి.

"దయాసాగర్‌మీద నీ అభిప్రాయమేంటి?"

"అతనా? అతనొక క్రాక్‌మాస్టర్ జనరల్!" చెప్పింది లలిత ఏవగింపుగా ముఖంపెట్టి.

"మొన్నటిదాకా నువ్వతన్ని ప్రేమించావని నాకు తెలుసు. అలాంటిది ఇంతలో ఎందుకిలా మారిపోయావు?"

లలిత ముఖం కందగడ్డలా అయ్యింది.

"నీకెవరు చెప్పారొదినా అతన్ని నేను ప్రేమించానని?" అంది కోపంగా.

"అతనే చెప్పాడు. అదీగాక నేనూ గమనించాను"

"మరి ఆ సంగతి చెప్పినవాడు మిగతాది చెప్పలేదా?" రవంత హేళనగా అంది లలిత. "ఒకసారి ఛీ కొట్టేక్కూడా ఇంకా బుద్ధిరాలేదన్న మాట!"

వరలక్ష్మి లలిత భుజంమీద సున్నితంగా చెయ్యివేస్తూ అంది.

"అతను మానుండి ఏమీ దాచిపెట్టలేదు లలితా! పూసగుచ్చినట్టు అంతా వివరంగా చెప్పాడు. జరిగిందేమిటో నీకూ తెలుసు. ఏదో అమాయకత్వంకొద్దీ అలా చేశాడు. కానీ దానికిపుడు అతనెంతో పశ్చాత్తాపం చెందుతున్నాడు... ప్లీజ్ లలితా! అతని తరపున నిన్ను వేడుకుంటున్నాను. అతన్ని క్షమించు"

"క్షమించి?"

"అతను నిన్నిపుడు మనసారా కోరుకుంటున్నాడు. అతనో అర్భకుడు. దయచేసి అతని హృదయాన్ని ముక్కలు చెయ్యొద్దు..." అంది అర్థింపుగా వరలక్ష్మి.

"అతను నా హృదయాన్ని ముక్కలు చేసినపుడో?" ఎదురుప్రశ్న వేసింది లలిత.

"ప్లీజ్... అలా నిర్దయగా మాట్లాడబాకు. దయాసాగర్ అని పేరెట్టినందుకు అన్ని విషయాల్లోనూ మితిమీరిన దయతో ప్రవర్తించి తనకుతానే చెరుపు చేసుకున్నాడతను. అలాంటివాడు ఇపుడు నీ దయకోసం వెంపర్లాడిపోతున్నాడు. అతను పసిపిల్లాడిలాంటివాడు. ఈ ఒక్కసారికీ అతని తప్పుని మన్నించి..."

"మన్నించి?" వెటకారంగా నవ్వింది లలిత. "తగుదునమ్మా అంటూ మళ్ళీ అతనితో ప్రేమాట ఆడమంటావ్!? భలేదానివే వదినా! నా జీవితంతో నన్నే ఆడుకోమని సలహా ఇస్తున్నావా?"

"అది కాదు లలితా..."

"ఏది కాదు? అతని దృష్టిలో ప్రేమంటే ఒక ఆట! లేకపోతే మూడో వ్యక్తికోసం ప్రేమని ఫుట్‌బాల్‌ని తన్నినట్టు తన్ని అంత త్యాగం చేస్తాడా? అలాంటివాడ్ని నమ్మి మెడలో తాళి కట్టించుకుంటే రేప్పొద్దున్న ఎవరైనా నన్నే దానంగా అడిగితే ఇచ్చెయ్యడని నమ్మకమేంటి?"

"లేదు లలితా! అతనిపుడు మారాడు. ముఖ్యంగా రజిత కొట్టిన దెబ్బతో..."

"రజిత కొట్టిన దెబ్బేంటీ? కొంపదీసి దాన్తో కూడా ఏదన్నా ప్రేమాట ఆడబోయి చెంపపగలగొట్టించుకున్నాడా?" ఆసక్తిగా చూసింది లలిత.

"ఛఛ... మరీ అంత హీనంగా మాట్లాడబాకు లలితా!" నొచ్చుకోలుగా అంది వరలక్ష్మి. "అమాయకుడ్ని చేసి అతన్ని రజిత చాలా ఘోరంగా మోసగించింది"

"రజిత అతన్ని మోసగించిందా? ఎలా?" కళ్ళు విప్పారుస్తూ చూసింది లలిత.

చెప్పింది వరలక్ష్మి విషయం క్లుప్తంగా.

"నేన్నమ్మను... రజిత అలాంటిది కాదు" అంది లలిత ఆవేశంగా.

"అయితే దయాసాగరే అబద్ధమాడుతున్నాడంటావా?"

"ముమ్మాటికీ! ఆ డబ్బుతనెక్కడో పోగొట్టుకుని మీరడిగేసరికి ఏం చెప్పాలో తోచక అలా కథల్లుంటాడు. దీన్నిబట్టి అతను అమాయకు

దే కాకుండా ఉత్త మాయగాడని కూడా అర్థమవుతోంది...'' ఈసడింపుగా అంది లలిత.

''లలితా?'' ఆశ్చర్యంగా చూసింది వరలక్ష్మి. ''అతన్ని గురించి అంతా తెలిసుండి కూడా నువ్విలా...'' మాట పూర్తిచెయ్యలేకపోయింది.

''అతను కేవలం నాలుగైదు నెలల్నుండి మాత్రమే తెలుసు. కానీ రజిత నాకు కొన్ని సంవత్సరాలనుండి పరిచయం. అదెన్నటికీ అలాంటి మోసం చెయ్యదు. చూడొదినా, మీ ఇంట్లో వుంటున్నాడన్న అభిమానంకొద్దీ నువ్వేదో రాయబారానికి వస్తే వచ్చుండొచ్చు. మామూలుగా అయితే నీ మాట వినుండేదాన్నేమో! కానీ రజితమీద అతనంత ఘోరమైన అభాండం వేశాడని తెలిశాక నాకిప్పుడతని మీద మరింత అసహ్యం కలుగుతోంది. ఇదివరక్కూడా తానో అమ్మాయితో తప్పుచేశానంటూ మా క్లాసులోవున్న అందరమ్మాయిలమీదా నాకు అనుమానం కలిగేలా చేశాడు. దీన్నిబట్టి అతనెంత సునాయాసంగా అబద్ధాలాడగలడో తెలుస్తూనే వుందికదా! ఛీ! ఇంకెప్పుడూ అతని పేరు కూడా నాముందు ప్రస్తావించబాకు. దయచేసి నన్నర్థంచేసుకో'' అంటూ దిగ్గున లేచి నిలబడింది లలిత.

''ఇదే నీ తుది నిర్ణయమా?''

''అ...వు...ను...'' కటువుగా అనేసి విసురుగా వెళ్ళిపోయింది లలిత.

వరలక్ష్మి ఆమెను వారించే ప్రయత్నం చెయ్యలేదు.

తనలో తానే ఓ నిట్టూర్పు విడిచి వూరుకుంది.

★ ★ ★

'ఈ ప్రపంచంలో మంచితనానికి విలువే లేదు' అనుకున్నాడు దయాసాగర్.

'కాదు కాదు. అతిమంచితనానికి విలువ లేదు' అని అంతలోనే తన ఆలోచన్ని సరిదిద్దుకున్నాడు.

రజిత తనని మోసగించిందని లలిత నమ్మకపోగా... తనే ఉత్తపుణ్యానికి ఆమెమీద ఆ అభాండం వేసినట్టుగా ఎంచి తనని దుర్భాషలాడిందని తెలుసుకున్నమీదట అతనికలా అనిపించింది.

అంతక్రితమే వరలక్ష్మి వచ్చి చెప్పి వెళ్ళింది అతనితో - తన రాయబారం ఫలించలేదనీ, పైగా వికటించిందనీ.

ఆమె క్లుప్తంగా చెప్పబోతే అతనే రొక్కించి రొక్కించి మరీ పూర్తి వివరాలు అడిగి తెలుసుకున్నాడు.

దాంతో తప్పనిసరై తమమధ్య జరిగిన సంభాషణ యావత్తూ తు, చ తప్పకుండా చెప్పేసిందామె.

''నన్ను క్షమించండన్నయ్యగారూ! నా ప్రయత్నం ఫలించలేదు'' అంది ఆఖర్లో.

''నా రాత ఇలా తగలడితే నువ్వుమాత్రం ఏం చెయ్యగలవు చెల్లెమ్మా...'' అనేశాడు దయాసాగర్.

ఆమె వెళ్ళిపోయాక గదిలో ఒంటరిగా పడుకున్న దయాసాగర్ మనసులో ఎన్నెన్నో ఆలోచనలు.

ఏమిటిది?

ఎందుకిలా జరిగింది?

దీనంతటికీ కారణం ఏమిటి?

అందరూ అంటున్నట్టు తన అతి మంచితనమేనా తననిలా దిగజారుస్తే?

తనకి ఊహ తెలిసినప్పటినుంచి తన నడవడికనంతట్నీ ఒకసారి విశ్లేషించి చూసుకున్నాడు.

ముఖ్యంగా తండ్రితో విబేధించి ఇంట్లోంచి బైటికొచ్చింది లగాయతు ఇప్పటివరకూ జరిగిన సంఘటనలన్నిట్నీ ఒకటికి రెండుసార్లు విశ్లేషించి చూసుకున్నాడు.

తన స్థానంలో వేరెవరయినా వుంటే తనలాగే ప్రవర్తిస్తారా? అని తనకుతానే ప్రశ్న వేసుకున్నాడు.

'ఎవ్వరూ ప్రవర్తించరు' అనే జవాబు రావడానికి అతనికెంతోసేపు పట్టలేదు.

కారణం... అతనిపుడు తనతప్పు తెలుసుకున్న మనిషిగా సవ్యమైన ధోరణిలో ఆలోచించగలుగుతున్నాడు.

కానీ ఏంలాభం? అదేదో మరికాస్త ముందుగా జరిగుంటే తన జీవితం ఇంకోలా వుండేది.

తండ్రిముందు తను దేభ్యంలా తల దించుకోవాల్సి వస్తుందే అన్నది అతన్నిప్పు

డంతగా బాధించడంలేదు. మానసికంగా అతనందుకు సంసిద్ధుడైపోయే వున్నాడు. మహా అయితే తన చేతగానితనాన్ని గుర్తుచేస్తూ తండ్రి మరో నాలుగు మాటలంటాడు. అయినా కడుపుతీపికొద్దీమళ్ళీ ఎప్పటిలా ఆదరించకపోడుకదా?

అయినా తనే బెట్టుచేశాడుతప్ప అసలు అమ్మానాన్నలు ఏనాడో దిగివచ్చారుకదా! ఇంటికొచ్చేయమని ఎన్నిసార్లు ప్రాధేయపడినా పేద్ద పోటుగాడిలా తానే తిరస్కరించాడు!

సో... అదేమీ పెద్ద సమస్య కాదు. ఇకనుండైనా సవ్యంగా.... అందరిలా... బతకడం అలవాటు చేసుకుంటే అన్నీ అవే సర్దుకుంటాయి.

ఎటొచ్చీ తను తిరిగి పొందలేనిదల్లా లలిత ప్రేమ ఒక్కటే!

లలిత తన దీనావస్థని అర్థంచేసుకుని, తనని మన్నించి, తిరిగి ఎప్పటిలా తనని ప్రేమించగలిగితే ఎంత బాగుణ్ణు?!

ఇంత జరిగాక కూడా ఇంకా అలా అన్పించడం అత్యాశే అని తెలిసినా అలా అనుకోకుండా వుండలేకపోయాడు.

కానీ అంతలోనే నిలువునా నిరాశ ఆవహించేసింది.

'ప్చ్... అది జరిగే పని కాదు...' అనుకున్నాడు బాధగా.

అదేరోజు రాత్రి నిరంజన్ దంపతులిద్దర్నీ కూర్చోబెట్టి వారికి తన నిర్ణయాన్ని తెలియజేశాడు దయాసాగర్.

ఆ పగలంతా చాలా బాగా ఆలోచించి తీసుకున్న నిర్ణయమది! అన్ని కోణాల్లోంచీ ఆలోచించి అంతకన్నా గత్యంతరం లేక తీసుకున్న నిర్ణయం.

"నేను ఈ కోచింగ్ సెంటర్ మూసేసి బుద్ధిగా మా ఇంటికి వెళ్ళిపోవాలనుకుంటున్నాను"

కొద్దిక్షణాలపాటు నోటివెంబడి మాట రాలేదు ఆ దంపతుల్లో ఏ ఒక్కరికీ.

"మీ ఇంటికి వెళ్ళిపోవడంవరకూ బాగానే వుంది. కానీ కోచింగ్ సెంటర్ మూసెయ్యడం దేనికీ, లక్షణంగా నడుస్తుంటేనూ?" అన్నాడు భార్యకన్నా ఒకింత ముందుగా తేరుకున్న నిరంజన్.

"నడుస్తోందిలే. కానీ నాకు నడపాలని లేదు..."

"ఏం - ఎందుకని?"

"నేనిక్కడే వుంటే పక్కిల్లే కాబట్టి ప్రతిరోజూ లలిత నాకంట పడుతూనే వుంటుంది. ఆమెను చూస్తున్నకొద్దీ నా బుద్ధిమాలినతనం నన్ను వెక్కిరిస్తూనే వుంటుంది. నేనది సహించలేను. ఇక్కడ ఈ కోచింగ్ సెంటర్ని రన్ చేస్తున్నంత కాలం నేనామెను మర్చిపోగలగడం అసాధ్యం..." బొంగురుపోయిన కంఠంతో చెప్పాడు దయాసాగర్.

"మొత్తానికి నాకు జ్ఞానోదయమో ఏదో అంటారే, అలాంటిది కలిగినమాట వాస్తవం. బుద్ధిగా మా నాన్నదగ్గరికెళ్ళిపోయి ఇకనుండైనా అందర్లా కాస్త వివేకంతో బతకడానికి ప్రయత్నిస్తాను. ఇన్నాళ్ళూ నన్నో సొంత మనిషిలా ఎంతో ఆప్యాయంగా చూసిన మీ ఇద్దరికీ నా కృతజ్ఞతలు..."

వరలక్ష్మికీ, నిరంజన్కీ ఎంతో బాధగా అనిపించింది దయాసాగర్ అలా అంటుంటే.

వరలక్ష్మికైతే వున్నపళంగా లేచి వెళ్ళి లలితని పీక పిసికేసి రావాలనిపించింది.

"అదేవిట్రా... ఆ అమ్మాయికోసం లక్షణంగా సాగుతున్న నీ బతుకుతెరువుని పాడుచేసుకుంటావా? మీ నాన్నగారి వ్యాపారంమీద మొదట్నుండీ నీకు సదభిప్రాయం లేదుకదా! ఆ వ్యాపారంలో నువ్విమడలేవేమో?! తొందరపడకు. మరొక్కసారి ఆలోచించు..." అన్నాడు నిరంజన్. మిత్రుడు మరోసారి పొరపాటు చేయబోతున్నాడేమోననిపించింది అతనికి.

"లేదురా! ఈ కోచింగ్ సెంటరూ, గట్రా కొనసాగినంతకాలం లలిత జ్ఞాపకాల్లు నన్ను బాధిస్తూనే వుంటాయ్! ఇక్కడే వుండి మానసికంగా కృంగిపోయేకన్నా దూరంగా వెళ్ళి ఓ కొత్తజీవితం ప్రారంభించడమే మేలనిపిస్తోంది. దయచేసి నన్నాపకు. లెట్మీ ప్రొసీడ్ ఇన్ మై ఓన్ వే..." అన్నాడు దయాసాగర్ కంఠం పూడుకుపోతుండగా.

ఆ ఇంటిని వదిలి వెళ్ళిపోవాలీ అంటే అతనికీ బాధగానే వుంది. కానీ తప్పదు.

నిరంజన్ అంతవరకూ ఎలాగోలా దృఢంగా వుండగలిగాడు గాని ఇహ నిభాయించుకోలేక పోయాడు.

“ఇంతా చేసి నువ్ ఓటమితో వెళ్ళిపోవడం నేను సహించలేకపోతున్నాన్రా. నీక్కావలసిన ముప్పైవేలూ నా తల తాకట్టుపెట్టైనా సర్దుబాటు చేస్తాను. పోనీ ఒక్క నాలుగురోజులాగి అదైనా పట్టుకెళ్ళు...” అన్నాడు గాద్గదికంగా.

“అవునన్నయ్యగారూ! పోనీ మమ్మల్నీ సహాయమైనా చెయ్యనివ్వండి” అంది వరలక్ష్మి భర్తకు వత్తాసుపలుకుతూ.

నిరంజన్ నవ్వాడు.

“నా గాలి మీ ఇద్దరికీ సోకిందా ఏమిట్రా? ఎందుకు మీరు నా గురించి ఇంత తాపత్రయ పడుతున్నారు. ఇలాంటి సందర్భాలలో మనకెందుకులే ఈ లంపటం అనుకోవాల్రా... అంతేగాని ఇంత దయ చూపించకూడదు. దయాదాక్షిణ్యాలకు లిమిట్ లేకపోతే ఏమవుతుందో ప్రత్యక్ష ఉదాహరణ నేనొకడ్నీ కనిపించడం లేదా మీ కళ్ళకి?” అన్నాడు తల దించుకుంటూ.

తిరిగి తనే అందుకున్నాడు - “మీరిస్తే తీసుకోకూడదని కాదుగానీ - మా నాన్నని మోసం చేయటం నాకిష్టంలేదురా! మా నాన్న నన్ను ముప్పైవేలు సంపాదించి చూపెట్టమన్నాడుగాని - అప్పుచేసి చూపించమనలేదు. కాబట్టి ఆ విషయం ఇంకొదిలేయండి. రేపు స్టూడెంట్స్ అందరికీ చెప్పేస్తాను సెంటర్ మూసేస్తున్నట్టు. వీలయితే ఎల్లుండే...” పూర్తి చేయలేకపోయాడు ఆఖరి వాక్యాన్ని.

“అయితే మీరింక మమ్మల్ని మర్చిపోతారన్నమాట!” భారంగా అంది వరలక్ష్మి.

“మిమ్మల్నెలా మర్చిపోతానమ్మా! వీలైనప్పుడల్లా వచ్చి చూసిపోతూనే వుంటాను. ఏదీ... నువ్వే ఆలస్యం చేస్తున్నావ్... నువ్ నాకో అల్లుణ్ణి కనివ్వాలేగానీ వాడితో ఆడుకోవడానికి పొద్దస్తమానూ ఇక్కడే వుండిపోనూ?” అన్నాడు దయాసాగర్ వాతావరణాన్ని తేలికచేయడానికి ప్రయత్నిస్తూ.

ఆ మాటలకి శ్రోతలిద్దరూ నవ్వే ప్రయత్నంలాంటిది చేసేరేతప్ప నిజంగా నవ్వలేకపోయారు.

ఆ రాత్రి ఆ ముగ్గురికీ భారంగానే తెల్లవారింది.



సూర్యం మోసుకొచ్చిన వార్త విని నివ్వెరపోయింది లలిత.

మాష్టారు కోచింగ్ సెంటర్ మూసేస్తున్నారనీ, తామందర్నీ వేరేచోట ఎక్కడైనా జాయినవ్వమని చెప్పారనీ చెప్పాడు వాడు.

“ఎందుకట? ఏదైనా ఉద్యోగం దొరికిందటనా?” అంది లలిత.

“ఏమో! మేమెంత బ్రతిమాలినా కారణం చెప్పలేదు” అనేసి వెళ్ళిపోయాడు సూర్యం.

ప్రేమ వ్యవహారంలో అవకతవకలు మూలంగా లలితా, డబ్బు వ్యవహారంలో అవకతవకల మూలంగా రజితా కోచింగ్ సెంటర్‌కి వెళ్ళడం మానేసి చాలారోజులే అయింది.

లలిత గబగబా పెరటిగోడ దగ్గరికెళ్ళి “వదినా” అంటూ కేకేసింది వరలక్ష్మిని.

వంటింట్లో వున్న వరలక్ష్మి ఆ కేకనాలకించి ఓ రెండు నిముషాల తర్వాత వచ్చిందక్కడికి.

లలితని చూస్తుంటే ఆమెకు భలే కోపంగా అనిపించింది. కానీ ఎలాగో నిగ్రహించుకుంది.

“మీ దయాసాగర్ కోచింగ్ సెంటర్ని మూసేస్తున్నాట్టగా?” అదోలా నవ్వుతూ అడిగింది లలిత.

ఆ నవ్వుని చూస్తుంటే మరీ మంటగా అనిపించింది వరలక్ష్మికి.

“ఆఁ అంతా నీచలవే!” అనగూడదనుకుంటూనే అనేసింది.

"నా చలవా... అదేంటొదినా? నేనేమన్నా మూసెయ్యమన్నానా అతన్ని?"

"లేదులే... అతనే మతిచెడగొట్టుకుని వెళ్ళి పోతున్నాడు"

"అరెరెరె... మతి చెడిపోయిందా పాపం?"

లలిత అలా అంటుంటే ఈడ్చిపెట్టి ఒక్కటి వ్వాలనిపించింది వరలక్ష్మికి.

"మనసులేని మనిషిని ప్రేమించిన పాపానికి మతి చెడక ఏమవుతుంది?" అంది పళ్ళబిగువున కోపాన్ని అణచుకుంటూ.

"మరైతే మనసున్న మనిషినే ప్రేమించుండాల్సింది పాపం! కోచింగ్ సెంటర్ ఎత్తేసి ఆ తర్వాత ఏం చేస్తాట్ట? ఇంట్లో ఏదో పందెం వేసి వచ్చినట్టున్నాడుగా అదేవయ్యింది పాపం"

లలిత కళ్ళు కొంటెగా మెరుస్తూండటం చూసి చిర్రెత్తుకొచ్చింది వరలక్ష్మికి.

"అతని ఏడుపేదో అతనేడుస్తాడు. మెళ్ళో రాయికట్టుకుని బావిలో దూకుతాడు. ఈ ఆరాలన్నీ నీకెందుకూ?" అంది ఎర్రగా చూస్తూ.

"నాగ్గాకపోతే ఇంకెవరిక్కావాలొదినా?" వరలక్ష్మి కోపాన్ని పట్టించుకోకుండా ముసిముసిగా నవ్వుతూ పూర్తిచేసింది లలిత.

"ఎంతయినా ఆయన నా కాబోయే శ్రీవారు కదా? ఆయన బాగోగులు పట్టించుకోవాల్సిన అవసరం నాగ్గాకపోతే ఇంకెవరికుంటుంది?"

"లలితా!" అంది వరలక్ష్మి విస్మయంగా. "నువ్వు... నువ్వేమంటున్నావ్?" తన చెవులే తనని మోసగిస్తున్నాయేమోననిపించిందామెకు.

"నీకు కొత్తగా ఈ చెవుడెప్పట్నించి వచ్చిందొదినా? నేనేవన్నాను... ఉన్నమాటే అన్నాను. మీ దయాసాగర్ నా కాబోయే శ్రీవారన్నాను. ఏం - తప్పా?" అంటూ ఫక్కున నవ్వింది లలిత.

వరలక్ష్మిలోని విస్మయం ద్విగుణీకృతమయ్యింది.

"అంటే... అంటే?" అంది ఇంకా నమ్మలేకపోతూ. "అయితే నీకు అతనిమీద కోపం పోయిందా?"

"కోపం పోవడానికి అసలు రావడమంటూ జరిగితేకదా!"

వరలక్ష్మిలోని విస్మయం త్రిగుణీకృతమైంది.

"నువ్వేం మాట్లాడుతున్నావో నాకర్థం కావట్లేదు లలితా. నిన్నగాక మొన్నటిదాకా అతనంటేనే మండిపడ్డదానివి... అసలు కోపమే లేదంటావేంటి"

"లేదూ లేదూ లేదు. మీ దయాసాగర్‌లో నాకు నచ్చని గుణమల్లా 'సాగరమంత దయ' ఒక్కటే! ఆ సాగరాన్ని ఓ చెరువుగానో మడుగ్గానో మార్చి - అతన్లో ప్రాక్టికల్ అవుట్‌లుక్ ఏర్పడేలా చెయ్యాలన్న సత్సంకల్పంతో ఇన్నాళ్ళూ నేనో నాటకం ఆడాను. మా ప్రశాంత్ మావయ్యనీ, రజితనీ కూడా అందులో పాత్రధారుల్ని చేశాను..." అంటూ విరగబడి నవ్వింది లలిత.

విషయం అర్థమయ్యీ అవ్వనట్టుగా అర్థమయ్యింది వరలక్ష్మికి.

వీడీ వీడని అయోమయావస్థ.

"ఏంటి లలితా నువ్వంటోంది?"

"అవునొదినా! జరిగిందంతా నిజంగా నాటకమే! మా ప్రశాంత్ మావయ్యతో దయాసాగర్‌ని అలా అడిగించింది నేనే. మంచితనానికి హద్దు లేకుంటే ఏం జరుగుతుందో అతనికి తెలిసిరావాలనే చాలా ప్లాన్డ్‌గా ఇదంతా నడిపించాను. రజితతో దయాసాగర్‌వద్ద డబ్బడిగించింది కూడా నేనే! అంతేతప్ప రజిత మీరనుకుంటున్నట్టు మోసగత్తేం కాదు. నిజానికి ఆ డబ్బంతా నాదగ్గిరే సురక్షితంగా వుంది. తన అతి మంచితనంవల్ల ఇలా ఊహాతీతమైన చిక్కుల్లో పడితేనేతప్ప అతనికి తెలిసిరాదని అతన్నింత క్షోభకి గురిచేశాను. పాపం! ఏవంటున్నాడిపుడు మీ దయాసాగర్? నేనాసించిన మార్పు అతన్లో వచ్చుంటే నా ప్రయత్నం వృథాకాలేదనుకుంటాను. లేకపోయినా... లేకపోయినాసరే నేను అతన్ని పెళ్ళిచేసుకుంటాను" అంతా చెప్పిందానికి ఆఖర్లో బిడియం ముంచుకొచ్చిందిగావాల్ను ముఖాన్ని రెండు చేతుల్లో దాచుకొంది లలిత.

వరలక్ష్మి ముఖంనిండా సంతోషం అలుముకుపోయింది. అయినా ఆమె ఇంకా ఆ విభ్రాంతినుండి తేరుకోలేకపోతూనే వుంది.

"అమ్మదొంగా!" అంది చివరికెలాగో.

"ఇంతకీ మీ సోదరుడుగారు మారినట్టేనా వదినా?" బిడియాన్ని జయిస్తూ అడిగింది లలిత.

"మారడేంటి లలితా! ఇప్పుడీ విషయం గనుక తెలిస్తే నీముందు గుంజీళ్ళు తీసి లెంపలేసుకోమన్నా వేసుకుంటాడు. ఉండు నన్ను వెళ్ళనీ... అతనికీ శుభవార్త చెబితే ఎంత సంబరపడిపోతాడో పాపం పిచ్చిమాలోకం" అంది వరలక్ష్మి ఒకపక్కన తానే సంబరపడిపోతూ.

"అదే నా బాధొదినా! అతను ఇకనుండైనా తననింకెవరూ 'పిచ్చిమాలోకం' అనకుండా వుండేలా బతకడం నేర్చుకుంటే చాలు. నా ప్రయత్నం ఫలించినట్టే!"

"నేనిస్తానా గ్యారంటీ" అంది వరలక్ష్మి ఉత్సాహంగా.

"సరే... ఇపుడు నువ్ ఇంట్లోకి వెళ్ళి ఏం చేస్తావు? అతనితో ఇదంతా చెప్పేస్తావా?"

"చెప్పొద్దా మరి?"

"ఊహుఁ..." అంటూ అడ్డంగా తలాడించి 'కాస్త ఇలా దగ్గరికి రా' అన్నట్టు సైగచేసి వరలక్ష్మి చెవి కొరికింది లలిత.

"పాపం ఇంకా అతన్నేడిపించాలనే ఉందా నీకు?" అంది వరలక్ష్మి జాలిగా.

"మరేం ఫర్వాలేదులే..." అంటూ కిసుక్కున నవ్వింది లలిత.

ఆ నవ్వులోని నవరత్నాలనేరుకునే అదృష్టం ఇకనుండి దయాసాగర్‌దేకదా? అనుకుంటుంటే వరలక్ష్మికి ఎంతో రిలీఫ్‌గా అనిపించింది.

నిజంగా ఎంత విచిత్రం?

వున్నట్టుండి కథ ఎలా మారిపోయిందీ? అని కూడా అనిపించిందామెకు.

అంతలో పొయ్యిమీద పప్పు మాడిపోతున్న వాసన ఆమె ముక్కుపుటాలకు సోకింది.

★ ★ ★

మర్నాడుదయం...

దయాసాగర్ తన పెట్టే బేడా సర్దేసి గదిలో ఓ మూలన పెట్టి కిందికి దిగొచ్చాడు నిరంజన్ దంపతుల దగ్గరికి.

"ఏంట్రా ఇంత పొద్దున్నే తయారయ్యావ్? ఎక్కడికీ?" అన్నాడు నిరంజన్.

"నేన్నాసామాన్లన్నీ సర్దేసుకున్నాన్రా... కోచింగ్ సెంటర్ మూసేస్తున్నట్టు నిన్ననే మా స్టూడెంట్స్ అందరికీ చెప్పేశాను. మీరనుమతిస్తే ఇంక మా ఇంటికి వెళ్ళిపోవాలనుకుంటున్నాను..." అంటూ ఆ దంపతులిద్దరివైపూ చెమ్మగిల్లిన కళ్ళతో చూశాడు దయాసాగర్.

"సారీరా!" అన్నాడు నిరంజన్.

"ఫర్వాలేదులేరా! మీరేం బాధపడకండి. నేను చేసుకున్నదానికి నాకిలా కావాల్సిందే..." అంటూ తల దించుకున్నాడు దయాసాగర్.

"అదికాదురా! నీకో బాడ్‌న్యూస్..."

నిరంజన్‌వైపు కంగారుగా చూశాడు దయాసాగర్.

"ఏంట్రా అది?"

"నీకు చెప్పకుండా నేనో తెలివితక్కువ పని చేశాను. నిన్న సాయంత్రం మీ ఇంటికి వెళ్ళాను. జరిగిందంతా మీ నాన్నతో చెప్పాను. అంటే నీ లో అఫైర్ గురించి కాదులే. నువ్ సంపాదించిన డబ్బు ఎలా పోగొట్టుకున్నావో అదంతా వివరంగా చెప్పాను. నువ్ ఒకట్రెండ్రోజుల్లో ఇంటికొచ్చేయబోతున్నావనీ, నిన్నేమీ అనవద్దనీ మీ నాన్నని రిక్వెస్ట్ చేశాను. ముందుగా చెప్పుంచితే నువ్వెళ్ళాక గొడవ జరక్కుండా వుంటుందికదాన్న ఉద్దేశంతో నేనా పని చేస్తే మొదటికే మోసం వచ్చింది. మీ నాన్న నువ్వే నన్ను మధ్యవర్తిగా పంపేవేమోననుకుని నామీద కూడా మండిపడ్డాడు. 'ఇంత జరిగాక కూడా ఇంకా ఏముఖం పెట్టుకుని తిరిగొస్తాట్ట? రావొద్దన్నానని చెప్పు... వాడి అఘోరింపేదో వాణ్ణే అఘోరించమను...' అంటూ ఇంతెత్తున లేచాడు. చెప్పకూడదుగానీ, ఏ తండ్రీ తన కొడుకుని అనలేని మాటన్నాడ్రా మీ నాన్న. కాబట్టి నువ్వింటికెళ్తే అక్కడెదురయ్యే పరిస్థితికి నువ్వు తట్టుకోలేవు. అందుచేత..." అంటూ అసంపూర్తిగా ఆపేశాడు నిరంజన్.

"నిజంగానా?" అన్నాడు దయాసాగర్ హతాశుడౌతూ.

"అవున్రా మంచికిపోతే చెడెదురయినట్టుగా అయ్యింది. అయామ్ సో సారీ..."

"మరిపుడెలాగండీ? మరీ విషయం రాత్రే ఎందుకు చెప్పలేదు. కనీసం నాతోనైనా అన్లేదే?" అంది వరలక్ష్మి ఆందోళనన్ని వ్యక్తంచేస్తూ.

"అవున్రా... మరిపుడు నా పరిస్థితేంటీ?" అంటూ రెండుచేతుల్తో తల పట్టుకుని శక్తంతా ఉడిగిపోయినవాడిలా సోఫాలో కూలబడిపోయాడు దయాసాగర్.

"నా నెత్తిమీద శనిదేవుడు బ్రేక్‌డాన్స్ చేస్తున్నాడ్రా..." అన్నాడు వెర్రిచూపు చూస్తూ.

"అంతేతప్ప ఇది నీ స్వయంకృతాపరాథం కాదంటావ్?"

"కాదని ఎలా అంటాన్లేరా! చచ్చిన పాము నింకా చంపబాకు. నా పరిస్థితి అగమ్యగోచరమై ఏడుస్తున్నాను. దయతో నాకేదైనా దారి చూపించు..." దీనంగా చూశాడు దయాసాగర్.

"నీ దారి మూసుకుపోలేదు. ఇంకాసేపట్లో నీ స్టూడెంట్స్ అంతా ఎప్పట్లా వచ్చేస్తారు. నువ్వెళ్ళి క్లాసులో కూర్చో..."

నిరంజన్ అలా అంటుంటే ఆశ్చర్యంగా చూశాడు దయాసాగర్.

"ఎలా వస్తారురా? కోచింగ్ సెంటర్ మూసేస్తున్నాననీ, ఇవ్వాల్టినుంచి రావద్దనీ, నిన్నే చెప్పేశానుగా వాళ్ళందరికీ?"

"కానీ పొద్దున్నే నేను సూర్యంతో మీ స్టూడెంట్స్ అందరిళ్ళకీ కబుర్లు పంపించాను. నువ్వు నీ నిర్ణయం మార్చుకున్నావనీ, కాబట్టి అందరూ ఎప్పటిలా ఇన్‌స్టిట్యూట్‌కి రావాల్సిందనీ..." చెప్పాడు నిరంజన్. "నీ సమస్యకు ఇమ్మీడియట్ సొల్యూషన్ అదేననిపించింది. అందుకే అలా చేశాను..."

"మంచిపని చేశారు" అంది వరలక్ష్మి కల్పించుకుంటూ. "మరిహనేం అన్నయ్యగారూ ముందు లేవండి... తర్వాత సంగతి తర్వాత చూసుకోవచ్చు. స్టూడెంట్స్ వచ్చేసేవేళయింది. లేవండి లేవండి" అంటూ దయాసాగర్‌ని ఉత్సాహపరిచింది.

"థాంక్స్‌రా" అన్నాడు దయాసాగర్ నిరంజన్‌వైపు చూస్తూ.

"అలాగే చెల్లెమ్మా" అన్నాడు వరలక్ష్మివైపు చూస్తూ.

అతనికింకా చిత్రంగా అనిపించింది.

మరికాసేపట్లో తన ఇంట్లో తండ్రిముందు తల దించుకుని వుండాల్సొస్తుందనుకుంటే ఇంతలోనే ప్లేటు తిరగబడిపోయి మళ్ళీ ఎప్పటిలా పాఠాలు చెప్పుకోవాల్సి వస్తోంది.

'ఆహా! విధి ఎంత విచిత్రమైనది?' అనుకున్నాడు దయాసాగర్.



ఓ గంట తర్వాత...

దయాసాగర్ తస కోచింగ్ సెంటర్లో అధ్యాపక స్థానంలో కూర్చుని వున్నాడు.

స్టూడెంట్స్ అంతా - నిన్న వచ్చినవాళ్ళలో ఒక్కరు కూడా బీరుపోకుండా మొత్తం అందరూ వచ్చేశారు.

దయాసాగర్ తన నిర్ణయాన్ని మార్చుకున్నందుకు అందరూ తమ హర్షాన్ని వ్యక్తంచేశారు.

"మీ అందరికీ నామీదా, ఈ కోచింగ్ సెంటర్‌మీదా వున్న అభిమానానికి నా కృతజ్ఞతలు..." అంటూ ఫార్మల్‌గా వాళ్ళందరికీ థాంక్స్ చెప్పి పాఠాలు చెప్పడానికి ఉద్యుక్తుడయ్యాడు.

అంతలో...

"మే ఐ కమిన్ సార్?" అంటూ రెండు ఆడస్వరాలు గుమ్మందగ్గర్నుండి సంయుక్తంగా వినిపించాయి.

"ఎస్..." అంటూనే అటువైపు తిరిగిన దయాసాగర్ నిశ్చేష్టుడయ్యాడు. అతని నోరు తెరుచుకున్నది తెరుచుకున్నట్టే వుండిపోయింది.

ఎందుకంటే... ఎదురుగా లలితా, రజితలు ముసిముసి నవ్వులు చిలకరిస్తూ.

వాళ్ళిద్దరూ ఇతని పర్మిషన్‌కోసం ఎదురు చూడకుండా నేరుగా లోపలికొచ్చేసి తమతమ స్థానాల్లో, ఒకరిపక్కన ఒకరు జంటగా కూర్చున్నారు.

దయాసాగర్ ఇంకా ఆశ్చర్యంగానే చూస్తున్నాడు వాళ్ళవైపు.

ఇన్నాళ్ళూ పూర్తిగా ఎగనామం పెట్టేసినవాళ్ళు సడన్‌గా ఇవ్వాళ ఎందుకిలా ప్రత్యక్షమయినట్టు?

అనలేముఖాలు పెట్టుకుని రాగలిగారు?

ఏ ముఖాలేముందీ, చిరునవ్వు ముఖాల్తోనే వచ్చారు. కనిపిస్తూనే వుందిగా?

కానీ ఎందుకొచ్చినట్టు?

వాళ్ళని చూస్తుంటే భయంగా కూడా అనిపించింది దయాసాగర్‌కి... వాళ్ళు మళ్ళీ ఏం పీకలమీదకు తెస్తారోనని.

"ఏంటి మాష్టారూ అలా చూస్తున్నారు. ఇన్నాళ్ళూ ఏవో పన్లుండి రాలేకపోయాం. ఇపుడు పనులన్నీ చక్కబెట్టేసుకున్నాం కాబట్టి వచ్చాం. ఏంటి అలా కొత్తమొహాల్ని చూసినట్టు చూస్తున్నారు..." అదోలా తలెగరేస్తూ గమ్మత్తుగా నవ్వింది రజిత.

'నోర్ముయ్యవే దొంగముండా!' అందామనిపించిందిగానీ, అంతమందిలో ఆమెనలా ఇన్సల్ట్ చేయలేకపోయాడు దయాసాగర్.

అంతలో అతన్నాశ్చర్యంలో ముంచెత్తుతూ అంది రజిత - "అన్నట్టు మీ డబ్బు వరలక్ష్మి గారికి ఇచ్చి వస్తున్నాం మాష్టారూ! కాస్త లేటయినందుకు మన్నించండి..."

ఇదేదో మరో కుట్రగాని కాదుగదా? అనిపించింది దయాసాగర్‌కి.

"అలాగా?" అన్నాడు ముఖంలో ఏ భావమూ వ్యక్తంచేయకుండా.

"అవును మాష్టారూ! నేరుగా మీకే ఇద్దును గానీ... దాని వెనక మీరు తెలుసుకోవాల్సిన పెద్ద కథొకటి వుండంవల్ల వరలక్ష్మిగారికిచ్చొచ్చాను. ఆమెనుండి ఆ డబ్బిడిగి తీసుకోవడంతోపాటు ఆ కథ కూడా అడిగి తెలుసుకోవాల్సిందిగా నా ప్రార్థన..." అని ఓమారు లలిత వైపు చూసి ఆ తర్వాత తల దించుకుంది రజిత.

ఆ మాటల అంతర్యమేమిటో అర్థంకాని దయాసాగర్ - వీళ్ళిద్దరూ మళ్ళీ ఏదో కొంప ముంచడానికే వచ్చారు అనుకున్నాడు గాభరాగా.

క్లాసులోని మిగతా స్టూడెంట్సుక్కూడా ఈ గోలేమిటో అర్థంకాలేదు.

అయినా దయాసాగర్‌మీదున్న గౌరవంకొద్దీ నిశ్శబ్దంగా కూర్చున్నారు.

అంతలో లలిత లేచి నిలబడింది.

చకచకా అడుగులేస్తూ దయాసాగర్ పక్కకెళ్ళి నిలబడి స్టూడెంట్స్ అందర్నీ ఉద్దేశించి చెప్పింది.

"మై డియర్ ఫ్రెండ్స్! మీ అందరికీ ఓ శుభవార్త!"

విద్యార్థుల్లో చిన్నపాటి కలకలం.

ఏవిటన్నట్టు చూశారంతా ఆమెవైపు కుతూహలంగా.

"మన దయాసాగర్ మాష్టారు త్వరలోనే ఓ ఇంటివారు కాబోతున్నారు..." అంటూ అనౌన్స్ చేసింది లలిత.

విద్యార్థుల్లో కొందరు చప్పట్లు కొడుతుండగా-

"లలితా!" అన్నాడు దయాసాగర్ ఆశ్చర్యంలోనే కోపాన్ని మిళితంచేస్తూ.

లలిత అదేం పట్టించుకోకుండా మళ్ళీ అంది విద్యార్థులతో.

"ఇంతకీ వధువెవరో తెలుసా?"

"ఎవరు?" "ఎవరు?" "ఎవరు?" - అనేక కంఠాలు ఒకేసారి మోగాయి.

లలిత చటుక్కున గుమ్మంవైపు గెంతి "నేనే" అని బిగ్గరగా అరిచి రెప్పపాటుకాలంలో అక్కణ్ణించి పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయింది.

విద్యార్థులు ఈలలు! చప్పట్లు! 'హిప్ హిప్ హుర్రే!!!' అంటూ అరుపులు!

వాటన్నిటిమధ్యా సంభ్రమానందాశ్చర్యాలలో మునిగిపోయాడు దయాసాగర్.

★ ★ ★

కాలగర్భంలో ఓ ఆరేళ్ళు కరిగిపోయాక...

ఒకరోజు...

బడినుండి ఒంటిమీద చొక్కాలేకుండా తిరిగొచ్చిన కృపాసాగర్‌ని చూసి ఆశ్చర్యపోయాడు దయాసాగర్.

కృపాసాగర్ దయాసాగర్ కొడుకు. వయసు నాలుగున్నరేళ్ళు. చదువుతున్నది ఎల్కేజీ.

"నీ చొక్కా... నీ చొక్కా ఏమైందిరా?" అన్నాడు దయాసాగర్ గాభరాగా.

"మలేమో... మలేమో..." అని ముద్దుముద్దు మాటల్తో ప్రాంభించి వివరించాడు కృపాసాగర్.

వాడు స్కూలునుండొస్తుంటే దార్లో ఓ కుర్రాడు చొక్కా లేకుండా మట్టిలో దొర్లుతూ కనిపించాట్ట. పోన్లే తనకి ఇంటిదగ్గర బోలెడన్ని చొక్కాలున్నాయికదాని తన ఒంటిమీది చొక్కా విప్పి వాడికిచ్చేసి వచ్చేట్ట!

పాపం... వాడు చెప్పటం ముద్దుముద్దుగానే చెప్పినా దయాసాగర్‌కి చిర్రెత్తుకొచ్చింది.

"అయితేమాత్రం నీ చొక్కా వాడికివ్వడమేంట్రా?" అని కోపంగా అరుస్తూ వాడి వీపు మీద ఓ చరుపు చరిచాడు.

అంతే!

ఆ దెబ్బతో వాడు రాగాలాపన ప్రారంభించాడు.

"చేసిన వెధవపని చాలక పైగా ఏడుపొకటా? వీపు చీరేస్తాను మళ్ళీ ఇంకెప్పుడైనా ఇలాంటి పన్లు చేశావంటే..." అంటూ మరో దెబ్బ వెయ్యడానికి మళ్ళీ చెయ్యెత్తాడు దయాసాగర్.

"ఊరుకోండి చినబాబుగారూ! బుల్లిబాబుగారికేం తెల్సూ?" అంటూ చటుక్కున కృపాసాగర్‌ని చంకనేసుకున్నాడు సాంబడు ఎక్కణ్ణుంచో దూసుకొచ్చి.

"నువ్ ముందు దింపరా వాణ్ని..." అన్నాడు దయాసాగర్ కోపంగా.

"దింపితే ఏం చేస్తారు? మరో నాలుగు బాత్తారా? అన్నీ అయ్యబుద్ధులే వచ్చాయ్ వాడికి. అందుకు సంబరపడాల్సింది పోయి చిందులేస్తారేం?" అంది అప్పుడే లోపల్నుండి వచ్చిన లలిత చిరుకోపంగా.

"నీకు తెలియదు నువ్వూరుకో లలితా! మొక్కప్పుడే వంచాలి ఇలాంటివాళ్ళని. లేకపోతే పెద్దయ్యాక ఎందుకూ కొరగాకుండా పోతారు. వేలెడంత లేడు ఇప్పట్నించే వీడిలో ఇంత జాలిగుణమైతే ఎలా?" అన్నాడు దయాసాగర్ పిడికిళ్ళు బిగిస్తూ.

"చాల్లే నోర్ముయ్యరా!" అంది అప్పుడే అక్కడికొచ్చిన అఖిలాండేశ్వరి.

"పసినాగన్నకి ఏం తెలుసని ఇంత రాద్ధాంతం చేస్తున్నావ్!" అంది సాంబడి చేతిలోంచి మనవణ్ణి అందుకుంటూ.

"నువ్వుండమ్మా... ఇప్పుడు పసినాగన్నే కావచ్చు, కానీ ఇలాంటి విషయాల్లో ఇప్పట్నించే బుద్ధిగరపకపోతే రేప్పొద్దున్న వెర్రినాగన్నై కూర్చుంటాడు..." తల్లివంక కోపంగా చూస్తూ అన్నాడు దయాసాగర్.

వాలుకుర్చీలో కూర్చుని ఇదంతా ఓ కంట గమనిస్తూ కూడా అప్పటిదాకా నోరు మెదపని రాయుడు... అప్పుడు జోక్యం చేసుకున్నాడు. "ఒకప్పుడు నువ్వూ ఇలా చేసినవాడివేరా బడుద్ధాయ్! నీకు జ్ఞానోదయం కలగడానికి, అదైనా కోడలి పుణ్యమాని, ఇరవై ఎనిమిదేళ్ళు పట్టింది. అలాంటిది వాడికి నాలుగేళ్ళకే బుద్ధి రావాలీ అంటే ఎలా?"

"అయితే వాణ్ని మందలించడం తప్పంటారా?" అన్నాడు దయాసాగర్ ఉక్రోషంగా.

"మందలించడం తప్పుకాదు. కానీ పసివాడని కూడా చూడకుండా ఎడాపెడా బాదెయ్యడం తప్పు" భర్తవంక చురచురా చూస్తూ అత్తగారి చేతుల్లోంచి తనయుణ్ణి తన చేతుల్లోకి తీసుకుంది లలిత.

"సరే మీ ఖర్మ... అఘోరించండి" అనేసి విసురుగా అక్కడ్నించి వెళ్ళిపోయాడు దయాసాగర్.

అందరూ ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు.

★

# చతురకతలు

## సహజమైన 'సీను'

వాహిని పొద్దున్నే రింగ్ అవుతూన్న ఫోన్ను అందుకోగానే, అంకుల్ శర్మ గొంతు వినిపించింది. "హల్లో! వాహినీ! ఇవాళ స్టూడియోలో మా షూటింగ్ జరుగుతోంది. 'రాజకీయ నాయకుడి ఉపన్యాసం' సీనును తీస్తున్నాము! వినే శ్రోతలుగా చాలామంది యాక్టర్లు కావాలి! నువ్వూ మీ ఫ్యామిలీ ఫ్రెండ్సూ రండి. ఫ్రంట్ సీటులో నువ్వే కూర్చుందువుగాని. నీ ఫేస్ ఫొటోజెనిక్గా ఉంటుంది. కాబట్టి నిన్ను క్లోజప్లో తీస్తాము. తప్పకుండా సాయంత్రం నాలుగయ్యేసరికి రండమ్మా!" అని చెప్పారు.

అంకుల్ మాటలను వినగానే, వాహిని మనసు ఆనందంతో నిండిపోయింది. ఆమెకు సినిమాల్లో నటించాలనే తపన లేదుగానీ, సాక్షాత్తూ పెదనాన్నగారే సినీ నిర్మాత అయినప్పుడు, ఈ అవకాశాన్ని వదులుకునేంత పిచ్చిదేమీ కాదు. రంగుల తెరమీద రెండుమూడు నిముషాలపాటు నాలుగైదుసార్లు తన ముఖాన్ని చూసుకోవచ్చుననే ఊహ ఆమెను ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

ఎప్పుడెప్పుడు సాయంత్రమవుతుందా, స్టూడియోలో రెక్కలుగట్టుకుని వాలుదామా అని ఒకటే ఉత్కంఠ! నాలుగ్గంటలదాకా ఆగలేక, మూడు గంటలకే బయలుదేరి స్టూడియోకి తమ్ముళ్ళు, చెల్లెళ్ళతో సహా చేరింది. తీరా అక్కడికి చేరుకునేసరికి కెమెరామెన్లు, ఎలక్ట్రీషియన్లు మాత్రమే కనపడ్డారు. నాలుగయ్యేదాకా ప్రతి నిముషమూ చాలా బోర్గా ఫీలయింది.

నాలుగున్నరకిగాని, నటీనటవర్గం అందరూ రాలేదు. ప్రొడ్యూసర్ శర్మ, "ఏమ్మా! వాహినీ! ఎంతసేపైంది వచ్చి?" అని పలకరించారు. ఆ తర్వాత సెట్టింగ్స్ సరిగ్గా ఉన్నాయో లేదోనని, దర్శకునితో చర్చిస్తూ పరిశీలనలో నిమగ్నమైపోయారు. స్టేజీ, తోరణాలు, కుర్చీలు వగైరా సెట్టింగ్స్మొత్తం తృప్తిగా కుదిరేదాకా సర్దించారు.



రాజకీయనాయకుని వేషధారి, మేకప్ పూర్త య్యాక స్టేజీమీద నిలబడ్డాడు.

వాహినీ వాళ్ళు మొదటి రెండు వరుసల్లో ఎలాగో తంటాలుపడి, సర్దుకు కూర్చున్నారు. ప్రేక్షకులుగా చాలామందే వచ్చి, కూర్చున్నారు.

లీడర్ గొంతు సవరించుకున్నాడు.

ఫోకస్ లైట్లు వెలిగాయి. కెమేరా కదుల్తూ న్నది. వాహిని తదితర శ్రోతల చూపులన్నీ లీడర్ మీదగాక, కెమేరామీదనే సెటిల య్యాయి.

కెమేరా తమ వైపు తిరగగానే, ఏ ఫోజులో కూర్చోవాలోననే ఆతృతతో ప్రతి ఒక్కళ్ళూ, తమ డ్రస్సులనూ, జడలనూ, క్రాపులనూ సర్దుకుంటూ కెమేరా వైపు రెప్పవేయకుండా అలానే చూస్తున్నారు.

"యాక్షన్" అని దర్శకుడు కేకవేశాడు.

లీడర్ గొంతు సవరించుకుని, "సోదరసోదరీమణులారా?" అన్నాడు. వెంటనే దర్శకుడు 'కట్‌కట్' అని అరిచాడు.

"సోదరీలో 'ద' మీద అంత స్ట్రెస్ ఇచ్చి, పలక్కండి! 'దరిద్రమణులారా' అన్నట్లుగా వినిపిస్తున్నది" అంటూ ఆ నటునికి కాస్సేపు డైరెక్షన్స్ ఇచ్చి, మళ్ళీ షూటింగ్‌ని మొదలుపెట్టారు.

లీడర్‌గారు ఆ ఒక్క మాటను పలకడానికే నాలుగుసార్లు రీటేక్‌లు తీశారు. అలాగ... అర గంట అయిపోయింది.

ఈ లోపున కొన్ని ఫోకస్‌లైట్లు ఆగిపోయాయి. "ఒక ఫేస్ కరెంటుపోయింది" అన్నారు. ఆ ఫేస్ కరెంటు వచ్చి ఆ మూడు లైట్లు వెలిగాక, మళ్ళీ షూటింగ్ మొదలెట్టారు.

లీడర్‌గారు రెండుపదాలు పలకగానే, వేరే సైడులోని లైట్లు ఆరిపోయాయి. "మైగాడ్! ఈసారి సెకండ్ ఫేస్‌పోయింది" అన్నారు ఎవరో.

కరెంటు ఇలా వంతులు వేసుకుని, స్ట్రైక్ చేస్తుండగానే, రెండు గంటలు గడిచిపోయాయి. అసరికి ఫ్యాన్‌లు కూడా ఆగిపోవడం వలన చెమటపోసి నటీనటుల మేకప్ అంతా చెరిగిపోతోంది. ప్రేక్షక జనాభా దట్టంగా పట్టించుకువచ్చిన మేకప్ కూడా నీరు కారిపోతున్నది.

"అక్కా! మన పౌడరంతా కరిగిపోయింది. ఇంక మేము కూడా స్క్రీన్‌మీద, విలన్ అనుచరుల్లాగే కనబడ్తామేమో!" అన్నాడు తమ్ముడు బిక్కమొహం వేసి.

వాహిని చెల్లెళ్ళకు ఏడుపొక్కటే తక్కువగా ఉంది!

ఇంకో గంట గడిచేసరికి కరెంట్ కరుణించింది. ఓపిక ఉన్నవాళ్ళందరూ గబగబా మేకప్‌లు సరిచేసుకోసాగారు.

వాహినికి రాత్రి ఫ్రెండ్ పెళ్ళికి వెళ్ళి రావడం వలన సరిగా నిద్రలేదేమో, నిద్ర ముంచుకువస్తున్నది.

"మాయదారి నిద్ర" అనుకుంటూ కుర్చీలో అలాగే నిద్రపోయింది! ఆమెకు షూటింగ్ అయిపోయిన సంగతి కూడా తెలీలేదు.

అంతా అయాక, అంకుల్, దర్శకుడు కూడా "నువ్వు కెమేరాలో చాలా బాగా వచ్చావమ్మా!" అన్నాడు వాహినిని అభినందిస్తూ!

"నేను నిద్రపోతూ, అలా పడి ఉన్నానుగదా కనీసం నన్ను లేపనేలేదు" అన్నది వాహిని తమ్ముళ్ళను కసురుకుంటూ, మొహం చిన్న బుచ్చుకుని!

"అందుకే నేచురల్‌గా వచ్చిందమ్మా! రాజకీయ నాయకుల ఉపన్యాసాలు వినే వాళ్ళలో సగంమంది కునుకులు తీస్తూనే ఉంటారమ్మా!" అన్నారు అంకుల్ శర్మగారు.

**పి. కుసుమకుమారి**

---

## ప్రశ్న

**ఆ**రోజే కుక్కుటేశ్వర్రావ్‌గారు ఆఫీసరుగా ఛార్జి తీసుకోబోతున్నారు. ఆయన మహా కోపిష్టనీ, దుర్వాసుడికి పెద్దన్నగారనీ ఆ నోటా ఈ నోటా విన్న స్టాఫ్ హడలిపోతూ ఆఫీసు టైంకు ఓ పది నిముషాలు ముందుగానే వచ్చి బుద్ధిమంతుల్లా సీట్లలో చేరి తలొంచుకుని పనిచేసుకుంటున్నారు.

చేరిన తర్వాత మొదటి నాలుగు రోజులూ

ఏ కళనున్నాడోగానీ అయిదో రోజునుంచీ అరుపులు, కేకలు ప్రారంభమయ్యాయి. ఫైళ్లలో ఏ చిన్న తప్పున్నా ఎక్సరే కళ్లతో పట్టేసి సదరు ఉద్యోగిని చింతచెట్టుని దులిపినట్టు దులిపేసి, మళ్లీ వాళ్లాతప్పు చేయకూడదని ఒట్టేట్టుకునేలా ప్రవర్తిస్తున్నారు కుక్కుటేశ్వర్రావుగారు. ఈయనగారు ఆఫీసులోనే ఇలానా?... లేక ఇంట్లోనూ, బయటా కూడా ఇంతేనా...? అన్న ఓ జటిలమయిన ప్రశ్నకి తొందర్లోనే సమాధానం దొరికింది స్టాఫ్‌కి.

ఎలాగంటే... ఇంచుమించు రెండురోజులకోసారి ఇంటినుంచి ఫోను రావడం అదీ ఆయన భార్యనుంచే రావడం మామూలయితే... ఫోనులో ఆయన పెట్టేకేకలకి, అదిలింపులకి ఆవిడ పట్టుకో చెంబుడు కన్నీళ్లయినా కారుస్తూ వుండవచ్చునుకున్న స్టాఫ్‌కి కంటికి కనిపించని ఆ స్త్రీ రత్నం మీద అమాంతం ఓ పుట్టెడు జాలి పుట్టింది. కరెంట్ మీటరు, గ్యాస్‌సిలెండరూ... లాంటి నిత్యకృత్య వ్యవహారాలు కూడా ఆవిడ ఫోనుచేసి చెప్పవలసిందే, ఈయన తిట్ట వలసిందే. పైగా అదేదో అమెరికాకాల్‌లా అంతదూరం వినిపించాలన్నట్టు అరచి చెప్పడంతో స్టాఫ్ అందరికీ ఆయన ఇంటా బయటా కూడా యముడే అన్న సంగతి తెలిసిపోయింది.

ఈ పరిస్థితుల్లో తను అప్లయి చేసిన లోను శాంక్షన్ చేయించుకోడానికి ఆఫీసరుగారిని ఎలా ప్రొసీడ్ అవ్వాలా అని బుర్రబద్దలు కొట్టుకున్నాడు బ్రహ్మానందం. ఈ లెఖ్ఖన ఇంటి దగ్గర కలవడమేనయమని, కనీసం ఆ తిట్టే తిట్లు మిగతా స్టాఫ్ వినే అవకాశం వుండదనీ నిర్ణయించుకుని, ఆ సాయంత్రమే ఆఫీసరు గారి ఇంటి అడ్రస్ సంపాదించి బయల్దేరాడు. ఆయన ఇల్లు రిటయిరయిన తన మేనమామ ఇంటి పక్కనే అని తెలిసి మరీ సంతోషించాడు.

ఆఫీసరుగారింటికి వెళ్లి గేటు తీసుకుని నెమ్మదిగా లోపలకు వెళ్లాడు బ్రహ్మానందం. తలుపులు మూసివున్నాయి. కాలింగ్‌బెల్ కొడదామనుకునేంతలో లోపలినుంచి ఓ ఆడపులి గర్జన వినిపించింది.

"అసలు మీకు పొద్దున్ననేనేం చెప్పాను? ఈ విషయం మీద ఇదివరకే మీకు వార్నింగివ్వడం కూడా అయింది గదా" అంటోందా గొంతు.

"అది కాదు రమా! మరీ... అదీ..." అంటూ అప్పుడే పుట్టిన పిల్లిపిల్లలా చిన్నగా 'మ్యావ్, మ్యావ్' అంటున్నట్టు ఆఫీసరుగారి గొంతు. అంతలోనే మళ్లీ ఆడపులి గర్జన.



అదేదో దుర్ముహూర్తంలా అనిపించి గబగబా బయటకొచ్చి పక్కనున్న మేనమామింటి కెళ్లాడు బ్రహ్మానందం. పలకరింపులయ్యాక తనొచ్చిన విషయాన్ని, జరిగిన సంఘటనలనీ మేనమామకు వివరించాడు.

''ఒరేయ్! ఆయన సంగతి పాపం మీకెవరికీ తెలియదురా, నన్నడుగు నేచెవుతా. అదే కాదు ఈ చుట్టు పక్కల ఏ ఇంటి విషయమైనా నాచెవిదాటి పోదబ్బాయ్. మీ ఆఫీసరుగారికి భార్యంటే సింహస్వప్నం'' అన్నాడు అతడి మేనమామ.

''నో... నేన్నమ్మను మావయ్యా! ఆవిడనుంచి ఆఫీసుకు వచ్చే ఫోనుకాల్స్, ఆవిడని ఆయన తిట్టే తిట్లూ... అబ్బే! అన్నమంతా పట్టి చూడఖర్లా'' అన్నాడు బ్రహ్మానందం.

''ఓరి వాజమ్మా! ఆ రహస్యం కూడా వాళ్ల పనివాడి ద్వారా కూపీ లాగానురా. అప్పుడప్పుడు పనికుర్రాడిని బయటనుండి ఆఫీసుకు ఫోను చెయ్యమని చెప్పి, అందులో భార్యను తిట్టినట్టు తిట్టి తనో ఛండశాసనుడనిపించుకుంటాడట స్టాఫ్‌ముందు'' రహస్యాన్ని విప్పి చెప్పాడు మేనమామ.

మతిపోయింది బ్రహ్మానందానికి. అందులోంచి తేరుకునేలోగా మరో భయంకరమైన ప్రశ్న అతడిముందు నిలిచింది.

మరి తన లోను శాంక్షను చేయించుకుందుకు ఆయన్ని ఇంటి దగ్గర ప్రాధేయపడాలా? ఆఫీసులోనా? అని.

**రాధాశివమోహన్**

---

## పెద్దరికం

''**జా**నకమ్మను ఎన్నికల్లో నిలబెడితే వార్డు మెంబరుగా గెలవటం గ్యారంటీ'' అనేది అందరూ అనుకునే మాటే. అసలు ఆ కాలనీలో ఆడవాళ్లు నలుగురు కలిసి ఏ పేరంటానికి వెళ్ళినా, ఏ బస్ స్టాండులో నిలబడి మాట్లాడుకున్నా వాళ్ళ మధ్య జానకమ్మ మాట రాక మానదు.

జానకమ్మది చాలా విచిత్రమైన మనస్తత్వం. ఆమె పెద్దరికాన్ని నిలబెట్టినవాళ్ళకి తనకు సాధ్యమైనంత సహాయం చేస్తుంది. ఆమెని ఏ కొంచెం నిర్లక్ష్యంచేసినా వాళ్ళని తిట్టిపోసేస్తుంది.

'ఆవిడ దేవత' అని కొందరంటే, 'నోటి దురుసుతనం తప్ప మంచిదే' అని కొందరూ,



'అమ్మో! ఆవిడా! చాలా డేంజరు మనిషి' అని కొందరూ అంటూంటారు.

జానకమ్మ భర్త రామయ్య. వాళ్లకి ఒక కొడుకు, ఒక కూతురు. కొడుకు డాక్టరు, కూతురు డాక్టరు భార్య. ఇద్దరూ విదేశాల్లోనే ఉన్నారు. రామయ్య గవర్నమెంటు ఉద్యోగం చేసి రిటైర్ అయి, పెన్షన్, బ్యాంకు బాలెన్స్‌తో స్వంత ఇంట్లో హాయిగా కాలక్షేపం చేస్తున్నారు.

ఒకరోజు...

"మీరు ఈ రోజు ఎక్కడకీ వెళ్లకండి. మన పక్కింటి కామాక్షికి ఒంట్లో నలతగా ఉందంది. నెలలు నిండిన పిల్ల, భర్తేమో కాంపుకి వెళ్ళేడు. ఏవేళ నొప్పులొచ్చినా ఆటో తేవడానికైనా తోడు ఉండాలిగా. పాపం నన్నే నమ్ముకుంది" అంది.

రామయ్యకు ఇటువంటివి అలవాటే. ఆమె చేసే సహాయాలకి అతనూ మనస్ఫూర్తిగానే సహకరిస్తాడు.

జానకమ్మ ఇంట్లో పని పూర్తి చేసుకొని పక్కింటి కామాక్షి వద్దకు బయలుదేరింది.

"ఏమ్మా! ఎలా ఉంది?"

"బాగానే ఉంది పిన్నిగారూ! రాత్రి కొంచెం భయంవేసిందిగానీ ఇంటివాళ్ల బామ్మగారు వచ్చి ఇక్కడే పడుకున్నారు" అంది.

"వాళ్ళు మంచివాళ్లు కాదమ్మాయ్, విశ్వాసఘాతకులు జాగ్రత్త" అంటూ జానకమ్మ ఆవేశంగా చెప్పుకుపోతూంటే కామాక్షికి ఏం చేయాలో అర్థంకాక అలా వింటూ ఉండిపోయింది.

కామాక్షి వాళ్ళు ఆ ఇంట్లోకి వచ్చి ఏడాదయింది. భర్తకి కాంపులుండటం మూలంగా ఆమెకు తీరిక ఎక్కువ. అటు ఇంటివాళ్ళతోనూ, ఇటు పక్కఇంటివాళ్ళతోనూ బాగానే కల్సి వుండేది. కానీ రెండు వారాల క్రితం ఇంటివాళ్లు ఏదో సినిమాకు వెళుతూ, తనను పిలుచుకువెళ్ళలేదన్న కారణంగా జానకమ్మ వాళ్ళతో మాట్లాడటం మానేసింది. జానకమ్మ కామాక్షిని చాలా ప్రేమగా చూస్తుంది. ఒట్టి మనిషివికావు, అంటూ జాగ్రత్తలు చెప్పేది. ఆ ఇంటివాళ్ళతో బెడిసిన తర్వాత ఆ ఇల్లు ఖాళీ చేసి తనకి అటువైపున్న మరో ఇంట్లోకి మారమని కామాక్షిని రోజూ చెవినిల్లుకట్టుకుని పోరుతోంది. కామాక్షికేమో ఇప్పుడున్న ఇల్లు సౌకర్యంగా ఉండటమేగాక అద్దెకూడా తక్కువ. అందుకే కామాక్షి ఎటూ తేల్చక ఊరుకుంది.

"చూడు కామాక్షీ! ఇప్పుడు ఇద్దరున్నారు. ఈ రెండు రూమ్‌లు సరిపోతున్నాయి. రేపు కొడుకు పుట్టేడనుకో బాబుని చూసుకోవడానికి ఒక మనిషి ఉండాలా! ఎవరో ఒకళ్ళు వచ్చిపోతూ ఉంటారా! బాబుకు కొంచెం పాకే వయసు వచ్చిందనుకో వాడు ఆడుకోవడానికి ఈ రెండు గదులు ఏం సరిపోతాయి. ఒక హాలు ఉండాలా! అందుకే నా మాట విని మా ప్రక్క పోర్షన్ తీసుకో. అద్దె ఇప్పటికంటే ఒక వంద రూపాయలు ఎక్కువయితేనేం ఒక హాలు, బెడ్‌రూం, కిచెన్ ఎంత బాగుంది. అబ్బాయి ఈవాళ వచ్చేస్తాడు కదా! ఇద్దరూ కలిసి ఆలోచించుకుని వెంటనే తీసేసుకోండి. వస్తానమ్మాయ్, బాగా లేకపోతే కిటికీలోనుంచి కేకేయి. మీ బాబాయి ఇంట్లోనే ఉన్నారు" అంటూ లేచి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి భర్త రాగానే కామాక్షి ఈ విషయం చెప్పి అతన్ని ఒప్పించింది. మర్నాడు పనైపోయిన తరువాత అడ్వాన్స్ డబ్బు తీసుకొని జానకమ్మ ఇంటికి బయలుదేరింది కామాక్షి.

జానకమ్మగారి ఇంట్లో అడుగు పెట్టేసరికి "విశ్వాసఘాతకులు ఎంత చేసినా విశ్వాసం లేదు" అంటూ జానకమ్మ ఎవరినో తిట్టుకుంటూంది. కామాక్షిని చూడగానే, "చూశావా కామాక్షీ! ఆ పక్క ఇంటివాళ్ళు ఎంత పని చేసేరో, నాతో మాట మాత్రమైనా చెప్పకుండా నిన్న ఎగ్జిబిషన్‌కి వెళ్లేరు. వాళ్ళకి అంత సాయం చేసేనుగదా! ఇలా చేయటం న్యాయమా చెప్పమ్మాయ్" అంటూ మహా ఆవేశంగా ఉపన్యసిస్తున్న జానకమ్మకేసి తెల్లబోయి చూస్తూ కామాక్షి ఆలోచనలోపడింది, ఇల్లు మారటానికి అడ్వాన్సు ఇవ్వాలా! వద్దాని!

**రాధిక**

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.

